# అపరాధ పరిశోధన

రు. 6 | డిసెంబరు '84

సప్లిమెంట్ 132



'PRABHAKAR'

అపరాధ పరిశోధన అనుబంధం—132

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నేటి దానవులు

రచన: చంద్రశేఖర అజాద్

## రాక్షసుడు

రచన: టెంపోరావ్

## వెన్నెల్లో విహారం

రచన: బి. రాజేశ్వరి

## ఇంట్లో హంతకుడు

రచన: మిస్. కె. మధుబాల

అగ్ని కిరీటం - నాలుగవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్--132
డిసెంబరు, 1984
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్. మద్రాసు-1.

# నేటి దానవులు

## చంద్రశేఖర అజాద్

నిలువుటద్దం ముందు కూర్చుంది వాసంతి. అందులో తన మొఖం ఎంతో అందంగా కనిపిస్తోంది. కొంచెం పౌడర్ తీసుకొని మొఖానికి లైట్ గా అద్దింది. సెంట్ స్ప్రే చేసుకొంది. తలలో చిన్న మల్లెపూలదండ వుంది. లేచి నిలబడింది. తన అలంకారం తృప్తిగా ఉందనిపించాక వెనక్కు తిరిగింది.

హాండ్ బ్యాగ్ తెరిచి తిరిగి డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరకు వచ్చింది. సొరుగులాగి నెయిల్ పాలిష్, లిప్ స్టిక్, చిన్న పౌడర్ డబ్బా, ఖరీదయిన సెంట్ బ్యాగ్ లో సర్దుకుంది.

ఫారిన్ నైలెక్స్ చీరలో అద్భుతంగా, అప్సరసలా వుంది. చేతికున్న విదేశీ గడియారం వంక చూసింది.

టైం పదకొండు గంటలు కావస్తోంది.

"ఇంకా గంట" మెల్లగా అనుకొంది.

ఈలోపు ఏం చేయాలి? చల్లటిగాలి మేనును తాక

తోంది. ఆ గది ఎ.సి. చేయించబడింది. అత్యంత ఆధునికమైన స్టీరియో రికార్డర్ ఉంది. ఆమెకు సంగీతం వినాలనిపించటంలేదు.

నడుచుకుంటూ వెళ్ళి టి.వి. ఆన్ చేసి సోఫాలో కూర్చుంది. పదినిమిషాలకు మించి చూడలేకపోయింది. తిరిగి లేచి ఆఫ్ చేసింది. టీపాయ్‌మీదున్న గ్లాసులో నీళ్లు త్రాగింది.

ఫోన్ గణగణమంటూ మ్రోగింది.

అందుకొంది వాసంతి.

"హలో."

"వాసంతేనా మాట్లాడుతుంది" అవతలినుండి ఓ పురుషుడి కంఠం.

"అవును."

"వేరే ఎంగేజ్‌మెంట్స్ లేవుకదా."

"పన్నెండు గంటలకో ఎంగేజ్‌మెంట్ ఉంది."

"కాన్సిల్ చేసుకో."

"లేదు. సాధ్యంకాదు."

"నీకు తీరిగ్గా చెబుతాను. ఇది పొలిటికల్ ఇష్యూ. నువ్వు మరింకేం మాట్లాడకు" అవతల మాట్లాడుతున్న వ్యక్తి చనువుతో కూడిన అధికారంతో ఆజ్ఞాపించాడు.

"ఐయామ్ సారీ."

"ఆగాగు. ఫోన్ పెట్టేయకు" అవతలనుండి బిగ్గరగా వినిపించింది.

"నేను వస్తున్నా."

వాసంతి మౌనంగా రిసీవర్ క్రెడిల్ చేసింది.

ఆమె శూన్యంలోకి చూస్తోంది.

ఆలోచనల తరంగాలు ఉవ్వెత్తున లేచిపడుతున్నాయి.

తన జీవిత క్రమమంతా ఆమె కళ్ళకు కనిపిస్తోంది. ఆ జీవితం గుర్తుకు తెచ్చుకోవటం ఆమెకు ఇష్టంలేదు. బజర్ నొక్కింది.

పనిమనిషి లోపలకు వెళ్ళింది.

"కాఫీ చేసుకొస్తావా?"

"భోజనం చెయ్యండమ్మగారూ."

"ఆకలిగా లేదు."

"సరేనమ్మా."

పదినిమిషాల్లో వేడి కాఫీ వచ్చింది. త్రాగుతూ ఆలోచిస్తోంది. కాఫీ త్రాగి కప్పు క్రింద పెట్టాక హాల్లో బజర్ మ్రోగడం వినపడింది. పనిమనిషి తలుపు తీసింది.

ఖద్దరు బట్టలు ధరించిన ఓ పెద్దమనిషి కంగారుగా లోపలకొచ్చి, సరాసరి వాసంతి దగ్గరకు దూసుకొచ్చాడు.

"ఏమిటి వాసంతీ కోపమేమైనా వచ్చిందా?"

"కోపమా? దేనికి? ఎవరిమీద! కోపంవస్తే నేనెలా బ్రతకాలి?"

"ఈ రోజు గొప్ప ఛాన్స్....మంత్రిగారబ్బాయి."

"మంత్రా...." మధ్యలో అడిగింది.

"కాబోయే మంత్రి .... అపొజిషన్ లో అంత పవర్ ఫుల్. వాడిని గనక తృప్తిపెడితే ఇంక మన పంట పండినట్టే."

"సారీ అని చెప్పానుకదా. నా ప్రోగ్రాం ఫిక్స్ అయింది. ఈ సమయంలో నేనేం చెయ్యలేను."

"వంట్లో బాగోలేదని ఫోన్ చెయ్యి."

"నో__అది నా అంతరాత్మకు విరుద్ధం" దృఢంగా అంది వాసంతి.

"అంతరాత్మ.... జోకు వెయ్యకు."

"ఎప్పుడుపడితే అప్పుడు జోకులు వెయ్యటం నా కల వాటు లేదు."

"అంటే సీరియస్‌గా చెబుతున్నావా?"

"దీంట్లో సీరియస్ ఏముంది. నాకు వేరే ప్రోగ్రాం ఉంది. నా అసహాయతను అర్థం చేసుకోమంటున్నాను."

"నేనూ చెప్పేదదే. నా బిల్లులు చాలా పెండింగులో ఉన్నాయి. లక్షల రూపాయలు ఈసారితో సెటిలవు తాయి. మేటరాఫ్ టూ అవర్స్. నీకు నాలుగురెట్లు పే చేస్తాను. కమాన్" జేబులో చేయి పెట్టాడు.

"మీరు ఎంత ఇవ్వగలరన్నది ప్రశ్న కాదు. దయచేసి ఇంకెవరినైనా ట్రై చెయ్యండి."

అతని మొఖంలో రంగులు మారిపోయాయి.

"ఇంకెవరికో దొరక్క నీ దగ్గరకు రాలేదు. పెద్ద మనుషుల్తో యెలా వ్యవహరించాలో నేర్చుకోవటం మంచిది. నీ మేలు కోరి చెబుతున్నాను."

"మంచిది. మీ దయకు కృతజ్ఞతలు."

రక్తం మొఖంలోకి వచ్చి దతినికి.

"ఆఫ్టాల్ ...." ఆ తర్వాత మాటలు కంట్రోల్ చేసుకోలేని ఆవేశం మూలంగా పూర్తి చేయలేక పోయాడు.

వాసంతి కూడా కోపంతో కదిలిపోయింది.

"ఊఁ పూర్తిచెయ్ .... ఆఫ్టాల్ ఎ కాల్‌గర్ల్, ఎ బిచ్ నన్నే తిరస్కరిస్తుందా? అంతేగా నువ్వనేది? గెటవ్" అరిచింది.

అతను బుసలుకొడుతూ లేచాడు.

"నువ్వు .... నువ్వు ...." మాట్లాడలేకపోతున్నాడు.

"అవును. నేనే వాసంతిని. కాల్ గర్ల్ ని. బజారు మనిషిని. డబ్బుకోసం శరీరం అమ్ముకునే వేశ్యని. ఇంకా యెన్నెన్ని పేర్లు పెట్టి పిలుస్తారో వాటన్నింటిని. అంత మాత్రాన నేను మనిషిని కాదా? నాకో అభిప్రాయం అంటూ ఉండదా? నాకు నిజాయితీ లేదా? అంతరాత్మ ఉండంటే యెంత అవహేళనగా మాట్లాడారు? యే కాల్ గర్ల్ కోసం మీరు పరిగెత్తుకొచ్చారో అదే మనిషి ఆఫ్టాల్ అయిందా? నేను ఆల్ రెడీ యెవరికో ఎంగేజ్ కాబడ్డానని ముందునుండి చెబుతున్నాను. అతని దగ్గర పేమెంట్ తీసుకున్నాను. అయినా వాటన్నింటిని కాదని నీ దగ్గరకు రావాలి.

వేశ్యలు శరీరాన్ని అమ్ముకుంటారు. నీతి నిజాయితీలను కాదు. శరీరంతో చేసేదే వ్యభిచారం కాదు. ఈ వ్యభిచారం అన్ని రంగాల్లోనూ ఉంది. యూ మైండిట్. మాకూ అభిమానం ఉంది. దట్సాల్. నువ్వేదో చేస్తానంటూ నన్ను బెదిరిస్తున్నావ్. నేను నా వృత్తి ధర్మం పాటించటమే అన్యాయం అయితే.... నేరమయితే.... నువ్వేంచేసినా మోస్ట్ వెల్ కమ్!"

అనుకోని వర్షం ఒక్కసారి నిలువెల్లా తడిపేసినట్లయింది. అతని మొఖంనిండా చెమటలు....

"యూ వల్ పే ఫర్ దిస్" చాలా మెల్లగా వచ్చాయా మాటలు అతని నోటినుండి. అయినా వాసంతికామాటలు వినపడ్డాయి.

"జస్ట్ గెటవుట్ బ్లడీ రోగ్" అరిచింది.

అతను గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

"పెద్దమనిషి". ఆ పదం అంటే ఆమెకు చాలా అసహ్యం. ఆమె జీవితం ఇలా కావటం వెనక చాలా

మంది పెద్దమనుష్యులున్నారు.

వారి పెద్దరికం అంతా తెల్లటి బట్టల్లో, బోడితలల్లో, గోల్డు ఫ్రేమ్ కళ్ళద్దాల్లో, మూడయిదుల సిగరెట్ ప్యాకెట్లలో నిక్షిప్తం చేయబడింది.

కంట్రాక్టర్ బిల్లులు కావాలంటే, అసెంబ్లీ సీటు కావాలంటే, ఏం కావాలన్నా ఆడది కావాలి. మనీ + షి = మనిషి అని యెవరో రచయిత అన్నాడు. ఈ సమాజంలో అదెంతో నిజం. బ్లేడ్ల ప్రకటన నుండి మొదలయి యెలాంటి పనులకయినా స్త్రీని వినియోగించుకునే పెద్దమనుషుల్లో లేనివి కొన్ని ఉన్నాయి.

అవి.... అంతరాత్మ.... నిజాయితీ.

ఇందాకున్నంత ప్రశాంతత లేకపోయినా వెంటనే తేరుకోగలిగింది వాసంతి. తిరిగి మరోసారి లైట్‌గా మేకప్ చేసుకొని బయలుదేరింది.

వాకిట్లో వినయంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు డ్రైవర్.

"కారు తీసుకురా."

వినయంగా వెళ్ళి కారు గ్యారేజ్ నుండి బయటకు తెచ్చాడు.

వాసంతి ఎక్కగానే కారు కదిలింది.

ఆ కారుకు నల్లటి అద్దాలున్నాయి.

వెనకాల అద్దాలకు తెరలున్నాయి.

## 2

గాల్లోకి లేచింది విమానం.

అప్పటికే అందరూ బెల్టులు కట్టుకున్నారు.

ఆనందరావు తొలిసారిగా విమానంలో ప్రయాణం చేస్తున్నాడు.

అందుచేత ఆనందరావుకి యెంతో ఆనందంగా ఉంది. యే మూలో కొంచెం ఆందోళన కూడా ఉంది. ఇటీవల విమాన ప్రమాదాల వార్తలు చదివాడు. ఆ వార్తలు చదివినప్పుడల్లా జీవితంలో విమానయానం చేయకూడదనుకునేవాడు.

కానీ ఈ రోజు ధైర్యంచేసి యెక్కాడు. బెల్టులు విప్పుకున్నాక పైనుండి క్రిందకు చూడాలని ఆత్రంగా ఉంది. ముఖ్యంగా ఆకాశంనుండి చూస్తుంటే కొండలు గుట్టలు, నదులు, మనుషులు ఎలా కనిపిస్తారో చూడాలని చాలాకాలంగా భావిస్తున్నాడు, యెదురు చూస్తున్నాడు కూడా.

ఎయిర్ హోస్టెస్ చాలా ప్లీజింగ్ గా వుంది. ఆమె మొఖంలోకి చూస్తుంటే, జీవితాంతం ఇలా గాల్లోనే యెగురుతూ ఆమెతో ఉండాలనిపిస్తుంది. విమానం ఇప్పుడు సాఫీగా నడుస్తోంది.

ఆమె యెవరినో నవ్వుతూ పలకరిస్తోంది.

ఆమె తన దగ్గరకు వచ్చి మాట్లాడితే బాగుండుననుకున్నాడు ఆనందరావు. అతని ప్రక్కన ఓ నడివయస్సు వ్యక్తి కూర్చున్నాడు. ఆయన ఈ ప్రపంచంతో యేం సంబంధంలేనట్లుగా యెటో చూస్తున్నాడు.

ఆనందరావు ముందునుండే ఓ వ్యక్తి నడుచుకుంటూ వెళ్ళాడు. ఆ విషయం ఆనందరావు అంతగా పట్టించుకోలేదు. ఆనందరావు చూపులన్నీ ఎయిర్ హోస్టెస్ మీదే నిలిచి ఉన్నాయి.

ఇంతలో యెవరిదో కెవ్వున కేక!

ఆనందరావు వెనక యెవరో నిలబడ్డారు.

"దయచేసి వినండి. యెవరూ కదలొద్దు. ప్లేన్

హైజాక్ చేయబడింది. మీ ఎవరిమీదా మాకు ద్వేషం లేదు. యేమాత్రం పిచ్చివేషాలు వేసినా నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాం."

ఆనందరావు తలనుండి పుట్టుకొచ్చాయి చెమటలు.

"ఇదేం ఖర్మరా భగవంతుడా. యెక్క కెక్కక విమానం యెక్కితే" అనుకున్నాడు.

అంతులేని భయం క్షణాల్లో ఆనందరావుని ఆవరించుకుంది. కడుపులో శూన్యంగానూ, దేవుతున్నట్లనిపించింది. సీట్లో వెనక్కు వాలిపోయాడు. కళ్ళు చూస్తున్నా మాట్లాడలేకపోతున్నాడు. అకస్మాత్తుగా కలిగిన భయం తాలూకు లక్షణాలవి.

ఆనందరావు ప్రక్కనున్న వ్యక్తి కదలబోయాడు.

"డోంట్ మూవ్."

ఎవరిదో ఏడుపు.

మరికొందరికీ హిస్టీరియా లక్షణాలు యేకకాలంలో పొడసూపాయి.

"హలో .... హలో ...." గ్రౌండ్ కంట్రోల్ నుండి అరుస్తున్నారు.

"ప్లేన్ ఈజ్ హైజాక్డ్" పైలట్ నిర్లిప్తంగా అన్నాడు.

సూర్యోదుడుదయించటం యెంత సాధారణంగా జరిగిపోతుందో,. ప్లేన్ హైజాకింగ్ అంత సులభంగా సాధ్యపడుతుంది ఈ రోజుల్లో.

"లాహోర్ మళ్ళిస్తున్నాం. ఇంతవరకు వారి కోర్కెలేమిటో తెలియటంలేదు" గ్రౌండ్ కంట్రోల్ కు రిపోర్టు అందింది.

లాహోర్ అధికారుల్తో మాట్లాడారు. వారు విమానం

దిగటానికి అనుమతించారు.

ఈ వార్త క్షణాల్లో ప్రపంచమంతటా తెలిసిపో యింది. ఆ విమానంలో యెక్కినవారి తాలూకు బంధు వులనుండి అప్పుడే యస్.టి.డి.లు మొదలయ్యాయి.

హైజాకర్స్ తమ కోర్కెలు వెల్లడించారు.

"వారంతా ఓ టెర్రరిస్టు సంస్థకు చెందినవారు. వారి తాలూకు సభ్యుల్ని అరెస్టు చేశారు. వారిలో కొందరికి ఉరిశిక్ష పడింది. వారందరినీ విడుదల చెయ్యాలన్నదే హైజాకర్స్ డిమాండ్."

సంప్రదింపులు జరుగుతున్నాయి.

భారత్ అధికారులు పాకిస్థాన్ అధికారుల్తో మాట్లా డుతున్నారు. యెప్పటికప్పుడు పరిస్థితి తెలియచేయబడు తోంది. మొత్తం హైజాకర్స్ నలుగురు. వారి దగ్గరకు ఆయుధాలు యెలా వచ్చాయో యెవరికీ అర్థంకావటం లేదు.

ఆనందరావు కొంచెం తేరుకున్నాడు. యే క్షణాన విమానం ప్రేల్చేస్తారోనని భయపడుతున్నాడు. మృత్యు ముఖంలోకి వెళ్ళటం అంటే మొన్నటిదాకా అతనికి తెలియదు. వెంటనే తిరుపతి వెంకన్నకు మ్రొక్కేశాడు- ప్రాణాల్తో బ్రతికి బయటపడితే నడిచి గుడికొస్తానంటూ.

అప్పుడు వినపడిందో శబ్దం.

ఓ వ్యక్తి అమాంతం ఎగిరి తన ప్రక్కనున్న టెర్రరిస్టు చేతిలోని తుపాకి లాక్కోబోయాడు. కొంచెంసేపు పెనుగులాట జరిగింది. టెర్రరిస్టు ఆ వ్యక్తి మెడప్రక్కగా ఓ దెబ్బ కొట్టాడు. కీచుమంటూ అరుచుకుంటూ పడి పోయాడు.

"షూట్ హిమ్" అరిచాడో వ్యక్తి.

"నో" అరిచాడు వాళ్ళ నాయకుడు.

"అలాంటి పిచ్చి పనులు చేయవద్దు. మనం నీతీ, నిజాయితీ లేనివాళ్ళం కాదు. మన ఆశయంకోసమే ఈ ప్లేన్ హైజాక్ చేశాం. అది నెరవేరటమే మనకు కావాలి. మనకు ప్రజలమీద ద్వేషంలేదు" అని తిరిగి అందరివంక చూశాడు.

"మాకు మీ ఎవరిమీద కోపంలేదు. మీరు మా శత్రువులు కాదు. మా సహనాన్ని పరీక్షించకండి. మేం ప్రాణాలకు తెగించి ఈ పనికి పూనుకున్నాం. ప్రాణాలంటే మాకు తీపిలేదు. యెవరు సాహసం చేసినా ఈ విమానం బాంబుల్తో పేల్చేస్తాం."

కఠినంగా హెచ్చరించాడు.

అదే సమయంలో....

లాహోర్ అధికారులు అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు.

భవిష్యత్ కార్యక్రమం క్షణాల్లో రూపొందించబడింది.

కాకలుతీరిన 'కమేండో'లు రావించబడ్డారు.

# 3

కుక్కలదేం తప్పులేదు. అవి మొరిగాయి.

జనమే వాటిగురించి అంతగా పట్టించుకోలేదు. కారణం అవి ఊరకుక్కలు. ఊరికే అరుచుకుంటాయి. కొన్ని సందర్భాలలో ప్రపంచం మునిగిపోతున్నా చాలా నిశ్శబ్దంగా ఉంటాయి. మరో సమయంలో హృదయ విదారకంగా ఏడుస్తుంటాయి. ఎక్కువ భాగం ఊరికే కొట్లాడుతుంటాయి.

ప్రక్క వీధికి చెందిన కుక్క పొరపాటునో, గ్రహ

పాటునో వచ్చినా అవి భరించలేవు. తిరిగి వెళ్ళిపోయే దాకా అరాటమే. దాంతోపాటు యే మూల కవజాతి వారు అరిచినా వెంటనే ఆరంభమవుతుంది కార్యక్రమం. అన్నీ నోరెత్తి భౌ....భౌ....మనటమే.

మెలకువగా ఉన్నవారు ఈ రోజుకూడా కుక్కలు అలానే అరిచాయనుకున్నారు.

నిలువెల్లా ముసుగులు తొడుక్కున్న ఓ గుంపు ఆ కాలనీ మీదకు దాడిచేసింది. వారందరి దగ్గర గొడ్డళ్ళూ, బరిసెలూ ఉన్నాయి. వాళ్ళ నాయకుడి దగ్గర తుపాకి ఉంది. దాని గొట్టం భారుగా ఉంది.

వాళ్ళా ప్రాంతాన్ని బాగా స్టడీచేశారేమో సరాసరి ఓ ఇంటి దగ్గరకెళ్ళి అడవిలో చెట్టు కొట్టినట్లుగా రెండు తలుపుల్ని బ్రద్దలు కొట్టేశారు. అవి విరిగి ముక్కలయి పోయాయి. అందరూ లోనికి వెళ్ళి అందిన వస్తువునల్లా తీసుకోవటం మొదలు పెట్టారు. ఇంటి వారంతా లేచి నోటమాట లేకుండా చూస్తున్నారు.

ఆ ఇంటాయనకు దేవుడంటే మహాభక్తి. డబ్బులంటే కూడా. ఆయన శ్లాకులో బోల్డంత డబ్బు సంపాదించి ఏం చేయాలో తెలీక, ఇరవై నాలుగు క్యారట్ల బంగారంతో తన ఇష్టదైవాల్ని చేయించాడు. అవి రాత్రింబవళ్ళు మెరుస్తుంటాయి. దొంగలు బీరువా తాళాలు తీసుకున్నారు. ఆయన అంత తెలివితక్కువ వాడేంకాదు. తనకు చెందినవన్నీ లాకర్లో దాచుకున్నాడు.

అంతా అయ్యాక వారి చూపు బంగారు దేవుళ్ళమీద, షావుకారి భార్య మెడమీద పడ్డాయి.

"బంగారు విగ్రహాలు" అన్నాడో వ్యక్తి ఆనందంగా.

"ష్...." అన్నాడు నాయకుడు.

"అమ్మా....నీ మెడలోని నగలిస్తావా" అన్నాడు.

అప్పటిదాకా భయంతో బిగుసుకుపోయిందల్లా కదిలి వరసగా ఒక్కొటి తీసి ఇవ్వటం మొదలు పెట్టింది.

"ఆ నల్ల పూసల గొలుసు....నాంతాడు ఉంచుకో" అన్నాడు నాయకుడు.

"అదేంటి గురూ....ఎట్టాలేదన్నా పదివేలు చేస్తాయి" అన్నాడో అనుచరుడు.

"ఊఁ" గద్దించాడు.

"వెళ్దాం పదండి" అన్నాడు నాయకుడు.

"బంగారు విగ్రహాలు" గొణిగారు.

"ముందు పదండి" అన్నాడు.

అందరూ వెనక్కి తిరిగారు.

"అది బంగారు విగ్రహం కావచ్చు. లేదా వజ్రాల విగ్రహం కావచ్చు. అది భగవంతుడిది. అలాగే ఓ ముత్తయిదువు మెడలో మంగళసూత్రం అపహరించటం మన పద్ధతికాదు. మనకు కొన్ని సెంటిమెంట్లున్నాయి. భగవంతుడ్నే మోసం చెయ్యటం....స్త్రీలు ప్రాణంగా చూసుకునే తాళిని దొంగలించటం మనకి నిషిద్ధం. మీరంతా ఈ విషయం గుర్తించుకోవాలి. మనకు సెంటిమెంట్లుండాలి. లేకపోతే మన పెళ్లాం, బిడ్డల్నికూడా మరిచిపోతాం" అన్నాడు నాయకుడు.

## 4

అక్కడ సమావేశం అయిన వారిలో తెల్ల పంచెల, బట్టతలలవారే యెక్కువ వున్నారు. వారిముందు ఖరీదయిన విదేశీ మద్యం, గ్లాసులు, చిప్స్, చిల్లీ చికెన్, వేయించిన కారం జీడిపప్పు వున్నాయి.

"బజారు ముండకూడా టెక్కు అయిపోతే" అని

బాధపడ్డాడు జగన్మోహనరావు.

ఆయన పెద్ద కంట్రాక్టర్. అధికార పార్టీ రాజకీయాల్లో పాలుపంచుకుంటున్నాడు. వాసంతిని తమ నాయకుడి కొడుక్కి తార్చాలని భంగపడినవాడు.

"ఎవరయ్యా అది" అన్నాడో పెద్దమనిషి.

"ఇంకెవరు. ఆ వాసంతి."

"ఓఁ ఆ అమ్మాయా....మన కళ్ళముందు యెంత ఎదిగిపోయింది. దానికో భవనం, ఘూర్ఖా, పనిమనుషులు, కారు, ఎ.సి. గది."

"అందుకే అంత టెక్కు బలిసింది. దానికో పాఠం చెప్పాలి."

"ఏమందయ్యా."

"మన బ్రహ్మానందంగారబ్బాయి మొన్నొస్తే, వేరే ఎంగేజ్‌మెంట్ వుంది. వీలుకాదంది. దాన్నేం చెయ్యా అంటావు."

"ఏం చేస్తాం. దాని పరపతి అంత పెరిగిపోయింది."

"ఏం పరపతయ్యా....వళ్ళమ్ముకో వేది."

"దాని చుట్టూ నేగా మనం తిరిగేది."

"....అయితే."

"అయితే ఏమిటి. అది వళ్ళమ్ముకుంటోంది. మనం ఇంకోటమ్ముకుంటున్నాం. ఎవడికో దాన్ని తార్చటం బ్రోకరేజి అవుతుంది. అంతటితో ఆగుతున్నామా? బిల్లులు శాంక్షన్ చేయించుకోవాలంటే అడ్డమయిన వాడికల్లా ఆ పని చేస్తున్నాం. అంతమాత్రాన మన విలువ తగ్గిపోయిందా. లేదు. ఇవాళ దేశానికి కావలసింది ఎలా సంపాదించామన్నది కాదయ్యా....యెంత సంపాదించామన్నది. వాసంతి తను వప్పుకున్న వాడిదగ్గర

కెళ్ళింది. మంచిదే.... నేను అభినందిస్తున్నా."

"మనోడికి అప్పుడే మొదలయింది" అన్నాడు జగన్మోహన్రావ్ మిత్రులతో. నవ్వులు వినిపించాయి.

"ఓర్నీ! నాకింకా మొదలవలేదుగాని, ఓ ముక్క చెప్పనీరా. మనం తాగుబోతునాకొడుకులమే అనుకో. బేవార్సగాళ్ళమే అనుకో.... మనం చేసే వెధవ పనుల గురించి చెప్పుకోలేమా? అంత దరిద్రులమా" అన్నాడాయన.

"ఇదిగో నువ్వు వాసంతితో మనల్ని పోల్చకు."

"అది మహా తల్లిరా నాయనా. దాంతో మనల్ని పోల్చటం నా తప్పే!"

"ఓరి.... వాడికూడా 'అంతరాత్మ .... నిజాయితీ' అంటూ మొదలయిందే" అన్నాడు జగన్మోహన్రావ్.

## 5

ప్రకాశరావు చాలా కాలంగా ఆ ఊరిలో గట్ల పేరుతో కొంచెం కొంచెం ఆక్రమించుకుంటూ, బంజర్లు రాయించుకుంటూ ప్రెసిడెంటుగిరి వెలగబెట్టడంతో సంతృప్తిచెందక వాటన్నింటినీ వాయిదా వేసుకొని, తన కంటూ ఓ జత రాజకీయ బట్టలు, ఓ టోపీ ఏర్పరుచుకుంటున్న దశలో రాజకీయ రంగంలో ఓ ఉప్పెన వచ్చింది.

మూడు దశాబ్దాలుగా రాజ్యమేలుతున్న అధికార పార్టీ మీద తిరగబడ్డాడు క్రొత్త నాయకుడు. ఆయన ఎక్కడకు వెళితే అక్కడకు విపరీతంగా జనం వస్తుండటంతో 'ప్రకాశరావు' దృష్టి ఆ వైపు పడింది.

దూరదృష్టితో ఆలోచించి, ఓ పత్రికా ప్రకటన చేసి ఆ నాయకుడి దగ్గరకెళ్లాడు. ఆయన కూడా ఇలా

ఒక్కొక్కరు తన మహా యజ్ఞంలో పాలుపంచుకుంటు న్నందుకు మహా సంబరపడిపోయి ప్రకాశరావుకు ఆ జిల్లా బాధ్యతలు అప్పగించేశాడు. ఆయన్తోపాటు జిల్లా అంతా తిరిగి, ముందు కొంచెం డబ్బు ఖర్చుపెట్టి, భవిష్యత్ కోసం యెదురుచూస్తుండగా ఎన్నికలొచ్చాయి.

ప్రకాశరావుకు టిక్కెట్టు వచ్చింది. పోటీగా హేమా హేమీ నాయకుడు. ఆయనకాక మరో ఏడుగురు. అయినా నిరుత్సాహం పొందలేదు.

ఎదురు పార్టీవాళ్ళు తమ నాయకుడ్ని తెస్తే లక్ష మందొస్తారు. తమ నాయకుడ్ని తెస్తే లక్షన్నరమం దొచ్చారు. ఇదెంత క్రొత్త మోజని ఎవరెంతగా తీసేసినా ఓట్లు మాత్రం ప్రకాశరావుకు విపరీతంగా పడ్డాయి. గిట్టనివాళ్ళు ఆ ఓట్లు పడింది ప్రకాశరావుకు కాదు. ప్రకాశరావనే వాడెవడో వాడుండే సందులోనే ఎవరికీ తెలీదు. ఆ ఓట్లన్నీ ఆయన నాయకుడి మొఖంచూసి వేసినవే అన్నారు.

ప్రకాశరావు ఆ విషయం కాదనలేదు. ఈ విజయం నాది కాదు. ఆయనదే. ప్రజలదే అని ప్రకటించి ఆయనకు మొక్కాడు.

లోకల్ పేపర్ విలేకర్లు కొందర్ని డబ్బుల్తో బుట్టలో వేసుకొని 'మంత్రి కాబోతున్నాడని' రాయించుకున్నాడు. అందుకు కూడా కారణం ఉంది.

అంతకుముందు ప్రభుత్వం సగంమంది ఎమ్మెల్యేలకు మినిష్టర్లు, కార్పొరేషన్ ఛైర్మన్ పదవులు కట్టబెట్టారు. యెవరికీ మెజార్టీ రాకుంటే తన పని గిరాకి ఉంటుందని భావించాడు గాని, వాళ్ళ పార్టీకే బంపర్ మెజార్టీ

వచ్చింది.

కేవలం డజను మందిని మంత్రులుగా తీసుకున్నారు. చైర్మన్ అనే పదానికి తావులేకుండా పోయింది. మంత్రిగా తన పేరులేదు. ప్రకాశరావు కంగారుపడ్డాడు. నువ్వేం కంగారుపడకు అని అభయ హస్తమిచ్చాడు భానోజీరావు.

సంవత్సరం గడిచాక ఓ శుభోదయాన ప్రకాశరావుకు కబురు వచ్చింది.

భానోజిరావు పథకం ముందుంచాడు.

"మొత్తం సగంమంది బయటకు వస్తే ప్రతి పక్షం వారిని కలుపుకొని ప్రభుత్వం ఏర్పాటుచేస్తాం. మంత్రి వర్గంలో నీకు స్థానం కల్పిస్తాం."

ప్రకాశరావు మాట్లాడలేదు. ఆయనకు ఈ నడుమ తమ నాయకుని ఆదరణ లభించుతున్నట్లుంది. పార్టీ ట్రెజరర్ గా తననే వుంచాడు. తాళాలు మాత్రం యివ్వ లేదు. రేపో మాపో ఇవ్వడా అని వుంది.

"ఏంటయ్యా అంత ఆలోచిస్తున్నావు. ఆ తాళాలు నీకిస్తాడా! ఛస్తాడా? ఈ ఎన్నికల్లో ఎంత ఖర్చు పెట్టావ్. ఒకటా.... రెండా? అవన్నీ యెప్పుడు సంపా దిస్తావు? నువ్వు సరేనను. అయిదు లక్షల్తోపాటు మంత్రి పదవి ఇస్తాం."

"నా నియోజకవర్గం వారితో ఆలోచించి చెబుతాను" అన్నాడు ప్రకాశరావు. తొందరపడటం అతని స్వభావం కాదు.

"నీ ఇష్టం నీ భవిష్యత్ యెలా మార్చుకుంటావో" అని భానోజిరావు వెళ్ళిపోయాడు.

ఆ రోజు అర్థరాత్రి ప్రభుత్వం కూలిపోయింది.

ప్రకాశరావుకు తిరిగి కబురు వచ్చింది.

తాజా రేటు! పది హేను లక్షలు.

ఎమ్మెల్యేలను తెస్తే వారికొక్కరికి పదిలక్షలు. కమీషన్‌గా కొంత వుంటుంది. మంత్రి మామూలే.

ప్రకాశరావు అంతరాత్మ నిద్ర లేచింది.

మనస్సాక్షి ప్రశ్నించటం మొదలుపెట్టింది....

ఈ కథను ప్రస్తుతం ఇక్కడ ఆపాల్సి వచ్చింది. క్షమించండి. వెనక్కి వెళ్దాం.

## 6

"అంచేత, దాని మొఖం అంత అందంగా వుంది కాబట్టి, ఆ అందంతో పాటు దానికి గర్వం పెరిగింది కాబట్టి, దాని మొఖం మొ ఖ ం లా ఉండకూడదు" అన్నాడు జగన్మోహన్రావు.

"మరి?"

"కాగయిపోవాలి, కష్టయిపోవాలి. బీభత్సం అయిపోవాలి."

"ఏం చేస్తానంటావ్?"

"యాసిడ్ పోస్తాను."

"నువ్వేనా?"

"పిచ్చి ప్రశ్న. వెధవ పనులు అందరూ స్వయంగా చేయరు. ఆదేశాలిస్తారు."

"ఆమె కారు అద్దాలు మూసివుంటాయి."

"అయినా అవి బద్దలవుతాయి."

"ఎప్పుడు చేస్తారా పని?"

"మరోసారి పిచ్చి ప్రశ్న. మన దేశానికి స్వాతంత్ర్యం అర్ధరాత్రి వచ్చింది. అంచేత మన సంప్రదాయం ఏమంటే ఏ దరిద్రపు పనిచేసినా పొద్దుపోయాకే."

గొల్లున నవ్వులు...గ్లాసుల మ్రోతలు....

ప్లాను సిద్ధం అయింది.

వారం రోజుల తర్వాత వాసంతి కారు దూసుకొస్తూ సడన్ బ్రేకుతో ఆగింది. రోడ్డు నడుమ యెవరిదో కారు ఆగిపోయింది. హారన్ మ్రోగిస్తుండగా బిలబిలమంటూ దూసుకొచ్చారు పదిమంది గూండాలు.

ఫళ్ళున అద్దాలు పగిలిపోవటం....

యాసిడ్ సీసాలు బద్దలు కావటం....

వాసంతి మొఖంమీద....వంటిమీద పడటం క్షణాల్లో జరిగిపోయాయి.

కెవ్వున కేక. హృదయవిదారకంగా.

వెనక సీట్లో గిలగిల కొట్టుకుంటున్న వాసంతి....

బుసబుస పొంగుతున్న యాసిడ్ ప్రభావం....

కణకణ మండుతున్న నిప్పుల్తో మొఖాన్ని కాలుస్తున్నట్లు బాధ....కేకలు....ఏడుపు....!

ముందు తేరుకుంది డ్రైవర్. వేగంగా బ్యాక్ చేశాడు. వెనకాల యెలాంటి బండ్లు రాకపోవటం అదృష్టం. కొంచెం దూరం వెళ్ళాక, అదే వేగంతో టర్న్ చేసుకొని హాస్పిటల్ వైపు దూసుకుపోయాడు వేగంగా.

వాసంతికి ఓ విషయం తెలియదు. తనమీద కాదు యాసిడ్ పోసింది! తన అంతరాత్మమీద! తన నిజాయితీ మీద!

వాసంతి గెలిచింది!

వేశ్యగా బ్రతకాల్సిన పరిస్థితుల్తో రాజీపడటంకాదు. ఆమెకలా బ్రతకటం ఓ శిక్ష అయితే....అందులో అయినా నిజాయితీగా ఉన్నందుకు మరో శిక్ష ఇది.

హైజాకర్స్‌తో ఎప్పటికప్పుడు సంభాషణలు జరుపుతున్నారు అధికారులు.

"మీ కోర్కెలు భారత దేశానికి తెలియచేశాం. త్వరలోనే ఏ విషయం మీకు తెలియచేయబడుతుంది. ఈలోపు మీరేం తొందరపడవద్దు. విమానం పేల్చేయటంలాంటి పనులు చేయొద్దు.

ఈ విషయం గురించి అత్యవసర సమావేశం ఏర్పాటు చేయబడింది. మరో అరగంటలో నిర్ణయం తెలియచేయగలరనుకుంటున్నాం."

"మీరేమైనా కుట్రచేస్తే ఈ విమానం పేల్చేస్తాం. మా దగ్గర బాంబులున్నాయి" హైజాకర్స్ బెదిరింపు.

"నో, అలాంటిదేం లేదు."

"అరగంటలో మాకు సమాధానం రాకుంటే మేమీ ప్రాంతం విడిచి వెళ్ళిపోతాం."

"అలాగే."

"ఫ్యూయల్ సరిపోదు" పైలట్ అభిప్రాయం.

"దీంట్లో సరిపోయినంత ఫ్యూయల్ నింపాలి. లేదా ఇప్పుడే పేల్చేస్తాం."

"ఓ.కె. మీ కోరిక అంగీకరించబడింది."

విసుచుకుపడిపోయాడు ఆనందరావు.

"అయ్యయ్యో" ఒక్కసారిగా గందరగోళం.... ఏడుపులు....

"షటప్. అర్చారంటే కాల్చేస్తాం" అరిచారు.

ఆనందరావు కళ్ళు తేలేస్తున్నాడు. ఆనందరావు మహానటుడు కాదుగాని, ఓ మోస్తరు నటుడే. 'ఆ ముఖమే ఓ విషాద పాత్ర' అన్నాడు ఓ వర్ధమాన కవి ఆనంద

రావు మొఖం చూసి.

ఆనందరావు ఎప్పుడూ పేథాస్ పాత్రలే వేస్తుంటాడు. హీరోయిన్ తండ్రిగానో, తాతగానో, మావగానో వేసి, దగ్గో, గుండెనొప్పితోనో అన్ని పాత్రాలూ మధ్యలో నిష్క్రమించేవే. మరీ వీరావేశంతో నటిస్తుంటాడేమో కొన్నిసార్లు బహుమతులొచ్చినా దగ్గినందుకు చాలా రోజులు బాధపడేవాడు. ఇప్పుడు సందర్భం వేరు.

మొదటినుండి భయపడి ఛస్తున్నాడు. అందుకే అంత సహజంగా నటించాడు....

“చచ్చిపోతాడేమో” అన్నారెవరో.

“దయచేసి ఆయన్ని బయటకు పంపండి” అంటున్నారెవరో.

“అకలే” ఓ పాప ఏడుస్తుంది.

నాయకుడు వారందరివంక చూశాడు.

“పిల్లల్ని, ముసలివారిని పంపించేద్దాం” అన్నాడతను.

“నో” అన్నాడు ఒకతను.

“అతన్ని చూడు. ఛస్తే మనల్ని అనుకుంటారు. మన వాళ్ళని రక్షించుకోవటానికి అనవసరంగా అమాయకుల్ని చంపటం నా కిష్టంలేదు.”

“నీ ఇష్టం.”

“డోంట్ వర్రీ. ఇరవైమంది వెళతారు. అయినా చాలామంది ఉన్నారు.”

వెంటనే కంటాక్టు చేశారు. లాడర్ తీసుకురాబడింది.

“మీరెవరూ కదలొద్దు. మేం వెళ్ళమన్న వారు వెళ్ళాలి” కటువుగా హెచ్చరించాడతను.

ఎవరూ మాట్లాడలేదు. వారందరి మొఖాల్లోనూ

భయాందోళనలు. ఏ క్షణాన ఏమవుతుందో తెలియదు. తమందరి ప్రాణాలు కాపాడటానికి ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకుంటుందా? నమ్మకం లేదు. ఉన్నది భారత దేశంలో కాదు. పాకిస్తాన్ కూ. భారతదేశానికి నడుమ సంబంధాలు సరిగ్గా లేవు. వారంత ప్రమాదకరమైన వ్యక్తులైతే విడిచిపెట్టరేమో!

అందుకోసం తమందరినీ బలిచేస్తారా? లేదు ఏదో చేస్తారు! ఏం చేస్తారు? యేమో! బ్రతికి బయటపడటం జరుగుతుందా? తిరిగి ఇండియా వెళ్ళేదెప్పుడు? ఆత్మీయుల్ని అక్కున చేర్చుకొనే దెప్పుడు?

మరికొందరి ఆలోచనలు మరోవిధంగా వున్నాయి. టైమీజ్ మనీ అనుకునే బిజినెస్ మాగ్నెట్ లు అందులో వున్నారు. వారికి జీవితంమీద అంత టెంక్షన్ గా లేదు. ఎందుకంటే హైజాకింగ్ కేసుల్లో యెక్కువ భాగం సుఖాంతం అయ్యాయి. ఇందులో నుండి బయటపడటం అనేది అసలు సమస్య కాదు. అదెప్పుడయినా జరిగితీరుతుంది.

కానీ ఈ గంటలు....తిరిగి జీవితంలోకి రావు. కొన్ని నిముషాల వ్యవధిలోనే ఓడలు బండ్లు అవుతాయి. బండ్లు ఓడ లవుతాయి. నిజంగా యెంత నష్టమో తలుచుకుంటే వారికి బి. పి. రైజ్ అవుతోంది. అయినా యేం చెయ్యగలరు?

హైజాకర్స్ ఒక్కొక్కర్ని చెక్ చేసి పంపుతున్నారు. డోర్ దగ్గర తుపాకితో ఓ వ్యక్తి నిలబడ్డాడు.

ఆనందరావును బయటకు వెళ్ళమన్నా లేవలేక పోయాడు. "వోవర్ ఏక్షన్ చెయ్యకు" అని హెచ్చ

రికలు వస్తున్నాయి. అలానే వుండిపోయాడు. ఎయిర్ హోస్టెస్ సహాయం కోరారు. ఆనందరావు జీవితంలో మరపురాని అనుభూతి అది.

అదేకాదు ఎగస్ట్రా పాత్ర చివరి రీల్లో హీరోగా మారినట్లు ఆ నం ద రా వు నిర్వహించబోయే పాత్ర ముందుంది!

ఎయిర్ హోస్టెస్ వచ్చింది. ఆమెతోపాటు వచ్చిన సెంటువాసనకు ఆనందరావు దిమ్మెరపోయాడు. లేచినిల బెట్టారు. ఆమె భుజంమీద వాలిపోయాడు. ఆమె మొఖంలో చెక్కుచెదరని చిరునవ్వు. ఆమె కొంగు కగులుతుంటే చంద్రలోకంలో విహరిస్తున్నట్లుంది. ఇలానే ఓ జీవితకాలం నడిస్తే బాగుంటుందనుకున్నాడు. త్వరగానే డోర్ దగ్గరకు వచ్చారు. మెల్లగా క్రిందకు దిగాడు.

ఆనందరావు దిగగానే తొందరపడలేదు. ఒక్కసారి సంతోషంతో పిచ్చెత్తినట్లుగా పరుగెత్తాలనుకున్నాడు. మిగతావారంతా అలా చేశారు. కనీసం తన ఆనందాన్ని నడకలో అయినా చూపించలేదు. వెనకనుండి తనను గమనిస్తుంటారని.... అక్కడినుండి బుల్లెట్లు దూసుకొచ్చి తన వెన్నును చీల్చేస్తే.... ఊరుగాని ఊరు.... దేశంగాని దేశం....

ఆనందరావు నీరసంగానే నడుచుకుంటూ వెళ్ళాడు. లోపలకు వెళ్ళాక వాళ్ళిచ్చిన కూల్ డ్రింక్ త్రాగాడు.

భారత ప్రభుత్వం నుండి మెసేజ్ వచ్చింది.

"హైజాకర్స్ కోరికలు అంగీకరించటం సాధ్యం కాదు. అలా చెబితే అంతమంది ప్రాణాలకు ముప్పు వాటిల్లుతుంది కాబట్టి సమయంగడిపే ఎత్తుగడల్ని అనుసరించాలి. అంతగా అయితే వారిని మరోచోటికి పంపాలి.

ఈలోపు యేదో నిర్ణయం తీసుకుంటానికి వీలుంటుంది"
ఇదీ సారాంశం.

అంతటితో ఆగ లేదు.

"హైజాకర్స్ పట్టుబడగానే మాకు అప్పగించాలి."

"ఆ విషయం మేం వెంటనే హామీ యివ్వలేం"
అన్నారు పాకిస్తాన్ అధికారులు.

ఆనందరావుకు దూరంగా విమానం రాక్షసుడిలా కన్పిస్తోంది. అంతలో యెవరో ఆనందరావును పిలిచారు.

ఆనందరావు చెబుతున్నాడు. ఎంతిమంది హైజాకర్స్ వున్నారో ....వారిదగ్గర ఎలాంటిఆయుధాలున్నాయో.... ఏ ఏ పొజిషన్లో వున్నారో అంతా.... వెంటనే 'కమెండో'లు ప్లాన్ తయారుచేసుకున్నారు.

"ఇంజన్ ట్రబులిస్తోంది" అన్నాడు పైలట్.

"నిజమా?" కఠినంగా అన్నారు.

"నిజమే. కావాలంటే మీరు చెక్ చేసుకోవచ్చు."

"ఇప్పుడేం చెయ్యాలి?"

"మెకానిక్‌లను పిలవాలి."

"ఇదేం కుట్ర కాదుగదా?"

"కాదు. ఇప్పుడు బాగు చేయకుంటే ఒకళ్ళం కూడా బ్రతికం."

వెంటనే కాంటాక్టు చేశారు.

"ఒకడు చాలడా?"

"లేదు, ఇద్దరు కావాలి."

"ఇంజన్ ట్రబులి స్తుందంటున్నారు. మరోసారి హెచ్చరిస్తున్నాం.ఏమాత్రం సాహసం చేసినా విమానం పేల్చేస్తాం. ఇద్దరు మెకానిక్‌లు రావాలి."

"అలాగే."

"నా కెందుకో అనుమానంగా వుంది" అన్నాడో వ్యక్తి.

"బీ ఎలెర్ట్" అన్నాడు నాయకుడు.

తమ మానవత్వం తమని పట్టిస్తుందని ఆ క్షణం తెలియదు.

మెకానిక్ల వేషంలో కమేండోలు వచ్చారు.

రెండు నిముషాల అద్భుత దృశ్యం!

రక్తపాతం లేకుండానే విమానం స్వాధీనమయింది.

హైజాకర్స్ తలలు వంచుకున్నారు.

ఓడిపోయింది వాళ్ళు కాదు.

గెలిచింది 'కమేండో'లు కాదు.

"మానవత్వం."

# 8

"నా వెనకాల నలుగురున్నారు" అన్నాడు ప్రకాశరావు.

"వాళ్ళంతా అటు వెళతానంటున్నారు. వాళ్ళనాపటం చాల కష్టంగా వుంది. నాకూ కూడా ఫోన్లు వస్తున్నాయి. ఆ వత్తిడి భరించటం కష్టంగా వుంది."

భానోజీరావు యేం మాట్లాడలేదు. అతని కిదంతా కొట్టిన పిండిలా వుంది. క్రొత్త వి. ఐ. పి సూట్ కేస్ తెరిచాడు.

"ముప్తం నలభై లక్షలు."

వాటివంక చూడగానే ముఖంలో వెలుగు రేఖలు. తన జీవితంలో యెన్నడూ అంత డబ్బును చూసి యెరుగడు. అయోమయంగా చూస్తున్న ప్రకాశరావు భానోజీ మాటల్తో ఈ లోకంలో పడ్డాడు.

"నువ్వు అనుమానపడకు. అది వైటే."

ప్రకాశరావు మాట్లాడలేదు.

"ఎల్లుండి ప్రమాణస్వీకారం చెయ్యాలి."

"ఎవరు?"

"నీతోపాటు మరికొందరు."

ప్రకాశరావుకు ఆనందంతో మాటలు రావటంలేదు. అతని చిరకాల వాంఛ మంత్రి కావాలని. కనీసం ఒక్క రోజయినా మంత్రిగా వుండి చచ్చిపోవాలని. భానోజి వాగ్దానాలు యింకా ప్రవాహంలా దూసుకొస్తు న్నాయి.

"మంత్రి అంటే మామూలు కాదు. క్యాబినెట్. అందులో నీకు మంచి శాఖ యిస్తాను. ఆ నలుగురికి డబ్బులు పంచు. నువ్వెంతమందిని తెస్తే అంత ప్రతిఫలం వుంటుంది. సాధ్యమైనంతవరకూ అందరికీ కార్పొరేషన్ ఛైర్మన్ పదవు లిద్దాం. లేకపోతే సృష్టించుదాం. అంతా మన చేతుల్లో పని. నువ్వు మాత్రం తయారుగా వుండు ప్రమాణస్వీకారం చెయ్యటానికి. వచ్చినవాళ్ళు బయటకు వెళ్ళకూడదు. తిరిగి మనమీద విశ్వాసతీర్మానం నెగ్గేదాకా వాళ్ళంతా మనలోనే ఉండాలి. అర్థ మయిందా?"

అప్రయత్నంగా తలూపాడు ప్రకాశరావు.

భానోజిరావు వెళ్ళిపోయాడు.

ప్రకాశరావు ముందు నలభై లక్షలు!

క్యాబినెట్ హోదా పదవి!

అప్పుడే మొదలయింది అతనిలో సంఘర్షణ.

రాష్ట్ర రాజకీయ చరిత్రలో తనేమిటో, ఎవరో మొన్నటిదాకా. తన గతచరిత్ర తెలిసీ కూడా తన నెన్ను కున్నారు తన ప్రజానీకం. అందుకు కారణం తమ నాయ

కుడు. ఆయనమీద అపారమైన నమ్మకంతో, అభిమానంతో ఎన్నుకున్నారు. అప్పటి కోలాహలం గుర్తొచ్చింది. తనమీద నిలబడింది ప్రముఖుడు. డబ్బున్నవాడు. తమ కార్యకర్తల్ని ఎందర్ని కొట్టాకో! ఎవరికి వారు కదిలి తమ వెన్నుకంటే తామే స్వయంగా వెన్నుపోటు పొడిచారు.

వెన్నుపోటు పొడిచేముందు ఎవర్ని సంప్రదించారు? అంతరాత్మ తిరగబడింది. గొంతు నొక్కేశాడు. నీతి.... నిజాయితీ వదిలేశాడు. సెంటిమెంట్లు, మానవత్వం తుంగలో తొక్కాడు. ఆ సమయంలో తన తల్లీ, పెళ్లాం, బిడ్డలు ప్రజలు యెవ్వరూ గుర్తుకురాలేదు.

వెన్నుపోటుకు రంగులద్దాడు.

లొంగుబాటుకు తేనె పూశాడు.

ప్రజల్ని మోసం చేశాడు.

ప్రజాస్వామ్యాన్ని చిత్రవధ చేశాడు.

రెండురోజులు పోయాక....

పోలీసుల బందోబస్తుతో, అన్ని బూతుల్తో ప్రమాణ స్వీకారం చేశాడు మంత్రిగా.

ప్రకాశరావు చేసిన ద్రోహానికి ఆగ్రహించిన ప్రజలు అతని ఆస్తిని ధ్వంసం చేశారు. అయినా వారి ఆగ్రహం చల్లారలేదు. ప్రకాశరావు కూడా ఆగ్రహం చెంది పోలీసుల్ని దించాడు. వాళ్ళు కాల్పులు జరిపారు. అందులో ఎనిమిదిమంది చనిపోయారు.

ప్రకాశరావుకు రవంత బాధ కలగలేదు. అదనంగా గూండాల్ని నియమించాడు. ప్రజావాణిని నొక్కేయాలనుకున్నాడు.

నష్టపోయిన ఆస్తికి పరిహారం తీసుకున్నాడు.

# ముగింపు

ఈ దేశంలో నీచంగా మోడబడ్తూ బ్రతుకు నెట్టుకొస్తున్న వేశ్యల్లో నిజాయితీ వుంది.

దోపిడీ దొంగలకు సెంటిమెంట్లున్నాయి.

రాక్షసంగా ప్రవర్తించేవారిలో సైతం మానవత్వం వుంది.

అయితే అవన్నీ వారి జీవితాల్లో తీరని ప్రతిబంధకాలవుతున్నాయి. వారి 'నేరాలకు' వారు శిక్షింపబడుతున్నారు.

ఏ విలువలూ లేని, ఏ నీతి నిజాయితీలకు లొంగని, భావుకు అందని రోతపూరితుడైన 'రాజకీయవాది' మాత్రం తన నేరాలకు శిక్షగా జనాన్ని పరిపాలిస్తున్నాడు.

జనం యే విలువలకు కట్టుబడి వుంటారో, సరిగ్గా వాటికి వ్యతిరేకం 'రాజకీయం'.

"రాజకీయాల్లో ఏమయినా జరగొచ్చు" అనే ముద్దుమాటల్లో తమ అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని, సెంటిమెంట్లని, మానవత్వాన్ని, సమస్త విలువల్ని అమ్ముకొని, చంపుకొని అధికారంలో పాలుపంచుకుంటున్నారు.

ప్రకాశరావు మంత్రయ్యాడు.

తుపాకులూ, శూరికొయ్యలూ, టియర్ గ్యాస్‌లూ, ఉపయోగించి తన అధికారం నిలబెట్టుకోవాలని ఆరాటపడుతున్నాడు.

ఇంతటితో ఈ కథ ముగిస్తేమట్టుకు ప్రజలకు అన్యాయం చేసినట్లవుతుంది.

ప్రకాశరావు మంత్రయిన చాలా కాలానికి యీ

## 30

విషయం జనం మరిచిపోయారని బాగా నమ్మకం కుదిరాక తన ఊర్లో బహిరంగ సభ పెట్టేడు. బోలెడంత బందోబస్తు చేయించాడు. తన ఊరి ప్రజానీకం ముందుకొచ్చి మహోద్రేకంతో మాట్లాడుతుంటే జనంలో నుండి ఓ యువకుడు దూసుకొచ్చి....

టప, టప మంటూ కాల్చేశాడు.

నుదురులోనూ, గుండెల్లోనూ తూటాలు దిగి, రక్తం వెల్లువలా కారుతుంటే ప్రకాశరావుగారు కూలిపోయేరు.

ప్రకాశరావుగారు చచ్చిపోయేరు.

ఇప్పుడు కాదు.

తన్ను తాను అమ్ముకున్న రోజునే!

—: అయిపోయింది :—

# రాక్షసుడు

టెంపోరావ్

షుగర్ మిల్స్ అసోసియేషన్ సభ్యులు అడ్యార్ గేటు హోటల్లో సమావేశమయ్యారు. ఆనాటి సమావేశానికి ప్రెసిడెంట్ కామరాజు.

కామరాజు పేరుపొందిన పారిశ్రామిక వేత్త. అతడికి దేశమంతటా షుగర్ మిల్సు, సిమెంటు ఫ్యాక్టరీలు, టెక్స్టయిల్ మిల్సు వున్నాయి. పేద కుటుంబంలో పుట్టిన కామరాజు అనేక అడ్డంకులు దాటి కోటీశ్వరుడయ్యాడు.

ఆ సమావేశ సమయంలో ఒక మిత్రుడు పటేల్ నీ, అతడి భార్యను కామరాజుకు పరిచయం చేశాడు.

విశాలమైన హాల్లో ఆహ్లాదకరంగా వుంది. ఏర్ కండిషండ్ హాల్లో లైట్లు వెల్గుతున్నాయి.

"ఈయన గురించి మీరు వినివుండరు" అన్నాడు మిత్రుడు రామనాథన్.

కామరాజు ఎదురుగా వున్న భార్యాభర్తల వైపు

చూశాడు. ఆమె చాలా అందంగా వుంది.

"వినలేదు" అన్నాడు కామరాజు.

"ఈయన బాబూరావు పటేల్, ఆమె అతని భార్య" పరిచయంచేశాడు రామనాథన్.

"మిమ్మల్ని కల్సుకున్నందుకు చాలా సంతోషం. సమావేశం ముగిశాక మాయమైపోకండి. మీతో మాట్లాడాలి" అన్నాడు కామరాజు.

"మీ గురించి ఎంతో విన్నాను, సార్. మీకెన్నో ఫ్యాక్టరీలు వున్నాయి. మాకు ఉన్నది ఒకే ఒక షుగర్ మిల్" అన్నాడు పటేల్, వినయంగా.

"మీ షుగర్ మిల్ చాలా పెద్దది. బొంబే వచ్చినపుడు మీ మిల్ గురించి చాలా విన్నాను" అన్నాడు కామరాజు.

సమావేశం ముగిసింది. పటేల్ తన భార్యతో వెళ్ళి కామరాజును కల్సుకున్నాడు.

"మీ కోసమే చూస్తున్నాను" అన్నాడతను.

"ఏదో మాటవరసకి మీరలా అన్నారేమో అనుకున్నాను!" అన్నాడు పటేల్ నవ్వుతూ.

"నేను తేలిగ్గా మాటలను వాడను. నేను యేదేనా అంటే ఐ మీన్ యిట్" అన్నాడు కామరాజు.

హాల్లోనుంచి ముగ్గురూ హోటల్ ముందుకు నడిచారు. సమీపంలో మెర్సిడిస్ కారు సిద్ధంగా వుంది.

"మాట్లాడాలంటే మనం నిమ్మళంగా ఒక చోట కూర్చోవాలి. మా ఇంటికి పోదాం పదండి" అన్నాడు కామరాజు.

"మా గది ఈ హోటల్లోనే వుంది. అక్కడకు మీరు దయచేయండి" అంది సుజాత.

"మా యిల్లు ఈ హోటల్ కంటె పదిరెట్లు బాగుం టుంది. నువ్వే చూస్తావు" అన్నాడు కామరాజు.

"అలాగే వెళ్దాం, పదండి" అన్నాడు పటేల్.

కామరాజు ముందు సీటులో కూర్చుని వాళ్ళిద్దర్నీ వెనక కూర్చోమన్నాడు. డ్రయివర్ కారును పోని చ్చాడు.

"మీరు నాగ్ పూర్ వచ్చి, మా అతిధిగా వుండాలి" అన్నాడు పటేల్.

"తప్పక వస్తాను. మీరు మా యింట్లో వుండండి. కావలసినన్ని గెస్టురూమ్స్ వున్నాయి" అన్నాడు కామ రాజు.

పటేల్ ఓరగా తన భార్యవైపు చూశాడు. సుజాతను అతను ప్రేమించి పెళ్ళాడాడు. తండ్రి చనిపోయాక పటేల్ షుగర్ మిల్సుకి అధిపతి అయ్యాడు. అతడి వయస్సు 28 వుండొచ్చు. భార్య అతడికంటె ఐదేళ్ళు చిన్నది. ఆమె బొంబేలో బి.ఎ. పాసయింది.

సుజాత ఏమీ మాట్లాడకుండా కూర్చుంది. ఒక గేటువైపు కారు మెల్లిగా కదిలింది. ఇరవైమంది సెక్యూరిటీ మనుషులు గేటు బయట కాపలా వున్నారు. అందరి చేతుల్లోనూ రైఫిల్స్ వున్నాయి.

"వీళ్ళందరూ మా సెక్యూరిటీ గార్డ్సు. డబ్బున్న వాళ్ళ గతి యింతే సెక్యూరిటీ గార్డ్సు, బాడీ గార్డ్సు వాళ్ళకు కావాలి" అన్నాడు కామరాజు.

"కార్మికుల అల్లర్లు ఇక్కడ ఎక్కువగా వున్నాయా?" ప్రశ్నించాడు పటేల్.

"అవి ప్రతిచోటా వుంటాయి. యెంత యిచ్చినా

యింకా యెక్కువగా కావాలని కార్మికులు అడుగుతూనే వుంటారు. వాళ్ళు లేకుండా మనం ఫ్యాక్టరీలను నడపలేం. అందువలన వాళ్ళు అడిగిన దానిలో కొంతైనా యిచ్చి వాళ్ళను పనిలోకి రప్పించాలి" అన్నాడు కామరాజు.

"యూ ఆర్ రైట్, సార్" అన్నాడు పటేల్.

పోర్టికోలో కారు ఆగింది. తెల్లటి యూనిఫామ్‌లో వున్న నలుగురు నౌఖర్లు కారు వద్దకొచ్చారు.

ఒక యూనిఫామ్డ్ నౌఖరువైపు కామరాజు చూశాడు.

"వీళ్ళిద్దర్నీ రాయల్ గెస్టురూమ్స్‌లోకి తీసుకువెళ్ళు!" అన్నాడతను.

కామరాజు నవ్వుతూ పటేల్, సుజాతలవైపు చూశాడు.

"మీకు బెస్టు రూమ్ యిస్తున్నాను. అక్కడకు వెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. సరిగ్గా ఏడింటికి బార్రూమ్‌లో కలుసుకుందాం" అన్నాడు కామరాజు.

"అలాగే, సార్" అన్నాడు పటేల్.

యూనిఫామ్డ్ నౌఖరు వాళ్ళను రాయల్ గెస్టురూమ్స్‌లోకి తీసుకు వెళ్ళాడు. డ్రాయింగ్ రూమ్, పడగది, బాత్‌రూమ్ అఖండంగా వున్నాయి.

పెద్ద డబుల్ కాట్, పైన ఫోమ్ పరుపులు, వెల్వెట్ దుప్పట్లు, డ్రాయింగు రూమ్‌లో ఖరీదైన సోఫాలు. గోడలకు అనేక పెయింటింగ్స్ వేళ్ళాడుతున్నాయి. స్వర్గంలా వుందక్కడ.

పటేల్ టైము చూశాడు. నాలుగు దాటింది. మరో మూడు గంటలు గడిచాక తను కామరాజుతో మాట్లా

డాలి. అంతవరకూ యీ గదుల్లో వుండాలి.

యూనిఫామ్డ్ నౌఖరు వాళ్ళవైపు వినయంగా చూశాడు.

"మీ కేదేనా కావాలా, సార్?" అడిగాడు.

"వద్దు," అన్నాడు పటేల్.

నౌఖరు శల్యూట్ చేసి బయటకు వెళ్ళిపోయాడు.

"మన హానీమూన్ కి మనం కాశ్మీర్ వెళ్ళాం. ఇక్కడకు వచ్చుండవలసింది" అన్నాడు పటేల్ నవ్వుతూ.

సుజాత తీయగా నవ్వింది.

"కాశ్మీర్ లో వున్నది ప్రకృతి సౌందర్యం. ఈ గదిలో మనం చూసేది ధనం యివ్వగలిగిన అలంకారం" అందామె.

అతడు భార్యవైపు చిరునవ్వుతో చూశాడు.

"కామరాజుగారు సాధారణంగా ఎవర్నీ యింటికి రమ్మనరు. మనల్ని రమ్మనడంలో ఏదో విశేషం వుండి వుండాలి!" అన్నాడతను.

"ఇంత డబ్బంటే నా కెంతో భయం" అందామె.

"ఆయన కెంత డబ్బుందో నీకు తెలుసా?"

"తెలియదు" అందామె.

"ఇండియాలోని ధనవంతుల్లో ఆయన ఒకరు. ఆయనకు దేశమంతటా ఫ్యాక్టరీలు వున్నాయి. వెరీ వెరీ బిగ్ మేన్" అన్నాడు పటేల్.

"ఎంత పెద్దవాడో చూద్దాం" అందామె.

## 2

ఏర్ కండిషండ్ బాత్రూమ్ లోని ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

బాత్రూమ్ లోకి వచ్చిన పటేల్, సుజాతలను కామ

రాజు నవ్వుతూ ఆహ్వానించాడు.

"ఈమె నా కూతురు రాధ" అన్నాడు కామరాజు.

"మిస్టర్ పటేల్ అండ్ హిస్ వైఫ్" అన్నాడతను.

రాధ నవ్వుతూ పటేల్‌తో, అతడి భార్యతో కరచాలనం చేసింది. నలుగురూ ఫోమ్ సోఫాల్లో కూర్చున్నారు. బార్‌రూమ్‌లో చల్లగా, హాయిగా వుంది.

తెల్లటి యూనిఫామ్‌లో వున్న నౌకరు వాళ్ళ దగ్గర కొచ్చాడు.

"మీరేం తీసుకుంటారు?" అడిగాడు కామరాజు.

"లిమ్కా" అంది రాధ.

"నాకూ అదే" అంది సుజాత.

"ఆడవాళ్ళకు లిమ్కా, మాకు స్కాచ్, రాయల్ శల్యూట్ విస్కీ" అన్నాడు కామరాజు.

నౌకరు వెళ్ళిపోయాడు. గోల్డు కేసు తెరిచి కామరాజు అతడికి అమెరికన్ సిగరెట్ యిచ్చాడు. ఇద్దరూ సిగరెట్లు గోల్డు లైటర్‌తో వెలిగించారు.

"ఈ రీగన్ సిగరెట్ చాలా బాగుంది" అన్నాడు పటేల్.

"అమెరికాలో, రీగన్ సిగరెట్లు వెలువడి రెండు నెలలు అయింది. ప్రెసిడెంట్ రీగన్ యీ సిగరెట్లే కాలుస్తాడు" అన్నాడు కామరాజు.

"ఈ సిగరెట్లు మీ కెలా వస్తున్నాయి?" అడిగాడు పటేల్ అమాయకంగా.

కామరాజు గంభీరంగా నవ్వాడు.

"అమెరికాలో కొత్తగా వచ్చిన ప్రతి వస్తువూ నాకు పదిహేను రోజుల్లోపల పంపబడుతుంది. న్యూయార్క్‌లో

మా ఆఫీసు వుంది. ఆ ఆఫీసును నడిపే ఎడ్వర్డు జె. రోబిన్సన్ అంతా చూస్తాడు" అన్నాడు కామరాజు.

స్కాచ్ విస్కీ వచ్చింది. పటేల్, కామరాజు తాగడం ప్రారంభించారు. రాధ, సుజాత లిమ్కా సేవిస్తున్నారు.

"మిస్టర్ పటేల్, మనం నైజీరియాలో ఒక షుగర్ ఫ్యాక్టరీ పెట్టాలి" అన్నాడు కామరాజు.

"అక్కడ యేం లాభం సార్?" అడిగాడు పటేల్.

"మిస్టర్ పటేల్, నేను నైజీరియా వెళ్లాను. ఆ దేశం ప్రెసిడెంట్ నా ఫ్రెండ్. అక్కడ పెద్ద షుగర్ ఫ్యాక్టరీ పెట్టమని నన్నెంతగానో అడిగాడు. చూస్తానన్నాను" అన్నాడు కామరాజు.

"అయితే అక్కడ మీరొక ఫ్యాక్టరీని పెట్టండి" అన్నాడు పటేల్.

"ఒక కండిషన్ మీద అక్కడ ఫ్యాక్టరీ పెడ్తాను. నా వయసు యాభై దాటింది. నేను నైజీరియాకు తరచు వెళ్ళలేను. నువ్వు వెళ్తానంటే నేను ఫ్యాక్టరీ పెడ్తాను. నువ్వు వూరికే వెళ్ళొద్దు. అక్కడ మనకొచ్చే లాభాల్లో నీకు సగం యిస్తాను" అన్నాడు కామరాజు.

"ఎంత లాభం వస్తుంది?"

"సాలుకు కనీసం రెండు కోట్లు" అన్నాడు కామరాజు.

పటేల్ వులిక్కిపడ్డాడు. కామరాజు చెప్పినట్లు చేస్తే తనకు సాలుకు కోటి రూపాయలు వస్తుంది. గొప్ప ఆదాయం!

"నేను తరచు నైజీరియా వెళ్ళి వస్తూంటాను"

అన్నాడు పటేల్.

"చాలా సంతోషం. మిషనరీకి వెంటనే ఆర్డరు యిస్తాను" అన్నాడు కామరాజు.

పది దాటింది. వాళ్ళింకా తాగుతూనే వున్నారు. పటేల్ బాగా నిషాలో వున్నాడు.

"సుజాతా, నువ్వూ రాధ వెళ్ళి డిన్నర్ తీసుకుని పడుకోండి. నీ భర్త తర్వాత నీ గదికొస్తాడు" అన్నాడు కామరాజు.

"నేను నిద్రపోతే లేవలేను" అంది సుజాత.

"డోంట్ బాదర్. తలుపు మూసి లాక్ చేయి! తాళం తెర్చుకొని నీ భర్త వస్తాడు" అన్నాడు కామరాజు.

"గుడ్ ఐడియా" అందామె.

సుజాతను డైనింగ్ హాలుకి రాధ తీసుకుపోయింది. ఇద్దరూ డిన్నర్ తీసుకున్నారు. సుజాత తనగదికి రాధతో వెళ్ళింది.

ఇద్దరూ కాసేపు మాట్లాడారు.

"నాకు నిద్ర వస్తోంది" అంది సుజాత.

"హాయిగా పడుకో! నేను బయట లాక్ చేసి వెళ్ళిపోతాను. తాళంచెవిని నీ భర్తకిస్తాను" అంది రాధ.

"ఫైన్ ఐడియా" అంది సుజాత.

# 3

కామరాజు, పటేల్ యింకా తాగుతున్నారు. రాధ వాళ్ళ ముందుకొచ్చింది. అతడివైపు నవ్వుతూ చూసింది.

"మీ భార్య నిద్రపోతోంది. గదికి తాళం వేశాను. ఇదుగో తాళంచెవి," అని ఆమె తాళంచెవిని అతడికిచ్చింది.

నిషాలో వున్న పటేల్ తాళం చెవిని తన జేబులో పడేసుకున్నాడు.

"నాన్నా, నేను వెళ్ళి పడుకుంటాను" అంది రాధ.

"పడుకో అమ్మా" అన్నాడు కామరాజా.

రాధ వెళ్ళిపోయింది. సోఫాలో పడుకుని వున్నాడు పటేల్. కామరాజు మామూలుగానే వున్నాడు. ఎంత విస్కీ తాగినా అతడిమీద పని చేయదు.

అతడు టైమ్ చూశాడు. పదకొండు దాటింది. కామరాజు యూనిఫామ్డ్ నౌఖర్ని పిల్చాడు. అతడు దగ్గరగా వచ్చాడు.

"మస్తాన్!" పిల్చాడతను.

"సార్," అన్నాడు నౌఖరు.

"అతడు నిద్రపోతున్నాడు. లేస్తే మళ్ళా అతనికి విస్కీ యియ్యి. అతడు కదలకుండా యిక్కడే పడుకోవాలి" అన్నాడతను.

"అతడు లేస్తే నొక్కేస్తాను, సార్. విస్కీ నోట్లో పోసి పడుకోబెడ్తాను" అన్నాడు మస్తాన్.

"గుడ్," అని కామరాజు సోఫాలోంచి లేచాడు.

బాత్రూమ్‌లో నిలబడి కామరాజు సిగరెట్ వెల్గించాడు. అతడి చెయ్యి జేబులోకి వెళ్ళింది. తాళంచెవుల గుత్తి వుందక్కడ!

బాత్రూమ్‌లోంచి అతడు డైనింగ్ హాల్లోకి వెళ్ళాడు. కుర్చీలో కూర్చున్నాడు. యూనిఫామ్డ్ నౌఖరు దగ్గర కొచ్చాడు.

"గెట్ మై డిన్నర్" అన్నాడతను.

అతడు అరగంటపాటు తృప్తికరంగా తిన్నాడు. టైమ్ చూశాడు. పన్నెండు కావస్తోంది. సుజాత యీ

పాటికి నిద్రపోతూ వుంటుంది!

పన్నెండు తర్వాత రామరాజు రాయల్ గెస్టురూమ్స్ వైపు నడిచాడు. జేబులో వున్న తాళంచెవుల గుత్తిని పైకి తీశాడు. ప్రతి తాళంచెవి మీద గది నంబరు వుంది. అతడు తలుపు లాక్ తెర్చి మెల్లిగా లోపలకు వెళ్ళాడు.

తలుపును మూశాడు. పడగ్గదిలోకి మెల్లిగా నడిచాడు. జీరోవాట్ బల్బు వెల్గుతోంది. డబుల్ కాట్ మీద ఆమె పడుకుని వుంది!

ఆమె పరుపు దగ్గరగా వెళ్ళాడు. జీరోవాట్ బల్బును ఆఫ్ చేశాడు. గదిలో చాలా చీకటిగా వుంది. చీకట్లో తడువుకుంటూ అతడు పరుపుమీద పడుకున్నాడు.

మెల్లిగా ఆమె దగ్గరగా జరిగాడు. ఆమె శరీరం అతడికి తగుల్తోంది. అతడి వొళ్ళు వేడెక్కింది. ఆమె పెదిమలను ఉద్రేకంతో ముద్దెట్టుకున్నాడు.

ఆమె మేల్కోలేదు. అతడిని దూరంగా తోసెయ్యలేదు.

అతడామెను మళ్ళా ముద్దెట్టుకున్నాడు.

"ఇంత ఆలస్యంగా వచ్చారా?" అందామె.

మళ్ళా ఆమె నిద్రలోకి జారిపోయింది.

నిద్రమత్తులో ఆమె యేదో అడిగి మళ్ళా పడుకుంది. ఆమెమీద చెయ్యివేసి దగ్గరగా అతడు లాక్కున్నాడు. చీకట్లో ఆమె రూపం కపడ్డంలేదు.

మళ్ళా ఆమె పెదిమలను అతడు ముద్దెట్టుకున్నాడు.

రెండు గంటల దాకా అతడు ఆమె పక్కనే వున్నాడు. తనివితీరా స్వర్గసుఖాన్ని అనుభవించాడు.

అతడు కిందకు దిగాడు. తన గుడ్డలను సరిచేసుకున్నాడు. జీరోవాట్ బల్బు స్విచ్ ఆన్ చేశాడు. ఆమె

గాఢ నిద్రలో వుంది.

క్షణకాలం ఆమెవైపు చూసి అతడు పరుపుదగ్గరగా వెళ్లాడు. నగ్నంగా వున్న శరీరంమీద దుప్పటి కప్పేశాడు.

మెల్లిగా బయటకు నడిచాడు. తలుపు మూసి తాళం వేశాడు. బాత్రూమ్‌లోకి చేరుకున్నాడు. అక్కడ మస్తాన్ తప్ప మరెవ్వరూ లేరు.

"మస్తాన్, ఇతను యింకా నిద్రపోతున్నాడా?" ప్రశ్నించాడతను.

"ఒకటే నిద్ర, సార్."

నిద్రపోతున్న పటేల్ వైపు కామరాజు మౌనంగా చూశాడు.

"ఇతడిని మోసుకెళ్ళి ఆ గదిలో భార్య పక్కనే పడుకోబెట్టు" అన్నాడతను.

"అలాగే సార్," అన్నాడు మస్తాన్.

# 4

ఆమె లేచేసరికి ఏడు దాటింది. పక్క పడుకున్న భర్తవైపు ఆమె నవ్వుతూ చూసింది. అతను పాంటు, స్లాక్‌లో వున్నాడు. గాఢ నిద్రలో వున్నాడు.

ఆమె కిందకు దిగింది. బూట్లు, సాక్స్ మంచం కింద వున్నాయి. తన భర్త నైట్ డ్రెస్ వేసుకోకుండా పడుకోవడం విచిత్రంగా వుంది.

రాత్రి అతడామెను లేపాడు. ఆమె మెల్లిగా జ్ఞాపకం తెచ్చుకుంటోంది. జరిగినదంతా గుర్తు తెచ్చుకుని ఆమె తనలో తాను నవ్వుకుంది.

బాగా తాగి భర్త తన గదిలోకి వచ్చాడు. తన కోర్కె తీర్చుకొని అతడు నిద్రపోయి వుండాలి. అతడు

ఎప్పుడు లేస్తాడో!

తలుపును యెవరో తట్టారు. ఆమె వెళ్ళి తలుపు తెర్చింది.

తెల్లని యూనిఫామ్‌లో వున్న నౌఖరు బయట నిల బడి వున్నాడు.

"కామరాజు గారు బ్రేక్‌ఫాస్టుకు డైనింగ్ రూమ్‌కి వెళ్తున్నారు. సిద్ధంగా వుంటే మిమ్మల్ని రమ్మన్నారు" అన్నాడతను.

"ఆయనింకా లేవలేదు, పడుకునే వున్నారు" అందామె.

"మీకేదేనా గదికి పట్టమ్మంటారా?"

"హాట్ కాఫీ" అందామె.

అతడు వెళ్ళిపోయాడు. ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. కొత్త బ్రష్‌లు, టూత్ పేస్టు అక్కడున్నాయి. ఆమె పళ్ళు తోముకుని, మొహం కడుక్కొని, తువ్వాల్తో తుడుచుకుంటూ హాల్లోకి వెళ్ళింది. యూనిఫామ్ నౌఖరు ఒక ట్రేను తెచ్చి ముందున్న టీపాయిమీద పెట్టాడు. అతడు మౌనంగా వెళ్ళిపోయాడు.

కప్పులో ఆమె కాఫీ కలుపుకొని తాగింది. కాఫీ చాలా బాగుంది. రెండు కప్పుల కాఫీ వుషారుగా తాగిం దామె. మరో టీపాయ్‌మీద రెండు దినపత్రికలు వున్నాయి. ఒక పత్రికను తీసి ఆమె చదువుతూ కూర్చుంది.

తలుపు తోసుకుని కామరాజు హాల్లోకి వచ్చాడు. ఆమె వైపు నవ్వుతూ చూశాడు. అతడు పంచ, సిల్కు జుబ్బాలో వున్నాడు.

"గుడ్ మోర్నింగ్, మిసెస్ పటేల్!" అన్నాడతను.

"గుడ్ మోర్నింగ్ సార్," అందామె.

"ఇంకా ఆతడు లేవలేదా?"

"ఎక్కువగా తాగేరేమో క్రితం రాత్రి, గాఢ నిద్రలో వున్నారు" అందామె.

అతడు ఆమె కెదురుగా వున్న సోఫాలో కూర్చున్నాడు. ఆమెవైపు సూటిగా చూశాడు.

"నీలాంటి చక్కటి భార్య అతడికి దొరికినందుకు నాకు సంతోషంగా వుంది."

ఆమె తీయగా నవ్వి వూరుకుంది.

"నిన్న రాత్రి పదకొండుదాకా మేం మాట్లాడాం, విస్కీ సేవిస్తూ. తర్వాత యిద్దరం డిన్నర్ తీసుకున్నాం. అతడు తన గదిలోకి వెళ్ళిపోయాడు. నేను నా గది కెళ్ళి నిద్రపోయాను" అని అతడామెవైపు సూటిగా చూశాడు.

"ఆయనెప్పుడొచ్చారో నాకు గుర్తులేదు. నేను గాఢనిద్రలో వున్నాను" అందామె.

కామరాజు మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. భర్తకు బదులు తను గదిలో కొచ్చినట్లు ఆమె గుర్తించలేదు! అది అన్నివిధాలా మంచిదే!

అతడు సోఫాలోంచి లేచాడు.

"నా ఆర్ట్ గాలరీ చూద్దువుగాని రా!"

"ఆయన లేచాక యిద్దరం వస్తాం" అందామె.

"అతడిని లేపేయి!"

"వద్దు, పడుకోనీయండి. కాస్సేపట్లో ఆయనే లేస్తారు" అందామె.

"మా కారులో మీ రిద్దరూ మహాబలిపురం వెళ్ళి రావచ్చు. అక్కడికి వెళ్ళాలన్నావుగా!"

"థాంక్స్, అలాగే వెళ్తాం" అందామె.

కామరాజు ఆలోచిస్తూ బయటకు నడిచాడు. వెనకనే వెళ్ళి ఆమె తలుపు మూసింది. పడగ్గదిలోకి నడిచింది.

నిద్రపోతున్న భర్తను తట్టి లేపింది. ఎంత లేపినా అతడు లేవలేదు!

విసుగ్గా ఆమె హాల్లో కెళ్ళి పెద్ద సోఫాలో పడుకుని పేపరు చదవసాగింది. ఏదో ఆలోచిస్తూ పేపర్ని టీపాయ్‌మీద పడేసింది. క్రితం రాత్రి గది కొచ్చి తనతో అంత వుషారుగా వున్న భర్త అంతలా ఎందుకు నిద్రపోతున్నాడు?

గదిలో కూర్చుని అతడు మళ్ళా తాగాడా? ఆమె హాలూ, పడగ్గదీ వెతికి చూసింది. గ్లాసులు వున్నాయి కాని విస్కీ బాటిల్ కనిపించలేదు.

తనతో ఎక్కువసేపు కాలం గడిపి అతడు అలసిపోయేరేమో! ఆమె మళ్ళా హాల్లోకి నడిచింది. పొడుగాటి సోఫాలో పడుకుంది.

నిమిషాలు గడుస్తున్నాయి. టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హల్లో," అందామె.

"సుజాతా, నేను, కామరాజు స్పీకింగ్!" అన్నాడతను అటువైపు నుంచి.

"చెప్పండి" అందామె.

"మా యింట్లో నీకు సౌకర్యంగా వుందిగా" ప్రశ్నించాడు కామరాజు.

"ఏమిటా ప్రశ్న సార్! మీ యిల్లు ఇంద్రభవనంలా వుంది. ఇక్కడ కొకసారి వస్తే వెళ్ళ బుద్ధికాదు" అందామె.

"అయితే వెళ్ళకు, యిక్కడే వుండిపో! నాగ్‌పూర్‌లో వున్న మీ ఫ్యాక్టరీని యిక్కడుండే మీరు నడపొచ్చు" అన్నాడతను.

"మీలా డజన్ల మీద మిల్స్, ఫ్యాక్టరీలుంటే యిక్కడనుంచే నడపొచ్చు. మాకున్నది అదొక్కటే. అందువలన మేం అక్కడే వుండాలి" అందామె.

"డోంట్ వర్రీ! నేను పనిమీద బయటకు వెళ్తున్నాను. సాయంత్రం తిరిగివస్తాను. పటేలుతో చాలా మాట్లాడాలి. అతడిని యిక్కడే వుండమను."

"నిద్రలేచాక చెప్తాను" అందామె.

"బైబై" అని కామరాజు రిసీవర్ని పెట్టేశాడు.

## 5

అతడు గోచీ పోసి కట్టిన గ్లాస్కో పంచ, సిల్కు జుబ్బా ఫ్లోరసెంట్ లైట్ల కాంతిలో మెరుస్తున్నాయి.

రాధ, సుజాత, పటేల్ అతడి కెదురుగా ఫోమ్ సోఫాల్లో కూర్చున్నారు. పటేల్ అరగంట క్రితం లేచాడు. కామరాజు అతడిని లేపాడు. మొహం కడుక్కొని అతడు హాల్లోకొచ్చాడు. భార్యతో మాట్లాడే అవకాశం అతడికి చిక్కలేదు. హాల్లో కామరాజు, రాధ వున్నారు. అందరూ కలిసి బార్రూమ్‌కి చేరుకున్నారు.

రాయల్ శల్యూట్ విస్కీని యిద్దరూ సేవిస్తున్నారు. రీగన్ సిగరెట్లు కాలుస్తున్నారు. రాధ, సుజాత కాంపాకోలా సిప్ చేస్తున్నారు.

పటేల్ గ్లాసు ఖాళీ అయింది. కామరాజు నౌకర్ని పిల్చి గ్లాసులో విస్కీ పోయమన్నాడు.

సుజాత అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఆయనచేత మీరు యెక్కువగా తాగించేస్తున్నారు.

మీ గ్లాసులోని విస్కీ అలాగే వుంది!" అందామె.

"అతడు యువకుడు. ఎంత తాగినా అతడు లోపల యిముడ్చుకోగలడు. నేను ముసలాడిని. ఎక్కువగా తాగ లేను" అన్నాడు కామరాజు.

"మీరు ముసలివారు కాదు. మీ వయస్సుకు మీరు చాల బలిష్ఠంగా వున్నారు" అన్నాడు పటేల్.

"నిన్న మీరు ఎంత తాగేరో కాని రోజంతా నిద్ర పోయారు" అంది సుజాత.

పటేల్ ఆమెవైపు చిరాగ్గా చూశాడు.

"సుజాతా, డోంట్ బాదర్. నేనెంత తాగినా చావను!" అన్నాడు పటేల్.

నైజీరియాలో తను పెట్టబోయే షుగర్ మిల్స్ గురించి కామరాజు చెప్పసాగాడు.

"సంవత్సరం పాడుగునా ఆ ఫ్యాక్టరీ పని చేస్తూ వుంటుంది. మిల్స్‌కు కావలసిన చెరుకును మనమే పంపిస్తాం."

"ఎక్సలెంట్" అన్నాడు పటేల్.

పది దాటింది. రాధ పక్కనున్న సుజాతవైపు చూసింది.

"వీళ్ళింకా యింకా తాగుతూనే వుంటారు. మనం వెళ్ళి భోజనం చేద్దాం, పదండి" అంది రాధ.

"నాకు ఆకలిగా లేదు, మీరు వెళ్ళండి" అంది సుజాత.

తన భర్తతో చివరిదాకా కూర్చోవాలని సుజాత ఆశ. తను పక్కనుంటే అతడు కొంచెం తగ్గించి తాగు తాడని ఆమె నమ్మకం.

"ఆమె పిలుస్తూంటే రానంటావేమిటి? గో అండ్

యూట్! తాగుతూ ఎన్నో వ్యాపార విషయాలూ మేం మాట్లాడుతూ వుంటాం" అన్నాడు పటేల్.

"మీరు ఎక్కువగా తాగనంటే నేను వెళ్ళి భోజనం చేసి, పడుకుంటాను" అందామె.

పటేల్ ఆమె చేతిలో చెయ్యి వేశాడు.

"వెళ్ళి భోంచేసి పడుకో! నేనొచ్చి నిన్ను లేపుతాను" అన్నాడు పటేల్.

"నాకు కావలసింది నన్ను లేపడం కాదు. మీరు ఎక్కువగా తాగకపోవడం" అందామె.

"నేను ప్రామిస్ చేస్తున్నాను. ఎక్కువగా తాగను" అన్నాడతను.

రాధ, సుజాత బాత్రూమ్‌లోంచి వెళ్ళిపోయారు. పటేల్ ఎదురుగా వున్న కామరాజువైపు చూశాడు.

"క్షమించండి. భార్య భర్తకి ఒక పిధమైన బెస్టు!"

"పటేల్, అలా అనకు! రెండేళ్ళక్రితం నా భార్య భానుమతి మరణించింది. ఆమె మూలంగా నేనింత ఎదిగాను. ఆమె పోయాక ఆడవాళ్ళవైపు చూడ్డం మానేశాను" అన్నాడు కామరాజు.

"గ్రేట్ లవ్ సార్" అన్నాడు పటేల్.

"మాది గ్రేట్ లవ్! ఆమె నాకోసం జీవించేది. అటువంటి స్త్రీని నేను మళ్ళా చూడను. ఆమెనే స్మరిస్తూ యీనాడు జీవిస్తున్నాను."

"ఆమెను నేను చూడలేదు, కాని మీరు చెప్పింది విన్నాక ఆమె ఒక దేవతలా నాకు అనిపిస్తోంది."

పటేల్ గ్లాసు ఖాళీ అవగానే నిండుతోంది. ఇద్దరూ తాగుతున్నారు' కామరాజు కొద్దిగా, పటేల్ ఎక్కువగా!

పదకొండు కావస్తోంది. పటేల్ సోఫామీద పడి పోయాడు. కళ్ళు మూసుకుని నిద్రపోతున్నాడు.

కామరాజు పిలుపు విని మస్తాన్ దగ్గరకు వచ్చాడు.

"మస్తాన్, ఆమె పడుకుందో, లేదో వెళ్ళి చూసిరా" అన్నాడు కామరాజు.

మస్తాన్ డైనింగ్ హాల్లోకి వెళ్ళాడు. అక్కడ యెవ్వరూ లేరు. అతడు వేగంగా రాయల్ గెస్టు రూమ్స్‌కి వెళ్ళాడు. తలుపును తట్టాడు.

కాస్సేపట్లో తలుపు తెరవబడింది. మేక్సీ ధరించిన సుజాత అతడివైపు చూసింది.

"మీకేదేనా కావాలా?" అడిగాడతను.

"ఏమీ అక్కర లేదు. నేను పడుకుంటాను" అందామె.

ఆమె తలుపు మూసింది. అతడు బాత్రూమ్‌లోకి పరుగెత్తాడు.

"ఆమె యింకా పడుకోలేదు సార్. పడుకుంటానని నాతో అన్నారు" అన్నాడు మస్తాన్.

"గుడ్" అన్నాడు కామరాజు.

అతడు సిగరెట్ వెలిగించాడు. పొగవదుల్తూ మస్తాన్ వైపు చూశాడు.

"మస్తాన్, ఇతడి సంగతి నువ్వు చూసుకో!"

"అలాగే సార్" అన్నాడు మస్తాన్.

అతడు మూడు బడా పెగ్స్ విస్కీ సేవించాడు. చాలా వుషారుగా వుంది. మెల్లిగా అతను డైనింగ్ రూమ్‌లోకి నడిచాడు. కుర్చీలో కూర్చున్నాడు.

మెల్లిగా డిన్నర్ తినసాగాడు. డిన్నర్ తర్వాత అరటిపళ్ళు, యాపిల్ పళ్ళు తిన్నాడు. తన గదికి వెళ్ళాడు.

దుసులుమీద బాగా సెంటు పులుముకున్నాడు. అద్దంలో తనరూపంవైపు తృప్తికరంగా చూసుకున్నాడు.

సుజాత తనకు బాగా నచ్చింది. క్రితం రాత్రి ఆమె తనకిచ్చిన ఆనందాన్ని అతను ఈ జీవితంలో మరువ లేడు!

ఆలోచిస్తూ అతడు రాయల్ గెస్టురూమ్స్‌వైపు నడిచాడు. తలుపు తాళం తెర్చి లోపలకు వెళ్ళాడు. హాల్లో చీకటిగా వుంది. పడగ్గదిలోకి వెళ్ళాడు. జీరోవాట్ బల్బు వెలుగుతోంది. ఆమె పరుపుమీద పడుకుని వుంది.

అతడు దగ్గరగా వెళ్ళాడు. జీరోవాట్ బల్బ స్విచ్‌ని ఆఫ్ చేశాడు. గదిలో చీకటి! ఏర్ కండిషండ్ గది కావడంవలన చల్లగా వుంది.

అతడు పరుపుమీద వాలాడు. మెల్లిగా ఆమెవైపు జరిగాడు. ఆమెమీద చెయ్యి వేశాడు.

ఆమె పక్కకు జరిగి కిందకు దిగింది. మెల్లిగా వెళ్ళి లైట్ స్విచ్ నొక్కింది. ఫ్లోరసెంట్ లైట్ వెలిగింది.

పరుపుమీదున్న అతడివంక ఆమె ఆశ్చర్యంగా, కోపంగా చూసింది.

"మీరా!"

"నేనే!" అన్నాడతను.

"నిన్న రాత్రి కూడా మీరే వచ్చారా?"

"నేనే వచ్చాను. నువ్వు ఆనందంగా నాకన్నీ అందించావు" అన్నాడతను.

"మీరు పెద్దమనిషి అనుకున్నాను. మీరొక క్రూక్!" అర్చిందామె.

"నీ అందాన్ని చూశాక నాకు క్రూక్ అవాలనిపించింది. నేనలా అవడానికి కారణం నీ అందం!" అన్నాడతను.

"కామరాజుగారూ, నిన్న రాత్రి యేదో జరిగిపోయింది, నాకు తెలియక. మీరు బయటకు వెళ్ళిపోండి" అందామె.

"తెగించి లోపల కొచ్చింది బయటకు పోవడానికి కాదు!" అన్నాడతను.

"అరుస్తాను! ప్లీజ్, వెళ్ళండి!"

"ఇది సౌండ్ ప్రూఫ్ గది. నువ్వు యెంత అర్చినా ఎవ్వరూ రారు. నేను చెప్పినట్లు చేస్తే నువ్వు రాణీలా జీవిస్తావు!"

"పటేల్‌ని మనసారా ప్రేమించి పెళ్ళాడాను. అతడిని నేను మోసం చేయను" అందామె.

"నిన్న రాత్రి అతడిని మోసం చేశావు!" అన్నాడతను.

"నేను మోసం చేయలేదు. అతడే వచ్చాడనుకున్నాను. నేను మోసపోయాను" అందామె.

"అంతా జరిగిపోయాక యిప్పుడు వెనక్కి వెళ్ళడం ఎందుకు? నా భార్య చనిపోయింది. పటేల్‌కి భార్యగా వుంటూ నువ్వు నాకు ఆనందాన్ని యివ్వొచ్చు."

ఆమె చెవులు మూసుకుంది. అతడామె దగ్గరకు అడుగులు వేశాడు. ఆమె దూరంగా వెళ్ళింది.

"సుజాతా, యిలా రా! నన్ను ఎదిరించేవాళ్ళు యీ లోకంలో బ్రతికుండరు!" అర్చాడతను.

"మేం అమాయకులం. ఎవ్వరికీ మేం హాని చెయ్యలేదు. మమ్మల్ని మా హోటల్కి పోనీయండి"

అందామె.

"నా కోర్కె తీర్చాక వెళ్ళొచ్చు" అన్నాడతను.

"మీ కోర్కె నేను తీర్చను. కావలిస్తే నన్ను చంపి మీ కోర్కె తీర్చుకోండి! అమాయకుడైన పటేల్‌ని విస్కీతో బంధించి మీరు యిక్కడి కొచ్చారు. ఇటు వంటి జీవితం మీలాంటి పెద్దలకు ధర్మం కాదు" అందామె.

అతడామెవంక సూటిగా చూశాడు.

"సుజాతా, నాకు డజన్ల మీద ఫ్యాక్టరీలు వున్నాయి. నేను కోటీశ్వరుడిని. నైజీరియాలో ఫ్యాక్టరీ స్థాపించి నీ భర్తను అక్కడకు పంపించేస్తాను. మనం యిక్కడ హాయిగా వుండొచ్చు. నువ్వేం కోరినా క్షణంలో నేను నీకు యివ్వగలను" అన్నాడతను.

ఆమె హాల్లోకి పరుగెత్తింది. తలుపు తెర్చి బాత్రూమ్‌లోకి వెళ్ళింది. సోఫాలో పడుకున్న పటేల్ మీద పడింది. అతడిని లేపడానికి ఎన్నిసార్లో తట్టింది. అతడు లేవలేదు. ఏడుస్తూ అతడిమీద పడిపోయింది.

కామరాజు అక్కడి కొచ్చి ఆమెవైపు వ్యంగ్యంగా నవ్వుతూ చూశాడు.

"నీ పటేల్ విస్కీ మత్తులో వున్నాడు. నిన్ను రక్షించడానికి అతడు లేవలేడు" అన్నాడు కామరాజు.

అతడామె చెయ్యిని పట్టుకున్నాడు.

ఆమె విదిలించుకుంది. అతడు పక్కకు పడబోయి ఆపుకున్నాడు.

"మస్తాన్, ఆమెను పట్టుకో!" అర్చాడతను.

మస్తాన్ భల్లూకపు హస్తాలు ఆమెను చుట్టేశాయి.

"ఆమెను రాయల్ గెస్టురూమ్స్‌కి తీసుకు వెళ్ళు"

అన్నాడు కామరాజు.

ఆమె రక్కుతోంది, గోళ్ళతో మస్తాన్ని గీకుతోంది. అయినా ఆమెను అతడు మోసుకుపోయాడు.

పడగ్గదిలోకి వెళ్ళాడు కామరాజు.

ఆమె పరుపుమీద పడుకుని వుంది. కదలకుండా మస్తాన్ ఆమెను పట్టుకున్నాడు.

మస్తాన్ సహాయంతో కామరాజు ఆమెను బలాత్కరించాడు. జంతువులా ఆమెను రేప్ చేశాడు. తన కోరిక తీరాక అతడు కిందకు దిగాడు. నగ్నంగా వున్న ఆమె వైపు చూశాడు.

"నేనంటే ఎవరో యిప్పటికేనా తెలిసిందా?" అడిగాడతను.

"నువ్వొక రాక్షసుడవు!" అందామె.

"మస్తాన్ పోదాం పద" అన్నాడతను.

మస్తాన్ మొదట బయటకు నడిచాడు. అతడు ఆమె వైపు క్రూరంగా చూశాడు.

"జరిగినదంతా నువ్వు నీ భర్తతో చెప్పుకో! నాకు భయంలేదు. దేశంలోని మంత్రులందరూ నా స్నేహితులే. నాకేమీ అవదు. కాని నువ్వు నాశనమవుతావు!" అన్నాడతను.

అతడు వెళ్ళిపోయాడు. ఆమె పరుపుమీద పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

కాస్సేపట్లో పటేల్ని మోసుకొచ్చి మస్తాన్ ఆమె పరుపుమీద పడేశాడు.

మస్తాన్ ఆమెవైపు అదోలా చూశాడు.

"నిన్ను నేనూ ఒకసారి చూస్తాను" అన్నాడతను.

ఆమె మస్తాన్ వైపు భయంతో చూసింది.

"పిచ్చిగా మాట్లాడకు! కామరాజుగారితో చెప్తే నీ తోలు వలుస్తారు" అందామె.

"చెప్పొద్దమ్మా!" అని అతడు బయటకు పరుగెత్తాడు.

పరుపుమీద పడుకున్న భర్తమీద పడి ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

# 6

మర్నాడు పొద్దుట పదింటికి పటేల్, సుజాత వాళ్ళ హోటల్ గదికి చేరుకున్నారు. పటేల్ ఆమెవైపు ఆత్రంగా చూశాడు.

"సుజాతా, నువ్వు ఎలాగో వున్నావు. నేను యేదేనా తప్పు చేశానా?" అడిగాడతను.

"లేదు" అందామె.

"అయితే నవ్వుతూ వుండు!" అన్నాడతను.

"ఇటువైన నేను నవ్వను" అందామె.

"మైడియర్, నీకు ఏమైంది?"

"ఏమీ కాలేదు" అందామె.

"నేను ఎక్కువగా తాగానని నువ్వు కోపగించి వుంటావు. ఇటువైన తాగను. నన్ను క్షమించు" అన్నాడతను.

"నా కోసం మీరు తాగడం మానొద్దు. మీ యిష్టమొచ్చినట్లు తాగండి" అందామె.

పన్నెండింటికి పటేల్ పనిమీద బయటకు వెళ్ళి రెండింటికి తిరిగి వచ్చాడు. ఆమె గదిలో లేదు. ఆమె యేమైంది? తలగడ కిందనుంచి యేదో కాగితం ఫాన్ గాలిలో ఎగుర్తోంది. అతడా కాగితాన్ని తెర్చి చూశాడు.

సుజాత రాసిన ఉత్తరమది. ఆ ఉత్తరాన్ని పదే పదే చదివేడతను.

"ప్రియమైన పటేల్ గార్కి,

"నన్ను క్షమించండి. మనం ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. కాని అనుకోని పరిస్థితుల్లో నా శీలాన్ని నేను కోల్పోయాను. కామరాజు నన్ను బలాత్కరించాడు. దానితో నేను పతితగా దిగ జారిపోయాను. మీ మొహం నేను చూడలేను.

"నన్ను మర్చిపోండి. నేను ఎక్కడికో పోతు న్నాను. మళ్ళా మీకు కనిపించను. కామరాజు రాక్షసుడు, దుర్మార్గుడు. అతడితో స్నేహం చేయకండి! నన్ను ధ్వంసం చేసినట్లు అతడు మిమ్మల్ని నాశనం చేస్తాడు.

మీ

సుజాత."

ఆ ఉత్తరాన్ని పదిసార్లు చదివాడతను. అతడి కళ్ళ మ్మట నీళ్ళు జల జల కారాయి.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. ఆమె తనను విడిచి ఎందుకు వెళ్ళిపోయింది? ఆమె ఎక్క డకు పోయింది? ఆమెకు ఏం జరిగినా అతడామెను మన్నించేవాడు. తనతో దీన్ని గురించి మాట్లాడకుండా ఆమె వెళ్ళిపోవడం అతడిని దుఃఖంలో ముంచేసింది.

"సుజాతా, నువ్వు లేకుండా నేనీ లోకంలో బ్రతక లేను! నువ్వు ఏ స్థితిలో వున్నా నిన్ను నేను ప్రేమిస్తూ వుండేవాడిని!" అని అతడు తన లోలోపల అను కున్నాడు.

అతడు బెల్ నొక్కాడు. హోటల్ బాయ్ గదిలోకి

వచ్చాడు.

"ఏం కావాలి సాక్?" అడిగాడు హోటల్ బాయ్.

"ఫుల్ బాటిల్ మెక్డోవల్స్ విస్కీ అండ్ సోడా" అన్నాడతను.

కాస్సేపట్లో విస్కీ బాటిల్ వచ్చింది. అతడు గ్లాసులో విస్కీ పోసుకొని సోడా కలిపాడు. తాగుతూ కూర్చున్నాడు. సగం పైగా తాగుతూనే వున్నాడు.

పర్సులో వున్న సుజాత ఫోటోవైపు అతడు ఆప్యాయంగా చూశాడు.

"సుజాతా, నీకు అన్యాయం చేసిన ఆ కామరాజుని నేను కసితో శిక్షిస్తాను. అంతవరకూ నేను నిద్రపోను" అన్నాడతను పైకి.

అర బాటిల్ పైగా అతడు తాగేశాడు.

టెలిఫోన్ మ్రోగింది. అతడు వెళ్ళి రిసీవర్ని అందుకున్నాడు.

"హలో!" అన్నాడతను.

"కామరాజు హియర్" అన్నాడతను అటువైపు నుంచి.

"మీకేం కావాలి? సుజాత యిక్కడ లేదు. నన్ను విడిచి ఆమె వెళ్ళిపోయింది" అన్నాడు పటేల్.

"ఎక్కడకు పోయింది?" అడిగాడు కామరాజు.

"మీలాంటి రాక్షసులతో ఆమెకు విసుగొత్తింది. ఆమె దూరంగా పారిపోయింది!"

"నేను రాక్షసుడినా?" అన్నాడు కామరాజు నవ్వుతూ

"మిస్టర్ కామరాజు, మీ గురించి ఆమె నాకంతా

పుత్తరంలో రాసింది. యూ ఆరే రియల్ డెవిల్! యూ ఆరే బాస్టర్డు!" అర్చాడు పటేల్.

# 7

పటేల్ నాగ్‌పూర్ చేరుకున్నాడు. కాని అతడు ఆనందంగా లేడు. తను ప్రాణసమానంగా ప్రేమించిన సుజాత తనపక్క లేదు. ఆమె కోసం అతడు యెన్ని చోట్లో వెతికాడు. కాని ఆమె ఎక్కడా కనపడలేదు! ఆమె ఆత్మహత్య చేసుకుందేమో!

కామరాజును తను శిక్షించాలి! అతడు వెక్కి వెక్కి ఏడ్వాలి! అందుకు తనేం చేయాలి?

తోటమాలి అతడి ముందుకు వచ్చాడు.

"సార్, నేను మా వూరు వెళ్ళిపోతున్నాను" అన్నాడతను.

"మరెవరినైనా నువ్వే తీసుకురా!" అన్నాడతను.

"ఇతడికి నా పని యివ్వండి" అన్నాడు తోటమాలి.

తోటమాలి వెనక నిలబడిన వ్యక్తివైపు పటేల్ చూశాడు. చిరిగిన పాంట్, స్లాక్ ధరించాడు.

"ఇతడి పేరు విన్‌సెంట్ సార్. చాలా మంచివాడు. మీ తోటను జాగ్రత్తగా చూస్తాడు. నాకిచ్చే జీతమే అతడికివ్వండి" అన్నాడు తోటమాలి.

"వెంటనే పనిలోకి చేరమను," అన్నాడు పటేల్.

"చేరాను, సార్" అన్నాడు విన్‌సెంట్.

తోటమాలి, విన్‌సెంట్ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

పటేల్ ఆలోచిస్తూ గదిలో పచార్లు చేస్తున్నాడు. అతడి మెదడులో ఏదో టార్చిలా వెలిగింది!

కామరాజు ముద్దుల కూతురు రాధ అతడికి గురు కొచ్చింది. అతడు విచిత్రంగా నవ్వాడు.

అతడి తల్లి గదిలోకి కొచ్చింది. అతడివైపు విచార వదనంతో చూసింది. కారు యాక్సిడెంట్‌లో సుజాత మరణించిందని అతడు తల్లితో అబద్ధమాడాడు.

"బాబూ, ఆమెను గురించి ఆలోచించి నీ మనస్సు పాడుచేసుకోకు! నువ్వింకా చిన్నవాడవు. మళ్లా పెళ్లా డొచ్చు" అందామె.

అతడు వ్యంగ్యంగా నవ్వాడు.

"అలా నవ్వుతా వెందుకురా? మీ నాన్నగారు నన్ను రెండో పెళ్ళి చేసుకున్నారు" అందామె.

"నేను మళ్లా పెళ్ళి చేసుకోనమ్మా! సుజాత కోసం శాశ్వతంగా ఒంటరిగా వుండిపోతాను" అన్నాడతను.

"ఆమెమీద నీకున్న ప్రేమ అలా చెప్పిస్తుంది. కొంత కాల మయ్యాక నువ్వే మారతావు!" అందామె.

"నాలో ఏ మార్పూ రాదమ్మా. నా హృదయంలో సుజాత రూపమే వుంది. మరెవ్వరూ అక్కడకు చేరుకో లేరు!" అన్నాడతను.

ఆమె మౌనంగా వెళ్ళిపోయింది. అతడు కిటికీ దగ్గరగా వెళ్ళి తోటలో వున్న మొక్కలవైపు చూశాడు.

కొత్తగా పనిలో చేరిన విన్సెంట్ మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు. కొంతసేపు అదంతా చూసి పచేల్ సిగరెట్ వెలిగించాడు.

కొంచెం పొగ పీల్చి సిగరెట్‌ని మూలకు విసిరేశాడు. అతడు ఆలోచిస్తున్నాడు. కామరాజుమీద తన పగ తీర్చుకోవాలి!

# 8

ఆగిన కారులో కూర్చుని అతడు సిగరెట్ కాలుస్తున్నాడు. రోడ్డు దీపాలు వెల్గుతున్నాయి. విస్కీ సేవించి యింట్లో కూర్చోలేక, పటేల్ కారులో తిరుగుతూ, కారును ఒక పార్కు పక్కనే ఆపుకుని కూర్చున్నాడు.

ఒక యువతి కారు పక్కకు వచ్చింది. అతడిని చూసి నవ్వింది. ఆమె అందంగా వుంది.

ఆమెకేసి అతడు సూటిగా చూశాడు.

"ఎవరు నువ్వు?"

"పేరు మాధవి. నూరు రూపాయలు యిస్తే మీరు యేం చెయ్యమన్నా చేస్తాను."

"కారులో కూర్చో" అన్నాడతను.

ఆమె కూర్చుంది. అతడు తలుపు మూసి కారును పోనిచ్చాడు. వేగంగా కారు రోడ్డమ్మట కదుల్తోంది.

"మీ యింటికా?" అందామె.

"నీతో మాట్లాడాలి" అన్నాడతను.

"చెప్పండి!"

"నువ్వు నాతో మద్రాసు రావాలి. నా సెక్రటరీగా నటించాలి."

"అలాగే చేస్తాను. నా కెంత యిస్తారు?"

"చాలా పెద్ద మొత్తం యిస్తాను. ఇటుపైన నువ్వు యిలా రోడ్డమ్మట వేటాడుతూ తిరగవలసిన అవసరం లేకుండా చూస్తాను."

"ఒప్పుకుంటున్నాను. మద్రాసు యెప్పుడు వెళ్లాలి?" అడిగిందామె.

"అదంతా తర్వాత చెప్తాను. నువ్వు ఎక్కడుంటున్నావు?"

"పాతబడిన ఒక యింట్లో వుంటున్నాను. అమ్మ నాతో వుంది."

ఒకచోట అతడు కారును ఆపాడు. పర్సులోంచి వెయ్యి రూపాయలు తీసి ఆమె కిచ్చాడు. తన పేరూ, టెలిఫోన్ నంబర్లూ వున్నా కార్డు ఆమె కిచ్చాడు.

"ఈ డబ్బు అడ్వాన్సుగా వుంచుకో. ప్రతిరోజూ కార్డులోని పై నెంబరుకి ఫోన్ చేయి. మద్రాసు ఎప్పుడు వెళ్లాలో నేను చెప్తాను."

"అలాగే సార్" అందామె.

"నిన్నెక్కడ దింపను?"

"ముందున్న జంక్షన్‌లో దింపండి. అక్కడ నుంచి నేను నడిచి వెళ్ళిపోతాను" అందామె.

అతడు కారును పోనిచ్చాడు. జంక్షన్ దాటాక కారు ఆపాడు. ఆమె కిందకు దిగింది.

"మీకు చాలా థాంక్స్, సార్."

"నువ్వు చాలా అందంగా వున్నావు ఏ యువకుడైనా నిన్ను పెళ్లాడేవాడు. ఎందుకిలా తయారయ్యావు?" అడిగాడతను.

"ఒక ధనవంతుడు నన్ను ప్రేమించే నన్నాడు. నా కన్యత్వాన్ని దోచుకున్నాడు. నన్ను నట్టేట వదిలేశాడు. నేనొక పతితనని అందరికీ తెలిసిపోయింది. మరే గత్యం తరం లేక యిలా జీవిస్తున్నాను."

కాస్సేపు మాట్లాడలేదు పటేల్.

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కామరాజు, అతడి ముద్దుల కూతురు రాధ పటేల్‌కి జ్ఞప్తి కొచ్చారు.

"మీకు జరిగింది విని చాలా విచారిస్తున్నాను. ధన మదంతో కొందరు ధనవంతులు ఎన్నో ఘోరకృత్యా

లను చేస్తారు. కాని ఎప్పుడో అప్పుడు వాళ్ళు శిక్ష అనుభ విస్తారు." అన్నాడతను.

ఆమె వెళ్ళిపోయింది. వెనక్కి తిప్పి కారును అతడు పోనిచ్చాడు.

# 9

బాత్రూమ్‌లోని లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

హాంకాంగ్‌లోని మోడీ గ్రూప్ ఆఫ్ యిండస్ట్రీస్ అధిపతి, అతడి సెక్రటరీ మిస్ మాధవి ఫోమ్ సోఫాల్లో కూర్చున్నారు.

ఎదురుగా కామరాజు, అతడి కూతురు రాధ కూర్చుని వున్నారు.

"నేను లండన్ వెళ్ళినపుడు మీ గ్రూపు గురించి పత్రికల్లో చదివాను. చాలా పెద్ద గ్రూపు మీది" అన్నాడు కామరాజు.

"నా తండ్రిపోయాక నేను అధిపతి నయ్యాను. కాని కంపెనీలను ఎలా నడపాలో నాకు తెలియదు. ఒకసారి మీరు హాంకాంగ్ వచ్చి నాకు మీ సలహాలివ్వాలి."

"తప్పక వస్తాను" అన్నాడు కామరాజు.

వాళ్ళిద్దరూ షీవాస్ రీగల్ విస్కీ సేవిస్తున్నారు. రాధ, మిస్ మాధవి కాంపా కోలా తాగుతున్నారు.

"మిష్టర్ మోడీ, మీరిద్దరూ యిక్కడే నా అతిధులుగా వుండండి" అన్నాడు కామరాజు.

"అలాగే" అన్నాడు మోడీగా నటిస్తున్న పటేల్.

పటేల్ వేషం బాగా మారింది. గిరజాల జుత్తు. చిన్న గడ్డం. కళ్ళకు డార్క్ గ్లాసెస్. నుదురుమీద నల్లటి మచ్చ!

టైము పదికావస్తోంది. కామరాజు సెక్రటరీ మాధవితో ఏదో చెప్తున్నాడు. పటేల్ రాధ పక్కకు జరిగాడు. ఆమెతో మాట్లాడసాగాడు.

రాధ కుర్చీలోంచి లేచింది.

"నేను భోజనానికి వెళ్తున్నాను. ఎవరేనా వస్తారా?" అందామె.

"నా సెక్రటరీ పన్నెండు అయితేగాని డిన్నరు తినదు. నేను వస్తాను" అన్నాడు పటేల్.

"మీరు వెళ్ళి భోజనం చేయండి. మాధవీ, నేను తర్వాత తింటాం" అన్నాడు కామరాజు.

రాధతో పటేల్ వెళ్ళిపోయాడు. డైనింగ్ టేబుల్ ముందు కుర్చీల్లో కూర్చున్నారు. ఆమె తీయగా కబుర్లు చెప్తోంది.

"రాధా, నువ్వు హాంకాంగ్ రావాలి నీ తండ్రితో" అన్నాడతను.

"ఆ పట్నం గురించి యెంతో చదివాను" అందామె.

ఇద్దరూ తింటూ మాట్లాడుకుంటున్నారు.

"రాధా, నిన్ను చూశాక నాకు చాలా ఆనందంగా వుంది. వెంటనే పెళ్లాడమని అమ్మ నాకు రోజూ చెప్తూ వుంటుంది, కాని నేను యిప్పుడు కాదంటాను. నిన్ను చూశాక వెంటనే పెళ్ళాడాలనిపిస్తోంది" అన్నాడతను.

అతడివైపు ఆమె కొంతసేపు మౌనంగా చూస్తూ వుండిపోయింది. అతడు చాలా ఆకర్షణీయంగా వున్నాడు.

"నాన్నతో మాట్లాడండి" అందామె.

"నువ్వు ఒప్పుకుంటే తర్వాత నీ తండ్రితో మాట్లాడతాను" అన్నాడతను.

ఆమె జవాబివ్వకుండా నవ్వింది. అతడామె చెయ్యి

పట్టుకుని నిమిరాడు.

భోజనం అయ్యాక యిద్దరూ ఆమె గదికి వెళ్లారు. హాలు, పడగ్గది అఖండంగా వున్నాయి.

సోఫాలో అతడి పక్కనే ఆమె కూర్చుంది. అమాంతంగా ఆమెను అతడు కౌగలించుకుని, పెదిమలమీద ముద్దెట్టుకున్నాడు.

"అంతా పెళ్ళయినాక!" అందామె.

"మన పెళ్ళిని యెవరూ ఆపరు. నాకు నచ్చిన పిల్లను నేను పెళ్ళాడ్తాను" అన్నాడతను వుద్రేకంతో.

టైమ్ పదకొండు దాటింది. తలుపును ఎవరో తట్టారు. ఆమె వెళ్ళి తలుపు తెర్చింది. తండ్రివైపు నవ్వుతూ చూసింది.

"మోడీ ఏడి?" అడిగాడు కామరాజు.

"నాన్నా, మేమిద్దరం ప్రేమించుకుంటున్నాం. నేనతడిని పెళ్ళాడ్తాను" అందామె.

"గుడ్, అలాగే పెళ్లాడు. మీ పెళ్ళి వైభవంగా చేయిస్తాను" అన్నాడు తండ్రి.

"ఐ లవ్ యు నాన్నా" అందామె.

"రాధా, యీ రాత్రి అతడు నీ గదిలోనే వుంటాడా?"

"మేం ఎన్నో విషయాలు మాట్లాడుకోవాలి. ఈ రాత్రి మాకు నిద్రపట్టదు" అందామె.

"రాధా, పెళ్ళికి ముందు అతడు తొందరపడకుండా జాగ్రత్తపడు. నువ్వు పెద్దింటి బిడ్డవు. నీకు ఏ ప్రమాదమూ రాకూడదు."

"మోడీకి నేనంటే యెంతో ప్రేమ. నాకే హానీ రాదు" అందామె.

"మాధవి ఎలా వుందో చూసి నేను నా గదికి పోతాను" అని కామరాజు వెళ్ళిపోయాడు.

# 10

వారం రోజులపాటు పటేల్ అక్కడే వున్నాడు. రాధ అతడితో అనేక చోట్లకు వెళ్ళివస్తూండేది.

ఒకనాటి ప్రొద్దుటే అతడు కామరాజు ముందుకు నడిచాడు.

"మీరు రమ్మన్నారుట!" అన్నాడు.

"మీ పెళ్ళి విషయం మాట్లాడాలి!" అన్నాడు కామరాజు.

"మా యింటికి పెద్ద నేనే. అమ్మ పెళ్ళికి వస్తుంది. అంతా మీరు నాతో మాట్లాడితే చాలు" అన్నాడతను.

"వెంటనే ముహూర్తం పెట్టించనా?"

"నేను లండన్ వెళ్ళి తిరిగి వస్తాను. అక్కడ అర్జంటు పనుంది. నేను తిరిగివచ్చాక రాధను పెళ్ళాడ్తాను" అన్నాడు పటేల్.

కామరాజు అతడివైపు సూటిగా చూశాడు.

"అలాగే చేద్దాం" అన్నాడతను.

ఆనాటి మధ్యాహ్నం పటేల్, మాధవి విమానంలో వెళ్ళిపోయారు.

నాగ్‌పూర్ చేరుకున్నారు. ఒక జంక్షన్ లో డ్రయివరు కారును ఆపాడు. అతడామెకు ఒక కవరును యిచ్చాడు.

"మాధవీ, నువ్వు నాకు చాలా సహాయపడ్డావు. ఈ కవరులో యిరవై ఐదు వేలుంది. మళ్ళా నువ్వు రోడ్లమ్మట తిరగనక్కరలేదు" అన్నాడతను.

"మిమ్మల్ని ఈ జీవితంలో మరువను" అని ఆమె కార్లోంచి దిగింది.

దూరంగా నిలబడి వున్న డ్రయివర్ వచ్చి కారులో కూర్చున్నాడు. కారును పోనిచ్చాడు.

నెలలు గడిచిపోయాయి. కాని పటేల్ తిరిగిరాలేదు. అతడిచ్చిన లండన్ అడ్రెసుకు రాధ ఎన్నో ఉత్తరాలు రాసింది. కాని జవాబులేదు.

రాధ గర్భవతి అయ్యింది. గాభరాగా కామరాజు ఆమెవైపు చూశాడు.

"తొందరపడవద్దని నేను ముందే నిన్ను హెచ్చరించాను. నువ్వు నా మాట వినలేదు" అన్నాడు కామరాజు.

"ఆయన నన్ను మోసం చెయ్యరు నాన్నా. త్వరలో ఆయన వస్తారు" అందామె.

"అతడు వెళ్ళి మూడు నెలలు దాటింది. ఒక ఉత్తరం కూడా అతడు నీకు రాయలేదు. నిన్ను నిజంగా ప్రేమించినవాడు అలా వుండడు. ఇందులో ఏదో మోసం వుంది!" అన్నాడు కామరాజు.

"ఆయనమీద నాకు నమ్మకం వుంది నాన్నా" అందామె.

"నేనొకసారి హాంకాంగ్ వెళ్ళివస్తాను" అన్నాడతను.

"వెళ్ళిరా నాన్నా, అది మంచి పని" అందామె.

హాంకాంగ్ వెళ్ళి మూడు రోజులు తిరిగేలోపల కామరాజు తిరిగివచ్చాడు. అతనిముందుకు రాధ ఆత్రంగా వెళ్ళింది.

"ఏమైంది నాన్నా?" అడిగిందామె.

"వాడొక రాస్కెల్! హాంకాంగ్‌లోని మోడీ గ్రూప్ ఆఫ్ యిండస్ట్రీస్ అధిపతి అక్కడే వున్నాడు. తన పేరుతో ఎవడో వాడిని మోసం చేశాడని అతడు అన్నాడు. ఓడిపోయి, వెనక్కి తిరిగివచ్చాను" అన్నాడతను.

రాధ వెక్కి వెక్కి యేడ్వసాగింది. ఆమెవైపు కన్నీళ్ళతో చూశాడు కామరాజు.

"రాధా, నీకిలా అవుతుందని నేను కలలోకూడా అనుకోలేదు."

"నాన్నా, నాకు యిటుపైన జీవించాలని లేదు!" అందామె.

"అలా అనకు రాధా! డాక్టర్ చంద్రన్‌కి ఫోన్ చేసి రమ్మంటాను. అబార్షన్ చేయిస్తాను" అన్నాడు తండ్రి.

ఆమె మాట్లాడలేదు. ఏడుస్తూనే వుంది. సోఫాలో ఆమె పక్కనే కూర్చున్న తండ్రికూడా ఏడుస్తున్నాడు.

అదే సమయంలో పటేల్ హుషారుగా గదిలోకి ప్రవేశించాడు. వాళ్ళవైపు నవ్వుతూ చూస్తున్నాడు.

"ఏమిటిలా ఏడుస్తున్నారు?" అడిగాడు.

"నా కూతురి జీవితాన్ని నాశనం చేశావు. మోడీ గ్రూప్‌కి అధిపతిగా నటిస్తూ యిక్కడికొచ్చి మమ్మల్ని మోసం చేశావు. రాస్కెల్, నిన్ను పోలీసులకు అప్పగిస్తాను" అని కామరాజు సోఫాలోంచి లేచాడు.

రాధ తండ్రిని ఆపింది.

"వద్దు నాన్నా! ఆయన యెవరైనా ఫరవాలేదు, నేనాయన్ని పెళ్ళాడ్తాను" అంది రాధ.

పటేల్ కోపంగా కామరాజువైపు చూశాడు.

"కామరాజుగారూ, నా మోసాన్ని గురించి మాట్లాడే ముందు మీరు చేసిన మోసాలను గురించి ఆలోచించండి!" అరిచాడు పటేల్.

"నేనెవర్నీ మోసం చెయ్యలేదు!"

పటేల్ తన గడ్డాన్ని తీసేశాడు. డార్క్ గ్లాసెస్ తీసి చేత్తో పట్టుకున్నాడు. నుదురుమీదున్న నల్లటి మచ్చను రుమాల్తో తుడిచేశాడు.

అతడివైపు కామరాజు ఆశ్చర్యంగా చూశాడు.

"మిస్టర్ పటేల్!"

"నేనే, పటేల్ని" అని అతడివైపు కోపంగా చూశాడు.

కామరాజు భయంగా అతడివైపు చూశాడు.

"నన్ను ఎక్కువగా తాగించి, నా భార్య గదిలోకి వెళ్ళి ఆమెను అనుభవించావు. తన పక్కనున్న మనిషి భర్తని ఆమె పొరబడింది. తర్వాత నిజాన్ని ఆమె గ్రహించింది. ఆమెను నేను ప్రేమించి పెళ్ళాడాను. నాతో చెప్పకుండా ఆమె ఎక్కడికో వెళ్ళిపోయింది. నేను దుఃఖంలో మునిగి ఈదుతున్నాను. నా భార్య లేక నేను ఏడుస్తున్నట్టే నీ ముద్దుల కూతుర్కి సంభవించిన గతికి నువ్వు ఏడువ్! జీవితాంతం అలా యేడుస్తూనే వుండు!" అరిచాడు పటేల్.

"పటేల్, కామం నన్ను గుడ్డివాడిని చేసింది. అనేక మంది భార్యలను ఆ విధంగా నేను మోసం చేశాను. ఇటువంటి పనులు యిటుపైన నేను చెయ్యను. నా కూతుర్ని వెళ్ళనివ్వు. ఆమె గర్భవతి!"

పిచ్చివాడిలా నవ్వాడు పటేల్.

"అదే నాకు కావలిసింది! ఏడవండి! గుండెలు బాదుకు

చావండి!" అని అతడు బయటకు పరుగెత్తాడు.

కిందనున్న టాక్సీలో కూర్చున్నాడు. టాక్సీ బయటకు దూసుకుపోయింది.

# 11

సూర్యుడు అస్తమించాడు. తోటలో వున్న పూల మొక్కల పక్కన కూర్చుని పటేల్ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. తన పగ తీరింది! కాని సుజాత తనకు చిక్క లేదు! ఆమె ఈ లోకంలో వుందా, లేదా?

తోటవాడు విన్సెంట్ అటువైపు నడుస్తూ పటేల్ వంక చూశాడు.

"ఏమయిందయ్యా?" ప్రశ్నించాడు.

"ఏమీ లేదు, వెళ్ళు" అన్నాడు పటేల్.

విన్సెంట్ వెళ్ళిపోలేదు అతడి దగ్గరకొచ్చాడు.

"లోపల కెళ్ళండయ్యా!" అన్నాడతను.

"ఇక్కడే బాగుంది."

"మీరు ఎందుకిలా వున్నారు?"

"నా భార్య సుజాత నన్ను వదిలి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఆమె లేకుండా నేను జీవించలేను. ఆమె లేని ఈ లోకంలో నాకు వుండాలనిపించడం లేదు!" అన్నాడు పటేల్.

విన్సెంట్ కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"నాలా నువ్వూ ఏడుస్తున్నావు" అన్నాడు పటేల్.

పటేల్ చూపు విన్సెంట్ మీద కేంద్రీకృతమైంది. ఏదో చూసి అతడు ఉలిక్కిపడ్డాడు.

విన్సెంట్ చెయ్యి పట్టుకుని దగ్గరగా లాగాడు. అతడి షర్టు అమాంతంగా పైకెత్తాడు. షర్టు మాసి వుంది.

"సుజాతా, తోటమాలిగా యిక్కడ మారువేషంలో వుంటున్నావా?" అర్చాడు పటేల్ ఏడుస్తూ.

ఆమె ఏడుస్తూ అతడివైపు చూసింది.

"మీకు ఉత్తరం రాసి వెళ్ళిపోయాను. కాని మిమ్మల్ని వదల బుద్ధికాలేదు. నాగ్‌పూర్ వచ్చి మన తోటవాడిని కల్సుకున్నాను. తను పని మాని ఈ పనిని యిప్పించమన్నాను. అప్పటినుంచీ మిమ్మల్ని ఓ కంటితో గమనిస్తూ యిక్కడే వుంటున్నాను" అందామె.

అతడు లేచాడు. విన్‌సెంట్‌లా నటించిన సుజాతను యింట్లోకి తీసుకువెళ్ళాడు.

"స్నానంచేసి బట్టలు మార్చుకురా! నీతో యెంతో మాట్లాడాలి" అన్నాడతను.

ఆమె బాత్‌రూమ్‌లోకి దూరింది.

మర్నాడు పొద్దుటే పటేల్, సుజాత టిఫిన్ తింటున్నారు. దినపత్రిక మొదటి పేజీలో ముద్రించిన వార్తను చూసి పటేల్ తృప్తిపడ్డాడు.

"సుజాతా, ఏం జరిగిందో చూడు!"

"ఏమైంది?" అడిగిందామె.

"రాధ నిన్న రాత్రి కోటీశ్వరుడైన కామరాజుని షూట్ చేసి చంపేసింది. తర్వాత ఆమె పోలీసులకు లొంగిపోయింది. తన తండ్రి చేసిన దుష్టచర్యలు మూలంగా తన జీవితం నాశనమయిందని ఆమె పోలీసులతో చెప్పింది" అన్నాడు పటేల్.

"దుష్టులు అలాగే చస్తారు" అంది సుజాత.

—:అయిపోయింది:—

# వెన్నెల్లో విహారం

బి. రాజేశ్వరి

"ఫిషింగ్ బోట్లో యెప్పుడైనా సముద్రం మీదికి వెళ్లావా?" అడిగాడు నారాయణ రవిని.

"లేదు, నువ్వెళ్ళావా?" అడిగాడు రవి.

"ఓ, చాలాసార్లు. వెన్నెల్లో సముద్ర విహారం మహా అద్భుతంగా వుంటుంది!"

"నాకూ ఆ అనుభవం చూడాలని తహతహగా వున్నది" అన్నాడు రవి ఉత్సాహంగా.

"ఓ అదెంత పని!? ఎప్పుడు వెళ్దాం?"

"బోట్ వుండొద్దా?"

"మాకు మూడు బోట్స్ వున్నాయి. రోజూ ఉదయం—అంటే తెల్లవారుఝామున మూడూ చేపల వేటకు సముద్రంలోకి వెళ్తాయి" చెప్పాడు నారాయణ.

"మరి మనకి అవకాశం దొరకటం కష్టంకదా!"

"కష్టమేం కాదు. బోట్లు వేటకు బయల్దేరే సమయానికి మనం సముద్రంమీదికి విహారయాత్ర ముగించుకుని

వచ్చేస్తాం!"

"మరి, బోట్ డ్రైవర్ ....?"

"నాకు డ్రయివింగ్ చేతకను. మా బోటే కాబట్టి కళాసీలుగాని, తక్కిన బోట్ ఓనర్సుగాని, అభ్యంతరం చెప్పరు. ఓగంటలో తిరిగివచ్చేస్తాం. బోట్‌ని యధాస్థానంలో వుంచేస్తాం!"

"మీ నాన్నగారికి విషయం తెలిస్తే గొడవచేస్తారేమో? నీకు 'మాటొస్తుం'దేమో ...."

"చూడు మైడియర్ డౌటింగ్ థామస్! ...ఇలా ప్రతి దానికీ భయపడితే మనం జీవితంలో ఏదీ సాధించలేం! నేను చిన్నప్పట్నుంచీ బోట్స్‌లో ఆడుతూ పెరిగినవాడ్ని. నాకిలాంటి చిన్న చిన్న ప్రయోగాలు చేయటం కొట్టిన పిండి....నీకేం భయంలేదు, నేనున్నానుగా!" అన్నాడు నారాయణ పెద్ద ఆరిందాలా.

రవి, నారాయణవంక ప్రశంసాపూర్వకంగా చూశాడు.

"సరే, నేను సిద్ధం!" అన్నాడు ధైర్యం తెచ్చుకుని.

"సాధారణంగా బోట్సు తెల్లవారుఝామున అయిదు గంటలలోపే బయల్దేరి పోతుంటాయి వేటకు. మనం మూడున్నరకల్లా బయల్దేరి అయిదులోపల బోట్‌ని తెచ్చి యధాస్థానంలో పెట్టెయ్యాలి!"

"అంత పెందరాళే లేచి వస్తే మా యింట్లో అనుమానమొస్తుంది ఓ పని చేద్దాం. హాస్టల్లో మన ఫ్రెండు శివా దగ్గరకు కంబైన్డ్ స్టడీకి వెళ్తున్నానని చెప్పి యీ రాత్రి హాస్టల్లో పడుకుంటాను. మూడు గంటలకు అలారం పెట్టమంటాను శివాని. మరి నీ సంగతి ?"

"చక్కటి అయిడియా యిచ్చావుకదా! నేనూ హాస్టల్‌కే వచ్చేస్తాను. ఇద్దరం హాస్టల్‌నించే సరాసరి

ఏటి మొగ వచ్చేద్దాం!"

"ఓ. కే!"

## 2

"నేనూ వస్తాను, తీసుకెళ్ళవా నారాయణా?" అన్నాడు శివా, వాళ్ళిద్దరు బయల్దేరుంటే.

నారాయణ వెంటనే, "దానికేం భాగ్యం? రా!" అన్నాడు.

శివా తనుకూడా తయారయ్యాడు. అతని పూర్తి పేరు శివశంకర్రావు. స్నేహితులు షార్టుకట్ చేసి శివా అని పిలుస్తారు.

ముగ్గురు ఏటి మొగ చేరేసరికి మూడున్నర అయింది సరిగ్గా.

నారాయణ అక్కడి బోటు డ్రయివర్స్‌కి, బోటు యజమానులకీ తెలుసు. అక్కడ దాదాపు రెండువందలకు పైగా వున్నాయి బోట్లు. అవి చూసి రవి, శివా ఆశ్చర్యంతో నోరు తెరిచారు. ప్రతిరోజు యిన్ని బోట్లు సముద్రం మీదికి వేటకి వెళ్తున్నాయంటే వాళ్ళకు విచిత్రంగా వుంది!

శివా అడిగేశాడు. "ఇన్ని వందల బోట్లు ప్రతిరోజూ పట్టి తెచ్చే చేపలన్నీ ఏమయిపోతున్నాయి?" అని.

నారాయణ చిన్నగానవ్వి, "మన కాకినాడ సముద్రం టైగర్ ప్రాన్స్‌కి ప్రసిద్ధి ప్రతిరోజు ఈ రొయ్యలు దేశంలోని వివిధ ప్రాంతాలకేకాక, ఫారిన్ కంట్రీస్‌కి కూడా ఎగుమతి అవుతుంటాయి. కిలో ఎనభై రూపాయ ల్నుంచి నూటయిరవై వరకు ధర పలుకుంది. ఆ మాట కొస్తే మనం యిక్కడ తినేది బాగా నాసిరకం రొయ్యలు, చిన్న చేపలూను. క్వాలిటీ ఫిష్ ఎగుమతి

అయిపోతుంటాయి" అన్నాడు.

బోట్ల దగ్గర కొందరు వ్యక్తులు పడుకుని నిద్రపోతున్నారు.

నారాయణ ఆ బోట్లమధ్య తమ బోట్‌ను గుర్తించి, ఓ దానిలో ఎక్కి స్నేహితులిద్దర్ని ఆహ్వానించాడు.

పక్క బోట్‌లో పడుకున్న వ్యక్తి తలపైకెత్తి వాళ్ళవంక చూసి "ఎవరు?" అంటూ గట్టిగా పిలిచాడు.

నారాయణ "నేనే నరసిమ్మా" అంటూ బదులిచ్చాడు.

అతను నారాయణని గుర్తించి "మీరా చినబాబూ! డయివోరింకా రాలేదు బాబూ!" అన్నాడు.

నారాయణ తగ్గుస్వరంలో "ముత్తయ్య వస్తే చెప్పు నర్సిమ్మా. ఓ గంటలో తిరిగొచ్చేస్తాం. ఓ పదినిమిషాలు ఆలస్యమయినా కంగారుపడొద్దని చెప్పు. వేట టైంకి అందచేస్తాను" అన్నాడు.

"అట్టాగే బాబూ! జాగర్తగా ఎల్లిరండి!" అన్నాడు నరసిమ్మ అనబడే ఆ వ్యక్తి.

నారాయణ స్నేహితులకి చెప్పాడు, "ఆ నర్సిమ్మ కూడా మా బోట్ డ్రయివరే. ముత్తయ్య యీ బోట్ డ్రయివర్. ఇంకా టైం కాలేదుగా, అందుకే రాలేదు. నర్సిమ్మ యీ రోజు బోటులకి కాపలా! రోజు కొకరు చొప్పున మా మూడు బోట్ల డ్రయివర్లు కాపలావుంటారు. ఈ రోజు డ్యూటీ నర్సిమ్మది."

ఇంజన్ కేబిన్ రూంలో డ్రయివర్ సీట్లో కూచున్నాడు నారాయణ.

"ఈ అద్దాల్లోంచి మనకి సముద్రం కనిపిస్తుంది. రండి మీరు కూడా యీ పక్కన కూచోండి. ఇంజన్ స్టార్ట

చేస్తున్నాను" అన్నాడు.

ఇంతలో బయట్నుంచి యెవరో అరిచారు: "ఏరోయి మ తయ్యా, ఏటకి ఏగిరం ఎల్లిపోతున్నా వేందిరా? పెనాలిటీ ఎయ్యాలా?" అని.

నర్సిమ్మ చటుక్కున లేచి ఆ వ్యక్తిని సమాధానపరుస్తున్నాడు.

"ఇక్కడ అంతా ఓ క్రమపద్ధతిలో వుంటుంది. ఒకే సారి అన్ని బోట్లు సముద్రంమీదికి వదలటానికి వీలు కాదు. పైగా లైంకి ముందు వెళ్తే, పనిష్మెంటు వుంటుంది. అసోషియేషన్‌కి పెనాల్టీ కట్టాలి! అందుకే ఆ మనిషి కేకలు వేస్తున్నాడు. మా నర్సిమ్మ సర్ది చెపుతాడు లే" అన్నాడు నారాయణ.

ఇంజన్ స్టార్టయింది. నారాయణ చురుగ్గా మీటలు నొక్కి స్టీరింగ్ కంట్రోల్ చేసుకుంటూ బోట్‌ని రివ్వున పోనిస్తున్నాడు. పదినిమిషాలు గడిచేసరికి బోట్ ఉప్పు టేరునించి సముద్రతీర ప్రాంతానికి చేరుకుంది.

నారాయణ చెపుతున్నాడు: "ఇక్కడి నుంచి బోట్లు రక రకాల డైరెక్షన్స్‌లో వేటకు సంసిద్ధమవుతాయి' రొయ్యలు అన్నప్పుడల్లా పడవు. అది కూడా అదృష్టం మీద ఆధారపడుంటుంది!"

రవి, శివా ఆసక్తిగా చూస్తున్నారు.

"వల విసిరి చూద్దామా?" అన్నాడు శివా.

నారాయణ వెంటనే "వద్దొద్దు. మనం వచ్చింది సరదాగా విహారానికి. వల విసిరిన విషయం యూనియన్ వాళ్ళెవరికి తెలిసినా చాలా పెద్ద మొత్తంలో పెనాల్టీ వేస్తారు. మాటొస్తుంది." అన్నాడు.

రవి సముద్రంమీదికి నిదానంగా చూసి, "దూరంగా

యేదో షిప్‌లా వుందే?...." అన్నాడు.

"అవును....అది పోర్టు! బొంబాయినించి, మద్రాసు నించి షిప్పులు సరుకు వేసుకుని వస్తాయి. మళ్ళీ యిక్కడ్నించి సరుకు నింపుకుని వెళుతుంటాయి. ఫారిన్ కంట్రీస్ నించి కూడా షిప్స్ వస్తూంటాయి. అప్పుడు మంచి మంచి స్మగుల్డు గూడ్సు కూడా దొరుకుతాయి. ఇక్కడ చాలా మంది ఆ గూడ్స్‌తో వ్యాపారం చేసి లక్షాధికారులయిన వాళ్ళున్నారు."

బోటు మరికొంత దూరం ప్రయాణించింది. సముద్రం మీద వెన్నెల తెల్లగా పుచ్చపువ్వులా వుంది.

బోట్ వేగంలో సడన్‌గా మార్పొచ్చింది. ఇంజన్‌లో ఏదో చప్పుడౌతోంది.

"ఏమయింది?" రవి, శివా ఒకేసారడిగారు.

అప్పుడు చూసుకున్నాడు నారాయణ ఇంజిన్ పక్కగా వున్న ఆయిల్ టాంకుని.

"అరె, ఆయిల్ అయిపోయిందే!" అన్నాడు.

"అదేమిటి, మనం వచ్చింది పది కిలోమీటర్లయినా లేదు—అప్పుడే టాంక్ ఖాళీ అయిపోయిందా!"

"క్యేన్స్‌తో ఆయిలు పెడతారు కాబిన్లో. ఆ బల్లకింద చూడండి!" అన్నాడు నారాయణ.

శివా, రవి అతను చెప్పిన బల్లకింద చూశారు. "ఇక్కడ అలాంటివేమీ లేవు!" అన్నారు.

నారాయణ విసుపోయి చూశాడు. బోటును వెంటనే వెనుకకు మళ్ళించాడు. ఇంజిన్ బర బర మని చప్పుడు చేస్తోంది. రిజర్వులోని ఆయిల్ కూడా ఖర్చాయిపోయింది.

"రవీ, యిలా వచ్చి స్టీరింగ్ కంట్రోల్ చెయ్యి.

నేను వెతుకుతాను" అన్నాడు నారాయణ.

రవి స్టీరింగ్ పట్టుకున్నాడు. శివా సాయం వచ్చాడతనికి.

నారాయణ చకచక కేబిన్‌లోను, బయట బోట్ బాడీలోను ఆయిల్ కేన్స్ కోసం వెతికాడు. ఎక్కడా లేవు! అతని గుండెల్లో రాయి పడింది.

ఇంజిన్‌లో బరబర చప్పుళ్ళు ఎక్కువయ్యాయి. ఇప్పుడు తిరుగు ప్రయాణ మెలాగా?

"ఏం, కనిపించాయా?" అడిగాడు రవి కేబిన్‌లో నుంచి.

నారాయణ కేబిన్‌లోకి వచ్చాడు. అతని ముఖంలో విషాదచ్ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. "సారీ, కేన్‌లు అయిల్‌తో నింపి స్పేర్ పెడతారు. ఈ రోజా వేటకు వెళ్ళేముందు పెడతారన్న మాట! నేను ఆ సంగతి మరిచేపోయాను" అన్నాడు.

"మరి మనం ఎలా తిరిగి వెళ్ళగలము?" శివా అడుగుతుండగానే బోట్ అటు ఇటు వూగింది. ఇంజన్ ఒక్కసారిగా ఆగిపోయింది. కనుమాపు మేరలో సముద్రం తప్ప ఏమీ కనిపించటము లేదు.

నారాయణ హడావిడిగా బోట్ మధ్య కొచ్చి, "లంగరు వేద్దాం—సాధారణంగా ఒడ్డున బోట్ కదలి పోకుండా వేస్తాం. ఈ సముద్ర మధ్యంలో యీ లోతు మీద అది అందుతుందో, లేదో!" అన్నాడు లంగరు కట్టిన గొలుసును నీళ్ళలోకి వదులుతూ.

ఎక్కడా నేల ఆనదలేదు. బోట్ అటు ఇటు అలల తాకిడికి కదులుతూ పోతోంది.

నారాయణ దిక్కు మొహం వేసుకుని, "ఆ ప్రయ

త్నమూ విఫలమయింది. లంగరందటం లేదు" అన్నాడు.

రవి, శివా మొహాల్లో ఆందోళన, భయం చోటు చేసుకున్నాయి.

"మరిప్పుడెలా?" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

"మరి కాసేపటికి ఫిషింగ్ బోట్సు వస్తాయి. వాళ్ళ దగ్గర్నుంచి ఆయిల్ అడిగి తీసుకోవాలి!"

"అంతిదాకా మనం బోట్ లో సురక్షితంగా వుండాలి కదా!" అన్నాడు రవి.

నారాయణ మాట్లాడలేదు. అతని ముఖం గంభీర ముద్ర దాల్చింది. పొరపాటంతా తనదే! ఆయిల్ నిండిన కేన్ లు లోపలున్నాయో, లేదో చూసుకోకుండా సముద్రం మీదికి బోట్ తీసుకొచ్చేశాడు.

బోట్ సముద్ర మధ్యంలోకి వెళ్ళిపోతోంది. ఇంత దూరం ఫిషింగ్ బోట్స్ రావు. ఫిషింగ్ చేసే స్పాట్స్ దాటిపోయి అప్పటికే బాగా లోపలి కొచ్చేసింది తమ బోటు. ఆ విషయం వాళ్ళిద్దరికీ చెపితే ముందే భయపడి పోతారు.

నారాయణ ఆలోచిస్తున్నాడు. ఇంకా సేపట్లో తెల్లారి పోతుంది. తెల్లారిన తర్వాతనైనా బోట్లువాళ్ళు తమని చూడటం జరిగితే సహాయం చేస్తారు. కాని, వాళ్ళు తమ బోట్ చూసేలోపల తామింకా సముద్రం మధ్యకి వెళ్ళి పోతారు.

ముగ్గురికీ ముచ్చెమటలు పోస్తున్నాయి. ప్రాణ భయంతో యెవరికీ నోట మాట రావటం లేదు. అలల మీద తేల్తూ యిష్టమొచ్చిన దిశలో బోట్ పోతోంది.

"నారాయణా, అదేమిటి? అలలు లేస్తున్నాయి. చూశావా?" అన్నాడు రవి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి

చేస్తూ.

శివా కొట్టి పడేస్తూ, "నీకు మతిపోతోంది. సముద్ర మధ్యంలో అంతెత్తు అలలు లేస్తాయా? మారానికి అలా భ్రాంతి కలిగిస్తున్నాయి, అంతే!" అన్నాడు.

నారాయణ యేమీ మాట్లాడలేదు. అతని మనసు మనసులో లేదు. ఈ సముద్రంమీది నుంచి ఎలా తప్పించుకోవాలో అర్థం కావటంలేదు.

రవి అంతలోనే గుర్తు తెచ్చుకుని "ఇవాళ పౌర్ణమి" అన్నాడు.

శివా, నారాయణ యధాలాపంగా చూశారు. "సముద్రానికి పౌర్ణమికి ఆటుపోట్లు వస్తాయికదూ! అందుకే ననుకుంటూ, అలా ఉవ్వెత్తున కెరటాలు....?" అన్నాడు రవి.

రాను రాను అలల తాకిడి బాగా హెచ్చయ్యింది. బోటు బాగా కదిలిపోతోంది. ఎగిరెగిరి పడుతోంది. దానికి తగట్టు సన్నగా వర్షపు తుంపర! దట్టంగా మబ్బులు పట్టేశాయి.

నారాయణ బోట్ ఎగిరెగిరి పడకుండా, ఎటుపడితే అటు పోకుండా స్టీరింగ్ పట్టుకొని కంట్రోల్ చెయ్యాలనుకొన్నాడు. కాని అది అసాధ్యమే అయింది! ఇంకా స్థిరంగా పట్టుకున్నాడు.

"ఫట్" మనే శబ్దంతో స్టీరింగ్ వూడి చేతుల్లోకి వచ్చేసింది—ఆ విసురుకు అమాంతం వెనక్కి వెల్లకిలా పడిపోయాడు నారాయణ. మిత్రులిద్దరు ఈ హఠాత్పరిణామానికి మొదట కంగారుపడి తర్వాత నారాయణను లేవదీశారు.

బోట్ యిష్టమొచ్చినట్టు పోతోంది. ఎగిరెగిరి పడు

తోంది. కిందా మీదా పడుతున్నారు ముగ్గురూ.

నారాయణ ప్రమాదాన్ని గుర్తించాడు. / "బోట్ తిరగబడిపోయే ప్రమాదం కనిపిస్తోంది. తప్పించుకు పోవాలి! సముద్రంలో ఉరకటం తప్ప గత్యంతరం లేదు!" అన్నాడు.

శివా, రవి నిర్ఘాంతపోయారు. "సముద్రంలోకి ఉరకటమా! బతికి బట్టకడతామా?" అన్నాడు కోపంగా రవి.

నారాయణ చాలా నిదానంగా, "బతకటం కోసమే చెప్తున్నాను. బోట్ యే క్షణంలోనయినా తిరగబడి పోతుంది...." అని అంటుండగానే బోట్ ఓ పక్కకి ఒరిగిపోయి, మళ్ళీ లేచి సమంగా వచ్చింది. ఓసారి కుడి పక్కకి మరోసారి ఎడమ పక్కకి ఒరిగిపోతోంది. తీవ్రంగా ఎగిరెగిరి పడుతోంది.

శివా, రవి కూడా కాసేపట్లో బోట్ మునిగిపోవ టమో, అమాంతంగా తిరగబడిపోవటమో ఖాయమని నిర్ణయించుకున్నారు—

నారాయణ బోట్‌లో వున్న గాలి నిండిన రబ్బరు ట్యూబులు తెచ్చాడు.

"వీటి సాయంతో మనం సముద్రంలో మునిగిపోకుండా రక్షించుకోగలుగుతాం!" అన్నాడు.

రవి నిదానంగా వాటికేసి చూసి, "ఓ పక్క అలలు విపరీతంగా లేస్తున్నాయి. సముద్రం ఆటుపోటులో వుంది. వాతావరణం చూడబోతే మబ్బుగా వుంది. బోట్‌లో కనీసం కొంత రక్షణవుంది. మనం సముద్రంలో పడి ఎక్కడని యీదగలం! బోట్‌లోనే ..." అనబో తుండగా బోట్ విపరీతంగా ఊగిసలాడింది. ఆ పక్కకు

ఈ పక్కకు తీవ్రంగా కంపించి ఒరిగిపోయింది.

నారాయణ ట్యూబ్‌లను చెరొకటి యిచ్చి, "లాభం లేదు. వీటి సాయంతో సముద్రంమీద తేల్తూ పోవలసిందే! ఉరకండి!" అన్నాడు తను సముద్రంలోకి దూకుతూ.

సరిగ్గా అదే సమయంలో బోట్ యెడమ పక్కకు ఒరిగిపోయింది. తిరగబడిపోబోయింది.

రవి, శివా కూడా వెంటనే ట్యూబ్‌లను పొట్ట కిందుగా అదుముకొని నీళ్ళలోకి దూకేశారు.

ఆ మరుక్షణమే బోటు తిరగబడిపోయింది. నీళ్ళు లోపలికి వెళ్ళిపోయి ఆ బరువుకు కాసేపట్లోనే మునిగిపోయింది.

ఒక్క పది అడుగులు మాత్రం కలిసి యీదగలిగారు. కాని అలల తీవ్రత, ఉవ్వెత్తున లేచిపడుతున్న కెరటాల ఉధృతం వాళ్ళను చెదరగొట్టేసింది. ముగ్గురు చూస్తుండగానే ఒకర్నించి మరొకరు చెప్పుకోటానికి కూడా వీల్లేనంత వేగంగా విడిపోయి కొట్టుకుపోతున్నారు. నారాయణకి శివా కనిపించి అంతలోనే కనుమరుగై పోయాడు. అలాగే శివాకు రవి కళ్ళెదుటే చూస్తూండగా మాయమై పోయాడు.

ఓ పక్క హోరున శబ్దం చేస్తున్న సముద్రం యే క్షణంలోనయినా తమని కబళించి వేయగలదనిపిస్తోంది. మరోపక్క యే సముద్రచరాలో తమని చీల్చి చెండాడుతాయేమోనని, గుబులు పుడుతోంది. ఇక మృత్యువుకి యెంతో దూరంలో లేమని ముగ్గురూ ప్రాణాలపై ఆశ వదులుకున్నారు.

అప్పటికి పూర్తిగా తెల్లవారిపోయింది. సూర్యోద

యాన్ని ముగ్గురూ చూశారు. సూర్యుడు సముద్రగర్భం లోంచే పుడుతున్న భ్రాంతి ననుభవించారు. బాగా సముద్రం మధ్యకు వచ్చేశామని గ్రహించారు. ఎక్కడా ఫిషింగ్ బోట్లు కనుచూపు మేరలో కూడా కనిపించటం లేదు. అంటే తీరాన్నుంచి చాలా లోపలకు వచ్చేశామని గ్రహించారు వాళ్ళు.

# 3

దాదాపు రెండు గంటలసేపు అలా సాగింది ప్రయాణం!

రవి ట్యూబ్ మీద పడుకునే రిస్టువాచ్ చూసు కున్నాడు. ఉదయం పది గంటలు దాటింది. ఏదైనా ఫిషింగ్ బోటు కనిపిస్తుందేమోనని వెయ్యి కళ్ళతో చూస్తున్నాడు. కాని అంతదాకా ఏ ఒక్కటీ యెదురు కాలేదు. దూరంగానైనా కనిపిస్తుందేమోనని చూశాడు. ఫలితం కనిపించలేదు! తన జీవితం అర్థాంతరంగా సము ద్రానికి ఆహుతి కాబోతున్నందుకు అతనికి విచారంగా వుంది.

సముద్రంలో అలల అలజడి కొంత తగ్గింది. సముద్ర మధ్యంలో తీరంలో వున్నంత ఉధృతం లేదు. ప్రశాంతం గానే వున్నది.

రవి చెవులు రిక్కించి విన్నాడు—ఎక్కడి నుంచో బోటు యింజను శబ్దం వీనులవిందుగా వినిపిస్తోంది. భగవంతుడు కరుణామయుడు తన మొర నాలకించినట్టు న్నాడు!

కొద్ది నిమిషాల తర్వాత ఫిషింగ్ బోటు లాంటిదే అటుగా వచ్చింది. ఇంజను శబ్దం చాలా మెత్తగా వినిపి స్తోంది. తా మెక్కి వచ్చిన బోటు యింజను చాలా

పెద్దగా చప్పుడు చేసింది.

రవి పడుకునివుండే చేతిని గాల్లో వూపాడు. నోటితో పెద్దగా శబ్దం చేశాడు.

నిజానికి ఆ బోటులోనివాళ్ళు అతన్ని గుర్తుపట్టి వుండాల్సిందే! కాని బోటు అతనివైపు రాలేదు. వేగంగా అతి వేగంగా దూసుకుపోయింది.

రవి హతాశుడైపోయాడు. మళ్ళీ మళ్ళీ కేకలు పెట్టాడు. ఫలితం లేకపోయింది.

చేతికందినట్టే అంది జారిపోయిన అవకాశం అతడ్ని పిచ్చివాడ్ని చేసింది—అప్పటికే శరీరం మొద్దయిపోయి చలితో కొంకర్లు తిరిగిపోతోంది. ఏ క్షణంలోనయినా శోష వచ్చి పడిపోతానేమో అన్నట్టుగా వుంది పరిస్థితి! ఏ మాత్రం బాలన్స్ తప్పినా బుడుంగున మునిగిపోవటం ఖాయం. ఉండి వుండి యేవో చేపలు తన కాళ్ళను, చేతులను గిలిగింతలు పెడ్తూన్నాయి. తిమింగిలం, సొరవంటి పెద్ద పెద్ద చేపలు తారసపడలేదు గాని, అదే జరిగితే తన ప్రాణంమీద ఆశ వదులుకోవల్సిందే!

మరో గంట తర్వాత రవి సముద్రం మీదికి చూసి ఆనందంతో కేరింతలు కొట్టాడు. దూరంగా పెద్ద షిప్పు లాండ్ అయివున్నది. తన ట్యూబు అటే కొట్టుకు పోతున్నది. తేలిగ్గా ఊపిరి పీల్చాడు.

## 4

నారాయణ చెవులు రిక్కించాడు. మెత్తటి ఇంజన్ శబ్దం—అనుమానంలేదు—అది బోటు యింజను శబ్దమే! చాలా మృదువుగా వినిపిస్తోంది. బహుశా ఫిషింగ్ బోటుది కాదు. అవి అంత మెత్తగా శబ్దం చేయవు. ఏదో ప్రయి

వేట్ ఓనర్ దయివుండాలి! ఎవరిదైనా ఆపుచేసి తనని ఎక్కించుకుంటాడు!

నారాయణలో కొత్త ఉత్సాహం వచ్చింది. కనీసం తను బోటులో ఎక్కగలిగితే రవిని, శివాని కూడా వెతికి రక్షించుకోవచ్చును. వాళ్ళు కూడా యీ పరిసరాల్లోనే ప్రయాణిస్తూ వుంటారు. బోటు వుంటే వాళ్ళను పట్టుకోవటం కష్టమేం కాదు.

అతనిలో కొత్త ఉత్సాహం వచ్చింది. బోటు శబ్దం రాను రాను పెద్దగా వినిపించాల్సింది పోయి, దూరమై పోతున్నపుడు వినిపించే శబ్దం అతి మెల్లగా వినిపిస్తోంది.

నారాయణ మెడ రిక్కించి చూశాడు. చాలా దూరంగా ఓ గద్ద ప్రమాణంలో బోటు కనిపించింది— వేగంగా నీళ్ళలో దూసుకుపోతున్నది. తీరంవైపు పరుగెడుతున్నట్టు కనిపిస్తోంది.

నారాయణకు సముద్రంమీద కూడా దిక్కులు కనిపెట్టడం తెలుసు. ఇదివరకు చాలాసార్లు సరంగులతో వచ్చినపుడు బాగా ఆకళింపు చేసుకుని వున్నాడు.

ఆ బోటు ఒడ్డువైపే సాగిపోతున్నది. దురదృష్టం తన నింకా వెంటాడుతూనే వున్నది. ఏదో ఆధారం దొరికిందని సంతోషించేసరికి, అవకాశం చేజారిపోయింది. పోనీ, తన స్నేహితులకైనా ఆ బోటు కనిపించివుండకపోతుందా వాళ్ళను ఆ బోటువాళ్ళు రక్షించి వున్నారేమో అనిపించింది ఓ క్షణం! అలా జరిగితే బావుండుననిపించింది.

అయితే అతని సునిశితమైన కళ్ళకు దూరంగా లాండ్ అయిన నౌక కనిపించింది. అది దగ్గరయ్యే కొద్దీ లంగరు వేయబడిన విషయం నిర్ధారణగా తెలుస్తోంది.

నారాయణ ఆనందంతో చిన్నగా కేక పెట్టాడు.

బహుశా ఆ నౌకలోనివాళ్ళే బోట్లో వెళుండవచ్చు. నౌక దగ్గరకు చేరుకోగలిగితే ప్రాణం దక్కినట్టే!

నారాయణకు కొత్త ఊపిరి వచ్చింది. అతని మనసు ఆనందంతో ఉరకలు వేస్తోంది.

ట్యూబు మాత్రం నిదానంగా ప్రయాణిస్తోంది.

# 5

రవి షిప్‌ను సమీపించాడు.

షిప్ డెక్ మీద ఎవరైనా వుంటారేమో, తనని చూసి ఏ తాడో, ఛెయినో విసుర్తారేమోనని పరిశీలనగా చూశాడు. కాని డెక్ మీద యెవరూ మనుషులున్న జాడ కనిపించలేదు.

సాధారణంగా షిప్ మీది నుంచి సరుకులు దింపడానికి ప్రయాణీకులు దిగటానికి తాటి నిచ్చెనలుగాని యినప నిచ్చెనలు గాని వాడతారని రవి వినివున్నాడు. అలాంటి వేమైనా వేలాడుతున్నాయేమోనని చూశాడు. అతనికి షిప్ పక్క భాగం ఒకటే కనిపించింది. రెండోవైపున యేమున్నా వున్నాయేమోగాని, యివతలిపక్క అలాంటి వేం కనపడలే దతనికి.

నిరాశపడిపోయాడు రవి. ట్యూబ్ షిప్‌ను దాటి వెళ్ళేలోపల తనేదయినా ఆధారం పట్టుకుని షిప్‌ను ఆసరా చేసుకోకపోతే మళ్ళీ యిలాంటి అవకాశం రాదు. ప్రాణం కాపాడుకోవటానికి యిదే సువర్ణావకాశం!

రవి, మెదడుకి పదును పెట్టాడు. ట్యూబు పక్కనుంచి వెళ్ళిపోయేలోపల షిప్ దగ్గరకు చేరుకోవటం చాలా ముఖ్యం! అతనికి యీత రాదు. కాని ఆ క్షణంలో ప్రాణంమీది తీపి అతనికి యీత నేర్పింది.

పాట్టకిందికి నీళ్ళు లాక్కున్నాడు చేతులతో. కాళ్ళు నీళ్ళలో తపతప కొట్టాడు. గమనవేగంలోను, దిశలోను అతనాశించిన ఫలితం కనిపించింది. అతను పడుకునివున్న ట్యూబు షిప్ కి అభిముఖంగా ప్రయాణించింది.

ట్యూబ్ షిప్‌ను సమీపించింది. పక్క నుంచి జారిపోయేలోపల షిప్ కి వేలాడుతున్న ఓ గొలుసును పట్టుకున్నాడు. సమయానికి ఆ గొలుసే లేకుండివుంటే తను షిప్‌ను పట్టుకోలేకపోయేవాడు!

గొలుసును పట్టుకొని లేవగానే అంతవరకు తనని రక్షించిన రబ్బరు ట్యూబు కాళ్ళనుంచి జారిపోయింది. గొలుసు మీద చేతుల్ని బిగించి పట్టుకున్నాడు రవి. ఏ మాత్రం గొలుసుమీద నుంచి పట్టుజారినా అమాంతం నీళ్ళలో పడి మునిగిపోవటం ఖాయం!

గొలుసు షిప్పు పక్కలకు బర బర మని రాసుకుని చప్పుడవుతోంది. డెక్ మీదికి యెవరో వ్యక్తి వచ్చాడు. "హూ యీజ్ దట్?" అంటూ అరిచాడు.

రవి తల రిక్కించి పైకి చూశాడు. ఎవరో విదేశీయుడు. చేతిలో రమ్ బాటిల్‌తో నిల్చుని కోపంగా రవి వంక చూస్తున్నాడు.

రవి వెంటనే, "నేను ఆపదలో వున్నాను. రక్షించండి...." అంటూ యెలుగెత్తి చెప్పాడు యింగ్లీషులో.

ఆ వ్యక్తి కొద్దిక్షణాలు రవివంక పరీక్షగా చూసి, "హూ ఆర్యూ?" అనడిగాడు.

రవి తను విద్యార్థిననీ, నౌకాయానం చేయబోయి సముద్రంలో పడిపోయాననీ రెండు వాక్యాల్లో చెప్పాడు.

ఆ వ్యక్తి రవివంక అనుమానంగా చూశాడు.

రవి పట్టు ఏ క్షణంలోనయినా జారిపోయేలా వుంది. తనని రక్షించకపోగా అలాంటి స్థితిలో తనని యక్ష ప్రశ్నలతో వేధిస్తున్న ఆ విదేశీయుడిమీద చాలా కోపం వచ్చిందతనికి. కాని నిస్సహాయుడు! ఆపదలో వున్నవాడు. కోపాన్ని ప్రదర్శించటానికి అనువైన స్థలము కాదు, సమయమూ కాదు!

ఈ లోపల మరో వ్యక్తి చేరా డక్కడికి. "క్యాహోనా?" అనడిగాడు ఉర్దూలో. హిందీలాగే వున్న భాష కావటంతో రవికి అర్థమయింది. తనను గురించి హిందీలో వచ్చీరాని మాటలతో చెప్పుకున్నాడు.

విదేశీయులిద్దరు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. తర్వాత ఓ నిశ్చయాని కొచ్చినట్టు తాటి నిచ్చెనను కిందికి వదిలారు.

రవి ఊపిరి పీల్చుకున్నాడు తేలిగ్గా. నిచ్చెన మెట్లెక్కి చకచక పైకి వచ్చాడు.

విదేశీయులిద్దరు అతనికి చేయి వూతమిచ్చి పైకి చేదుకున్నారు.

రవి డెక్ మీద కాసేపు నీరసంగా కూచుండిపోయాడు.

ఉర్దు మాట్లాడిన గడ్డపు వ్యక్తి మహమ్మదీయుడనీ, ఇంగ్లీషు మాట్లాడిన వ్యక్తి యూరోపియన్ అనీ గ్రహించాడు రవి.

యూరోపియన్ గడ్డం వ్యక్తికి సైగచేశాడు. అతను వెళ్ళి వేడి వేడి టీ తీసుకొచ్చి రవి కిచ్చాడు. రవి గబగబ టీ తాగి, ఉత్సాహం తెచ్చుకున్నాడు.

"గుడ్డలు బాగా తడిసినట్టున్నాయ్?...." అన్నాడు

గుడ్డం వ్యక్తి ఉర్దూలో.

రవి తలూపాడు. అతను లోపలికిపోయి ఓ లుంగీ బనియను తీసుకొచ్చాడు. రవి చక చక దుస్తులు మార్చాడు.

రవి తన గురించి రెండు మాటల్లో చెప్పి, "నా స్నేహితులిద్దరు నా పరిస్థితిలోనే నీటిలోపడి ప్రయాణం చేస్తున్నారు. వాళ్ళని రక్షించలేమా?" అనడిగాడు.

యురోపియన్ తన దగ్గరున్న బైనాక్యులర్స్‌తో చూశాడు. దూరంగా రబ్బరు ట్యూబుమీద తేలివస్తున్న ఓ ఆకారం కనిపించింది.

"ఓ వ్యక్తి రాడొస్తున్నాడు" అన్నాడతను రవితో.

"సరిగా చూశారా? ఇద్దరు రావాల్సి వుంది!" అన్నాడు రవి. అతనికి మనసులో సందేహం తలెత్తింది. నారాయణ, శివాల్లో యెవరైనా సముద్రంలో మునిగిపోలేదుకదా.... అనిపించింది.

బైనాక్యులర్స్ తీసుకుని చూశాడు. అస్పష్టంగా కనిపించటంవల్ల ముఖం గుర్తు తెలియలేదు. మరి కాస్త దగ్గర పడేసరికి గుర్తు తెలిసింది.

అతను శివా!

"అతను మా స్నేహితులిద్దర్లో ఒకడు. రెండోవాడు కనపడటంలేదు" అన్నాడు.

యురోపియన్ బైనాక్యులర్స్ తీసుకుని నలువైపులా చూశాడు. కాని రెండో వ్యక్తి జాడలేదు.

"సరే, ముందు యితని సంగతి చూద్దాం" అన్నాడు యురోపియన్.

ముగ్గురు డెక్ చివర నుంచున్నారు. శివాకి కనపడేలా ఎర్రజెండా పట్టుకున్నాడు రవి, మహమ్మదీయ వ్యక్తి

ఓ పాడవ్వుపాటి మోకుతాడు తీసుకుని సిద్ధంగా వున్నాడు.

శివా అంతక్రితమే షిప్‌ని గుర్తించి వుండటంవల్ల అతని దృష్టంతా షిప్ మీదనే వుంది. డెక్ మీద నుంచుని వున్న ముగ్గుర్లో రవిని వెంటనే గుర్తించి ఆనందంతో చిన్న కేక పెట్టాడు.

రవి అరచి చెప్పాడు. "ఈ తాడు విసురుతున్నాం, పట్టుకో! నీకేం భయంలేదు!"

శివా, గడ్డం వ్యక్తి విసిరిన తాడు కొస పట్టుకున్నాడు. పట్టు చిక్కింది.

ముగ్గురు తాడు చేరుకుంటుంటే, శివా సురక్షితంగా షిప్ దగ్గరికి చేరుకున్నాడు. మరో పదినిమిషాల్లో అతను డెక్ మీదికి లాగబడ్డాడు.

"నీకు నారాయణ కనిపించాడా?" అనడిగాడు రవి.

"కనిపించలేదే! ఏమయ్యాడో తెలీలేదా?" ఎదురు ప్రశ్నించాడు శివా.

రవి తల అడ్డంగా తిప్పాడు. బైనాక్యులర్స్‌తో మరోసారి నలువైపులా చూశాడు. ఎక్కడా నారాయణ జాడ కనపడలేదు.

రవికి పచారం వేసింది. నారాయణ యేమయి పోయాడు. తామిద్దరు ఎలాగో బతికి బయటపడగలిగారు. కాని, అది ఆనందం కలిగించటంలేదు.

అయితే, ఏ నారాయణ గురించయితే రవి బాధ పడుతున్నాడో, తీవ్రంగా ఎదురుచూస్తున్నాడో, ఆ నారాయణ అప్పటికే సురక్షితంగా షిప్ చేరుకున్నాడని వాళ్ళకు తెలీదు.

నారాయణ వెంటనే తాటినిచ్చేనద్వారా షిప్‌లోకి ఎక్కిపోలేదు. అతని కిలాంటి షిప్‌ల గురించి తెలుసు!

అది అరేబియన్ కంట్రీస్ నించి వచ్చిన షిప్ అని అతను దానిమీదున్న అక్షరాల్ని బట్టి గ్రహించాడు.

సాధారణంగా విదేశాలనుంచి వచ్చిన షిప్ లు లోడింగ్ అన్ లోడింగ్ చేసుకోవలసి వచ్చిన సందర్భాల్లో తీరానికి రెండు మూడు కిలోమీటర్ల దూరంలో దానికి సరిపడ లోతున్న ప్రాంతంలో లాండవుతాయి. అంటే లంగరు వేస్తారు. అక్కడి నుంచి నాటు పడవల ద్వారాను సరుకును దించటంగాని, నింపటంగాని జరుపుతారు.

కాని యీ షిప్ తీరానికి బాగా దూరంగా, అంటే పోర్టుకి దాదాపు పది కిలోమీటర్ల దూరంలో ఎందుకు లంగరు వేయవలసి వచ్చింది? అధికారులకి తెలియకూడదనే గా? అంటే ఆ షిప్ లో ఏదైనా అక్రమ వ్యాపారంగాని, లేదా నిషేధింపబడిన వస్తువుల వ్యాపారాలుగాని జరుగుతుండి వుండాలి.

స్మగుల్డు వస్తువుల వ్యాపారం భారీ ఎత్తున జరుగుతున్న విషయం అతనికి తెలుసు. తండ్రికూడా చాలా సార్లు యిలాంటి అక్రమ వ్యాపారాల గురించి చెప్తుండేవాడు! అరేబియన్ దేశాల ఓడల్లో అమ్మాయిలమీద కూడా వ్యాపారం జరుగుతోందని కూడా చెప్పాడు.

అందుకే.... నారాయణకి అనుమానం పుట్టింది. దాన్ని పూర్తిగా నివృత్తి చేసుకోకుండా తొందరపడి షిప్ లో ప్రవేశించకూడదు. పైగా రవి, శివా ఏమయిపోయారో తెలీదు. వారిద్దరు లేకపోయాక తాను మిగిలి ప్రయోజనం లేదు. వాళ్ళు లేకుండా తను యింటికి తిరిగిపోడు, పోలేడు!

నారాయణ కళ్ళలో కృతనిశ్చయం కదలాడింది.

షిప్ ను అంటిపెట్టుకుని, పైనుంచి జారుతున్న గొలుసు కొసను పట్టుకుని అలుపు తీర్చుకుంటూ అలాగే ఆలోచనలో పడిపోయాడు నారాయణ.

# 6

రవి, శివా తాము బయల్దేరినప్పట్నుంచి జరిగిన విషయాలు వివరంగా వాళ్ళిద్దరికీ చెప్పారు. తర్వాత రవి అడిగాడు.

"ఇంత పెద్ద నౌకలో మీరిద్దరేనా వున్నది?"

యూరోపియన్ నవ్వాడు.

"ఇంకా వున్నారు. వాళ్ళందరూ సిటీకి వెళ్ళారు" అన్నాడు గడ్డం వ్యక్తి.

"భోం చెయ్యటానికా?" అన్నాడు శివా అమాయకంగా. గడ్డం వ్యక్తి యూరోపియన్ కూడా నవ్వారీసారి.

"అవునవును!" అన్నారిద్దరూ.

"మేము షిప్ ఎప్పుడూ చూడలేదు. ఇదే మొదటిసారి! కాస్త లోపల తిప్పి చూపించరా!" అన్నాడు రవి.

యూరోపియన్, గడ్డం వ్యక్తి ముఖాలు చూసుకున్నారు.

"చూపిస్తాం! .... మీరిద్దరు ఇంటర్ చదువుతున్నామంటున్నారుకదా!?....మా దేశం తీసుకుపోతాం, వచ్చేస్తారా?" అన్నాడు గడ్డం వ్యక్తి.

"ఇంతకీ మీదే దేశం?" అడిగాడు శివా.

"అరేబియన్ గల్ఫ్ దేశాల గురించి విన్నారా?" అడిగాడు గడ్డం వ్యక్తి.

రవి తలూపి, "దుబాయ్, అబుదాబి...." అన్నాడు అర్థోక్తిలో ఆగి.

"ఎసెప్, అవే!" అన్నాడు యూరోపియన్.

రవి సందేహంగా, "మీరు చూడబోతే యూరో పియన్‌లా వున్నారు....?" అన్నాడు.

యూరోపియన్ నవ్వి, "ఎస్! గల్ఫ్ కంట్రీస్‌లో సెటిలైపోయాను" అన్నాడు.

"ప్రస్తుతం షిప్‌లో యెవరెవరొచ్చారు? ఏం వ్యాపారం మీదొచ్చారు?" అడిగాడు శివా.

యూరోపియన్, గడ్డం వ్యక్తి మరోసారి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అవేమీ గమనించని శివా, రవి నౌక చూడాలనే ఉత్సాహంలో ఉన్నారు. అప్పటికే వాళ్ళిద్దరికీ బ్రెడ్ స్లయిసెస్ జామ్ యిచ్చారు. కడుపునిండా తిన్నాక నిద్ర ముంచుకువస్తున్నట్లనిపించింది. కాని, షిప్ చూడాలన్న తీవ్రమైన కోరిక నిద్రని జయించింది.

"సరే, మాతో రండి!" అంటూ యూరోపియన్, గడ్డం వ్యక్తి లేచి దారితీశారు.

రవి, శివా ఆనందంగా వాళ్ళని అనుసరించారు. ముందు కేబిన్, ఇంజను, పెద్ద పెద్ద పైప్ లైన్స్‌తో వున్న కన్‌స్ట్రక్షన్ చూసి ఆశ్చర్యపోయారు రవి, శివా.

లోపల చక్కటి గదులు, వాటిల్లో మంచాలు, డైనింగ్ టేబిల్స్, కిచెన్ రూంస్ యివన్నీ చూస్తుంటే వాళ్ళకు అధునాతనమైన పెద్ద భవంతిలో వున్నట్టనిపించిందిగాని, అది సముద్రంమీద వున్న షిప్‌లో వున్నట్టే అనిపించలేదు. రోజులు, వారాల తరబడి సముద్రంలో ఎలా ప్రయాణాలు చేస్తారా అని యిదివరలో ఆశ్చర్యపోయేవారు. ఇంత సౌకర్యంగా ఉంటే నెలల తరబడి ప్రయాణం చేస్తే మాత్రం వచ్చిన నష్టమేమి టనిపించింది

వాళ్ళకు.

రవి గదుల్లో వున్న సీలు చేసిన చెక్క పెట్టెలు కొన్నిటిని చూశాడు. అవన్నీ పేకేజి పెట్టెలు. సన్న పాటి రేకుతో సీలు చేయబడి ఉన్నాయి. దాదాపు అలాంటి పెట్టెలు అరవైవరకు ఉన్నట్టు మనసులోనే లెక్క పెట్టుకున్నాడు.

కాని, అవి ఏమిటని అడగటం మర్యాదగా వుండ దేమోనని సంకోచించి అడగలేదు. కాని, శివా ఉండ బట్టలేక అడిగేశాడు.

యూరోపియన్ భారయుక్తంగా గడ్డం వ్యక్తి వంక చూశాడు. అతను కళ్ళతోనే ఏదో మాట్లాడుతున్నట్టు రవి గుర్తించాడు.

గడ్డం వ్యక్తి, "ఈ పెట్టెల్లో ఆపిల్సు, ద్రాక్ష వున్నాయి. మీ దేశాలతో వ్యాపారం చేసినపుడు మీకివి యిచ్చి, యిక్కడ్నుంచి బియ్యం, పంచదార, గోధుమలు తీసుకుపోతుంటాం. అక్కడ మా దేశంలో దొరకని వస్తువులు తీసుకువెళుతుంటాం. మావాళ్ళు సిటీలోకి అందుకే వెళ్ళారు. అవి బేరంచేసి వస్తారు. తర్వాత వీటిని అన్‌లోడ్ చేసి మా క్కావలసిన బియ్యం వగయిరా లోడ్ చేసుకుంటాం!"

రవికి, శివాకి అనుమాన నివృత్తి అయింది. గడ్డం వ్యక్తి యూరోపియన్ వాళ్ళిద్దరి మొహాలవంక పరీక్షగా చూస్తున్నారు. తమ సమాధానలతో వారు సంతృప్తి పడ్డారని గ్రహించారు.

"మీకింకో సంగతి తెలుసునా? మాకు మంచినీటికి తీవ్ర మైన కరువు. మీ దేశాలనుంచి, నీటిని తీసుకుపోతుంటాం. ముఖ్యంగా త్రాగే నీటిని!" అన్నాడు మహమ్మదీయుడు

ఓ పక్కగా పేర్చివున్న డ్రమ్ములను చూపించి, అవి సారాపీపాల్లాగా ఉన్నాయనుకున్నాడు రవి మనసులో.

ఇంతలో బయట మోటరు శబ్దం వినిపించింది. స్టీమర్ బోటు శబ్దం! అందరు బయటికొచ్చి సముద్రంమీదకి చూశారు.

శివా, రవి కూడా దాన్ని చూశారు.

రవి ఆ బోటును గుర్తించాడు. తను ఎలుగెత్తి పిలిచినా ఆపకుండా వెళ్ళిపోయిన బోటది!

అప్పటికి మధ్యాహ్నం రెండుగంటలు దాటింది.

బోటును షిప్ దగ్గరగా చేర్చి దానిలోనుంచి ఒకరొకరుగా తాటినిచ్చెనమీదుగా షిప్‌లోకి యెక్కారు. మొత్తం ఆరుగురు వ్యక్తులు!

వాళ్ళు శివాని, రవిని చూడగానే ఉలిక్కిపడ్డారు.

"ఎవరు వీళ్ళు?" అన్నారు కోపంగా ఉర్దూలో.

గడ్డం వ్యక్తి చేత్తో వారించి, "మిత్రులే! కుర్రాళ్ళు సముద్రంలో బోటుమీద విహారించబోయి సముద్రం పాలయ్యారు. సహాయం కోసం అరుస్తే మేమే రక్షించాం!" అన్నాడు.

వాళ్ళు శివా, రవిలవంక అనుమానంగా చూస్తూ మహమ్మదీయుడ్ని పక్కకు తీసుకువెళ్ళారు.

"వీళ్ళు మన షిప్ చూసేశారుకదా! వీళ్ళని వదిత్తే మన సంగతి బయట ప్రపంచానికి తెలిసిపోదా?" అన్నాడు.

"అసలు వీళ్ళని మనం వదుత్తేకదా! మన పని పూర్తి కాగానే, మనతోబాటు తీసుకుపోతాం. మన గుట్టుమట్లన్నీ చెప్పేస్తారని నాకూ తెలుసు. మనకీ యిలాంటి కుర్రాళ్ళు అవసరం వుందికదా! చదువుకుంటున్న

పత్రాల్ని, కొంత తర్ఫీదు యిస్తేచాలు, మనకి ఉపయోగ పడతారు" అన్నాడు గడ్డం వ్యక్తి.

తక్కిన వాళ్ళందరు అతనివంక ప్రశంసగా చూశారు.

"వెళ్ళిన పనేమయింది?" అడిగాడు గడ్డం వ్యక్తి.

"అంతా సెటిల్ చేసుకుని వచ్చాం! రాత్రి పది గంటలకు బోట్లు, కూలీలు వస్తారు. సరుకంతా అన్ లోడ్ చేసుకుపోతారు. మొత్తం యిరవై అయిదు లక్షలు. బేరం కుదిర్చి వచ్చాం!" అన్నాడు అందులో ఓ వ్యక్తి.

గడ్డం వ్యక్తి అతని భుజం తట్టి, "నువ్వు సాధించుకొస్తావని నాకు తెలుసు. కస్టమ్స్ వాళ్ళకిగాని, పోలీసులకిగాని ఏమాత్రం అనుమానం రాకుండా జాగ్రత్తలు తీసుకున్నావా?" అన్నాడు.

అతను నవ్వి, "కొత్తగా చెప్తున్నావేమిటి? తెలిసినా మన జోలికి రాకుండా ఎవరెవర్ని పట్టుకోవాలో వాళ్ళందర్నీ పట్టుకున్నాం. రెండున్నర లక్షలు ఖర్చయ్యింది!" అన్నాడు.

"ఇంకో రెండున్నర ఖర్చయినా ఫరవాలేదు. రైడింగ్ జరక్కుండా చూసుకోవటం ముఖ్యం."

"మీ కోసం బిర్యానీ, చికెన్ రోస్టు, మసాలా జీడి పప్పు, బాటిల్స్ తెచ్చాం!"

గడ్డం వ్యక్తి ఆనందంతో చిన్నగా కేక పెట్టాడు.

ఆ తర్వాత పదినిమిషాల్లో డైనింగ్ టేబిల్సు ముందు చేరిపోయారంతా.

గడ్డం వ్యక్తి శివాకి, రవికి బిరియానీ తెచ్చిపెట్టాడు తినమని. శివా, రవి ముందు సున్నితంగా తిరస్కరించినా లోపలి ఆకలి, వాళ్ళ మొహమాటాన్ని అణిచేసింది.

శివా అడిగాడు. "దయచేసి మమ్మల్ని మా యిళ్ళకు పంపించరూ?" అని.

"ఓ, అలాగే! బోట్ వచ్చిందిగా. మా వాళ్ళని తోడిచ్చి పంపిస్తాను. మిమ్మల్ని పోర్టు దగ్గర సురక్షితంగా దిగబెట్టి వస్తారు. ముందివి తినండి" అన్నాడతను ఎంతో మర్యాదగా.

"మీ పేరు తెల్సుకోవచ్చునా?" అన్నాడు రవి మర్యాదగా.

"ఓ, అలాగే! నన్ను యూసుఫ్ అంటారు. మీకు పరిచయమయిన యూరోపియన్ పేరు ఫ్రెడిక్. ఇటలీ దేశస్థుడు. చాన్నాళ్ళుగా మాతో అరేబియన్ కంట్రీస్‌లో ఉంటున్నాడు" అన్నాడు యూసుఫ్.

రవి, శివా తలలూపారు.

"తక్కిన వాళ్ళనికూడా పరిచయం చేస్తాను, తర్వాత!" అన్నాడు యూసుఫ్.

"మీ భోజనాలయ్యాక మమ్మల్ని పంపే ఏర్పాటు."

"ఓ, తప్పకుండా చేస్తాను, తినండి...." అంటూ యూసుఫ్ వెళ్ళిపోయాడు.

రవి, శివా తినటాని కుపక్రమించారు.

"వీళ్ళు చాలా మంచివాళ్ళలా వున్నారు, కదూ!" అన్నాడు శివతో.

"నిజమే. కాని యిందాకా ఆ వచ్చినవాళ్ళు యూసుఫ్‌తో ఏదో రహస్యంగా మాట్లాడుకున్నారు, ఏమిటి చెప్మా అది?" అన్నాడు శివా.

"అవన్నీ మనకెందుకు. వాళ్ళ వ్యాపారం గురించి అనుకుంటాను! నాకు ఉర్దూ సరిగా రాదు. అయినా తగ్గు స్వరంలో మాట్లాడుకోవటంవల్ల సరిగ్గా వినిపించలేదు

కూడా. నా కర్థమయినంతవరకు వాళ్ళు వ్యాపారం గురించి మాట్లాడుతున్నారని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను!"

"సరే, వాళ్ళ సంగతి మనకెందుకు? మనల్ని రక్షించారు. తిండిపెట్టారు. ఓడంతా త్రిప్పిచూపించారు. మంచివాళ్ళే! వాళ్ళ వ్యక్తిగత విషయాలు మన కనవసరం!"

"పాపం, నారాయణ ఏమయిపోయాడో? ముగ్గురం ఒకే డైరెక్షన్‌లో ప్రయాణంచేసి వచ్చాం కదా! చెదిరిపోయినా సముద్రం వాలుగా మన ట్యూబులు కొట్టుకొచ్చినయ్యి, అలాగే నారాయణకూడా న్యాయంగా ఈ షిప్ దగ్గరకే చేరుకోవాలి. కాని చేరుకోలేదు. కొంపదీసి, అతని కేమయినా ప్రమాదం...."

## 7

నారాయణ చెవులు రిక్కించి విన్నాడు.

బోట్ యింజన్ శబ్దం, షిప్‌కి అవలివైపు నుంచి వినిపిస్తోంది.

అతని కాళ్ళమధ్య రబ్బరు ట్యూబును నొక్కిపట్టి వుంచాడు. గొలుసును పట్టుకునే, ట్యూబ్‌ని షిప్‌కి అటుపక్కకు జరుపుతూ అంచునుంచి తొంగిచూశాడు.

ఆరుగురు వ్యక్తులు తాటినిచ్చెనమీదుగా ఏవేవో ప్యాకెట్లు, సీసాలు పట్టుకుని షిప్‌మీద కెక్కుతున్నారు. వాళ్ళ చేతుల్లోవి ఏమిటో అతను తేలిగ్గానే గ్రహించగలిగాడు.

అందరు నరరూప రాక్షసుల్లాగా ఉన్నారు. పోతరించిన ఎనుబోతుల్లా వున్నారు. అప్పటికే బాగా తాగినట్టు, వాళ్ళు తాటినిచ్చెనమీద జారటాన్నిబట్టి

గ్రహించాడు.

ఈ షిప్పు వ్యవహారమేమిటో తేల్చుకునిగాని వెళ్ళ కూడదు—అనుకున్నాడు నారాయణ.

ఓ అరగంట తర్వాత నెమ్మదిగా గొలుసును పట్టుకుని యెగబ్రాకాడు నారాయణ. ఎక్కడా అలికిడిలేదు. ఎక్కడ్నుంచో బాటిల్సు శబ్దాలు, నవ్వులు, కేరింతలు వినిపించాయి. లోపలి గదుల్లోంచి వస్తూన్న శబ్దాలుగా గుర్తించాడు నారాయణ. ఎవరైనా కాపలావున్నారేమోనని చూశాడు. ఎవరూ కనిపించలేదు.

ఈ సమయంలో పైకి యెక్కాలా వద్దా అని కొద్ది క్షణాలు ఆలోచించాడు. వాళ్ళందరూ భోజనాల్లో వున్నారని గ్రహించాడు. ఇదే మంచి అదనుగా అనిపించింది. వెంటనే షిప్ మీదికి ఎగబాకుతూ పావుగంట తర్వాత షిప్ అంచుకి చేరగలిగాడు.

అంతటా ప్రశాంతంగా వుంది. ఆ ప్రశాంత వాతావరణంలో నవ్వులు, తుళ్ళింతలు, బాటిల్ మూతలు తెరుస్తున్న చప్పుళ్ళు యివే స్పష్టంగా వినిపిస్తున్నాయి—దూరంగా వున్న గదుల్లోంచి అటువైపు మెల్లిగా అడుగులు వేస్తూ ముందు గదివద్దే చటుక్కున ఆగి విస్తుపోయి చూశాడు.

ఎదురుగా రవి, శివా లంచ్ తీసుకుంటున్నారు! గట్టిగా అరవబోయి, మళ్ళీ పరిస్థితి గుర్తొచ్చి "ఇష్!" అంటూ నోటితో చిన్న శబ్దం చేశాడు. వాళ్ళిద్దరూ ఒకే సారి తలలు తిప్పి నారాయణను చూశారు.

"అరె, నువ్వా? థాంక్ గాడ్! నీ గురించే యింత దాకా వర్రీ అయ్యాం. ఎలా వచ్చావు, ఏమిటి కథ?" ఇద్దరూ అమాంతం నారాయణను కౌగలించుకుని ప్రశ్నలతో ముంచెత్తేశారు

"ఆ విషయాలన్నీ తర్వాత. మీ రిక్కడ బంధింపబడి లేరుకదా....!?"

"బంధింపబడటమా? భలేవాడివే! ఈ నౌక తాలూకు మనుషులు చాలా దయామయులు. మేమంటే చాలా అభిమానం చూపించటమే కాక తినటానికి తిండి పెడుతున్నారు. మమ్మల్ని రేవులో దింపే యేర్పాట్లు చేస్తున్నారు...."

"అక్కడే మీరు పప్పులో కాలేశారు. ఇది గల్ఫ్ కంట్రీస్‌కి చెందిన నౌక—అవునా?"

"అవునయితే....?"

"తెలుసు కదా! ఈ నౌకద్వారా పెద్ద యెత్తున స్మగ్లింగ్ గూడ్స్ రవాణా అవుతున్నాయని నా ప్రగాఢ విశ్వాసం...."

"ఈ విషయంలో నువ్వు పొరబడ్డావు. ఈ నౌక ద్వారా అలాంటి రవాణా ఏం జరగటంలేదు."

"నా ఊహ కరెక్టే అయితే యిందాకా వచ్చిన స్టీమర్ బోట్‌లో వచ్చినవాళ్ళు అరేబియన్స్. వాళ్ళు సిటీకి పోయి బేరం కుదుర్చుకుని వస్తున్నారు. వీళ్ళకు మధ్యవర్తులుంటారు. వాళ్ళు సరుకుతీసుకుని కేష్ ఇస్తారు. సరుకు అంచెలంచెలుగా చేతులు మారి వ్యాపారం క్షణాల్లో జరిగిపోతుంది...."

"ఎందుకలా అనుమానిస్తున్నా వీ నౌక గురించి?...."

"గతంలో యిలాంటి నౌకలద్వారా స్మగ్లింగ్ జరగటం మా నాన్నగారు చూశారు. ఇదే అరేబియన్ షిప్ యిదంటే యిదే కాదు—యిలాంటిదే మరొకటి! పొరపాటున రహస్యం బయటపెడితే చంపుతానని బెదిరిం

చారు. ఆయన ఆ షిప్ వెళ్ళిపోయేవరకు ఎవరికీ యీ సంగతి చెప్పలేదు...."

"కాని, యీ నౌకలోని యూసుఫ్, ఫ్రెడిక్, అతని అనుచరులు అలాంటివారు కాదని ఖచ్చితంగా చెప్ప గలను...."

"సరే, ఒక్క విషయం చెప్పండి. ఈ షిప్ అంతా తిరిగిచూశారా మీరు?!"

"ఆఁ! చూశాం."

"మీకు అనుమానించదగిన వస్తువులేం కనిపించ లేదా?"

"పికేజి పెట్టెలలో ఆపిల్సు, ద్రాక్ష మాత్రం కనిపించాయి."

"ఆ పెట్టెల్లో ఆపిల్సు, ద్రాక్ష వున్నట్టు మీకెలా తెలుసు? మీరు తెరిచి చూశారా?"

"లేదు. పళ్ళవాసనబట్టి గ్రహించాం."

"నాకు ఆ పెట్టెలు ఒకసారి చూపిస్తారా?"

శివా, రవి యిబ్బందిగా చూశారు. "యూసుఫ్ అను మతి లేకుండా అవి చూడటం మర్యాద కాదుగదా!" అన్నారు.

"ప్రస్తుతం వాళ్ళు మందులో బిజీగా వున్నారు. మనం యేం చేస్తున్నామన్నదీ గమనించే స్థితిలో వుండరు."

"నువ్వెప్పుడు చూశావు?"

"వాళ్ళ బోటు వచ్చినప్పుడు నేను చూశాను. బాటిల్సు, పెట్టె తీసుకొని రావటం గమనించాను."

"గుడ్! మంచి అబ్జర్వేషన్. మరి అప్పుడే వాళ్ళను కనిపిస్తే నిన్ను మర్యాదగా యిక్కడికి చేర్చి వుండేవారు

కదా! అసలు పైకెలా వచ్చావు? తాటి నిచ్చెనల ద్వారా నేనా?"

"నో. గొలుసుసుపట్టి ఎగబ్రాకి!"

రవికీ, శివాకి నారాయణ అంతర్యం అర్థమయింది.

"ఓ.కే. పద చూద్దాం. యూసుఫ్ మన శ్రేయోభిలాషి. అతనికి తెలియకుండా మనం యీ విధంగా చూడటం మర్యాద కాదని మనసు పీకుతున్నా, నీ ఊహ కరెక్టు కాదని చెప్పటానికి చూపిస్తాం, పద!" అన్నారు వాళ్ళు.

ముందు రవి, శివా దారితీస్తుండగా నారాయణ వాళ్ళ ననుసరించాడు.

రవి, శివా పేకేజి పెట్టెలున్న గదుల్లోకి నారాయణను తీసుకెళ్ళి "ఇవిగో, పెట్టెలు!" అన్నారు.

నారాయణ పెట్టెల దగ్గరకెళ్ళి చూశాడు. ఆపిల్ వాసన, ద్రాక్ష వాసన వస్తున్న మాట నిజమే!

నారాయణ అయిరన్ ఫాయిల్ సీలుని తెగ్గొట్టి పెట్టెను విడగొట్టాడు—ఓ యిరవై ఊచ సాయంతో పైన ఆపిల్సు పేర్చి వున్నాయి రెండు వరుసల్లో. వాటిని తొలగించగానే అడుగున సరికొత్త వీడియో కేసెట్ రికార్డర్సు, కలర్ టీవీలు, కెమెరాలు దర్శనమిచ్చాయి.

రవి, శివా నోళ్ళు తెరచి నిల్చుండిపోయారు.

నారాయణ మరో పెట్టె సీలు అలాగే తెరిచాడు. అందులో పళ్ళ అడుగున టేప్ రికార్డర్సు స్టీరియో. టు-యిన్-వన్ సెట్సున్నాయి.

"తక్కిన పెట్టెలు కూడా యిలాంటివే. తెరవమంటారా?" అన్నాడు నారాయణ విజయగర్వంతో రవిని, శివాను చూస్తూ.

వాళ్ళు ఆశ్చర్యం నుంచి తేరుకుని, "నీ వాదన నిజమే! కాని, మనకు యీ స్మగ్లింగ్ విషయంలో తల దూర్చాల్సిన పనిలేదు. మనల్ని—అయ్ మీన్—మమ్మల్ని సురక్షితంగా ఒడ్డు చేరుస్తామని యూసుఫ్ మాటిచ్చాడు. మనకాక్కావలసింది అంతవరకే. స్మగ్లర్స్‌ని పట్టుకోవటానికి కస్టమ్స్ వాళ్ళున్నారు. ప్రత్యేకమైన డిపార్టుమెంటుంది. మన కెందుకొచ్చిన న్యూసెన్సు? దారితప్పి సముద్రంమీదికొచ్చినందుకు లెంపలేసుకుని, యూసుఫ్ సహాయంతో రేవు చేరటం మంచిది! మనం లోక రక్షణకు కంకణం కట్టుకున్నామా?" అన్నారు.

వాళ్ళ మాటలు పూర్తి కానేలేదు—వెనక నుంచి "వారేవా!" అంటూ చప్పట్లు వినిపించాయి.

అందరు దిగ్గున చూశారు.

యూసుఫ్! చేతిలో నల్లని రివాల్వర్ నిగనిగా మెరుస్తోంది!

# 8

"వెరిగుడ్ డిస్కవరీ! నువ్వెవరో తెలీదు గాని, చక్కటి డిటెక్టివ్ వని ఒప్పుకుంటున్నాను మిస్టర్!.... కదలొద్దు. నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను!" అన్నాడు యూసుఫ్ రివాల్వర్ సూటిగా నారాయణకు గురి చేసి.

ముగ్గురు కొద్ది నిమిషాలవరకు యేమీ మాట్లాడలేక పోయారు. రవి, శివా నారాయణవైపు జాలిగా చూశారు. చేతులారా నెత్తికి తీసుకొచ్చినందుకు లోపల కోపంగా వున్నా, యూసుఫ్ అతన్ని ప్రాణాలతో వదలడని అర్థమయిపోయింది వాళ్ళకు.

యూసుఫ్ సేఫ్టీ కాచ్ తప్పించాడు.

"వాట్ యంగ్మాన్? ఇక నేనా మీ తప్పిపోయిన

స్నేహితుడు? వెల్, పర్మినెంటుగా తప్పిస్తాను!" అంటూ ట్రిగ్గర్ మీద వేలుంచాడు.

అయితే అంతలోనే వూహించని అద్భుతం జరిగి పోయింది. నారాయణ మెరుపువేగంలో కిందికి ఒంగి, యినప వూచను అందుకున్నాడు. సరిగ్గా అదే క్షణంలో యూసుఫ్ రివాల్వర్ ప్రయోగించాడు. గుండు వెనక గోడకి తగిలి టప్పుమని నేలమీద పడింది.

ఉత్తర క్షణంలో నారాయణ ఇనపవూచను యూసుఫ్ చేతికేసి కొట్టాడు గట్టిగా.

రివాల్వర్ ఎగిరి అవతల పడింది.

యూసుఫ్ కోపంగా అరిచి ఒక్కసారిగా నారాయణమీదికి విరుచుకుపడ్డాడు.

అయితే యీసారి శివా, రవి చేతులు ముడుచుకుని కూచోలేదు. యూసుఫ్ నారాయణమీదికి దూసుకు పోయేంతలో అతని కాళ్ళకు కాళ్ళు అడ్డం పెట్టారు.

యూసుఫ్ దబ్బున కింద పడిపోయాడు. ఈలోపల శివా కిందపడ్డ ఊచతో అతని తలమీద బలంగా మోదాడు.

అయితే యింతలోనే ఫ్రెడిక్, తక్కిన ఆరుగురు అనుచరులు ఆ గదిలోకి పరుగెత్తుకుని వచ్చారు. రివాల్వర్ శబ్దం వాళ్ళకు వినిపించింది.

ఫ్రెడిక్ చేతిలో రివాల్వర్ వుంది.

నారాయణ యూసుఫ్ రివాల్వర్‌ని చేతుల్లోకి తీసుకున్నాడు. అతనికి హైస్కూల్లో గన్ షూటింగ్ నేర్పారు. అది ఇప్పుడు అక్కరకొచ్చింది.

ఫ్రెడిక్ చేతికి గురి చూసి కాల్చాడు. ఓ గుండు వ్యర్థమై పోయింది. వెంటనే మరొకటి కాల్చాడు.

ఫ్రెడ్రిక్ సేఫ్టీ కాచ్ తప్పించటం ఆలస్యమయింది. మణికట్టు దగ్గర తగిలింది గుండు.

రివాల్వర్ చేతిలోంచి కిందికి జారిపోయింది.

ఆ స్ప్లిట్ సెకండ్‌ని శివా బాగా ఉపయోగించుకున్నాడు. అతని రివాల్వర్ చేజిక్కించుకున్నారు.

శివా, నారాయణ రెండు రివాల్వర్స్‌ని అరుగురు అనుచరులకి గురిపెట్టారు.

"మమ్మల్ని పట్టుకోవాలనే ప్రయత్నం మానెయ్యండి—కాల్చటానికి వెనుతియ్యం" అన్నాడు నారాయణ స్వరం పెంచి.

ఫ్రెడ్రిక్‌తో బాటు తక్కిన అరుగురు వ్యక్తులు శిలా ప్రతిమల్లా నిల్చుండిపోయారు.

శివా కనుసైగతో రవి పెద్ద మోకు తీసుకొచ్చాడు. ఫ్రెడ్రిక్‌తో బాటు అందర్నీ తాడుతో బంధించటానికి ఫ్రెడ్రిక్‌ని సమీపించాడు.

శివా, నారాయణ రివాల్వర్స్‌తో వాళ్ళను కవర్ చేస్తున్నారు.

ఫ్రెడ్రిక్ తనని సమీపించిన రవిని చటుక్కున వాటేసుకుని, అతన్ని తన ముందు రక్షణ కవచంలా పెట్టుకున్నాడు. అదేక్షణంలో ఫ్రెడ్రిక్ అనుచరులు అతని వెనుక—క్యూలో నుంచున్నట్టు నుంచున్నారు!

శివా గాని, నారాయణ గాని రివాల్వర్ ప్రయోగిస్తే ముందుగా రవి మరణించటం తథ్యం!

ఫ్రెడ్రిక్ చాలెంజింగ్‌గా నవ్వి "ఇప్పుడు కాల్చండి, మీ ఫ్రెండు చచ్చాకగాని మేం చావం!" అన్నాడు.

శివా, నారాయణ ఆలోచనతో కొట్టామిట్టాడుతుండగా ఫ్రెడ్రిక్ తన అనుచరులతో ఒక్కో అడుగే

వెనక్కి వేస్తూ తాటి నిచ్చెన వరకు జరిగాడు. అతని వెనకే తిక్కిన ఆరుగురూ జరిగారు. వాళ్ళ ముందు రక్షణగా రవి!

ఫ్రెడిక్ అనుచరులు ఒక్కొక్కరు తాటినిచ్చెన మీదుగా కిందికి మెరుపు వేగంతో దిగి, షిప్‌తో అను సంధించి వున్న బోట్ మీదికి వురికారు.

వాళ్ళందరు బోటులోకి చేరపోతే యిక వాళ్ళను పట్టుకోవటం అసాధ్యం!

బోట్ స్టార్టుచేసి పారిపోతారు!

శివా వెంటనే బోట్‌లోకి ఉరుకుతున్న అనుచరుల వైపు గురిచూసి కాల్చాడు ఒకడు కూలిపోయాడు. రవి ఫ్రెడిక్ నిచ్చెన దిగుతుండగా మెరుపు వేగంతో షిప్‌లోకి ఎగబ్రాకాడు.

అయితే ఎవరూ ఊహించని విధంగా ఓ అనుచరుడు బోట్ లోపల దాచిన గన్నుతో బయటికొచ్చాడు. ఎదురు కాల్పులు సాగించాడు.

ఇంతలో ఫ్రెడిక్‌ను నారాయణ గురిచూసి కాల్చాడు. అతను దబ్బున నీళ్ళలో పడిపోయాడు.

గన్‌నుంచి వచ్చే గుళ్ళనుంచి తప్పించుకోవటం శివాకు నారాయణకు అనువుగా వుంది. కాని శివా నారాయణల గుళ్ళనుంచి బోట్‌లోని వాళ్ళకు రక్షణ లేకపోవటంతో మరో యిద్దరు గుళ్ళదెబ్బ తిని సముద్రంలో పడిపోయారు.

ముగ్గురు అనుచరులు మిగిలారు! ఇంతలో బోటు స్టార్టు చేసిన శబ్దం వినిపించింది. అంటే వాళ్ళ దగ్గర తుపాకీ గుళ్ళు ఖర్చయిపోయాయన్నమాట!

అయితే అప్పటికి శివా, నారాయణల దగ్గర వున్న రివాల్వర్స్‌లోని గుళ్ళన్నీ ఖర్చయిపోయాయి. లోపల

గుళ్ళున్నాయేమోనని వెతకటానికి వెళ్ళిన రవి రక్తహస్తాలతో తిరిగి శివా, నారాయణ దగ్గర వచ్చాడు.

ఆ ముగ్గుర్నీ పారిపోనివ్వకూడదు. కాని ఎలా? వాళ్ళు బోట్‌లో తప్పించుకుపోతున్నారు.

నిస్సహాయంగా బోట్ వైపు చూశారు స్నేహితులిద్దరు.

బోట్ అటు యిటు వేగంగా వూగుతోంది. స్నేహితులు ముగ్గురు ఆశ్చర్యంగా చూశారు. బోట్ మెల్ల మెల్లగా సముద్రంలోకి మునిగిపోతోంది. అంటే....? కాల్పులు జరిపినప్పుడు దానికి రంధ్రాలుపడి నీరు బోట్ లోనికి యథేచ్ఛగా ప్రవహిస్తుండటంవల్ల అది నీటితో బరువెక్కి మునిగిపోతోంది.

అయితే ప్రమాదాన్ని శంకించిన ముగ్గురు అనుచరులు బోట్ ఉపరితలంమీద అటు యిటు కాసేపు పరుగులు పెట్టారు. బోట్ లోపల్నుంచి రబ్బరు ట్యూబులు తెచ్చుకోవటానిక్కూడా వాళ్ళకు సమయం చిక్కివుండదు!

ఒకరొకరుగా సముద్రంలోకి ఉరికేశారు! వాళ్ళు కొంతదూరం ఈతకొట్టడం కనిపించింది. తర్వాత వాళ్ళు కనిపించలేదు!

# 9

"ఇప్పుడు మనం తీరం చేరేదెలా? తీరం నుంచి చాలా దూరంగా లాండయ్యింది షిప్! ఇదిక్కడున్నట్లు పోర్టు అధికారులకి తెలీదు. తెలిసినవాళ్ళు యీ స్మగ్లర్స్‌తో చేతులు కలిపిన పార్ట్‌నర్స్...." అని శివా అంటుండగానే, దూరంగా ఏదో బోట్ వస్తున్న శబ్దం వినిపించింది.

అప్పటికి కనుచీకటి పడింది. బోట్ హెడ్ లైటు

కనిపిస్తోంది.

నారాయణ ఆనందంగా అరిచాడు. "ఏదో బోట్ వస్తోంది దాని దృష్టి నాకర్షించాలి!" అంటూ ఎర్ర జెండా తీసి పైకెత్తి పట్టుకున్నాడు. "ట్రయిన్స్‌లో గార్డు ఉపయోగించే జండాలు ఈ షిప్ వాళ్లెందుకు అట్టిపెట్టుకున్నారో తెలీదుగాని, సమయానికి బాగా ఉపయోగపడ్డాయి!" అన్నాడు.

"నారాయణా, కొంపతీసి ఆ బోట్ వీళ్ళు చేతులు కలిపిన పార్ట్నర్స్‌ది కాదుగదా...." అన్నాడు రవి సంశయంగా.

ముగ్గురి ఆనందం ఆవిరై పోయింది.

అప్పటికే బోట్ దగ్గరయ్యింది. వాళ్ళు నారాయణ సిగ్నల్ గుర్తించారనటానికి ఋజువుగా బోట్ సరాసరి షిప్‌వైపే దూసుకొస్తోంది.

ఇంతలో వెనక చప్పుడు కావటంతో చటుక్కున తలలు తిప్పిచూశారు ముగ్గురు!

మునిగిపోయారనుకున్న ముగ్గురు అనుచరులు నారాయణ ఉపయోగించిన గొలుసు సహాయంతో షిప్ మీదికి ప్రాకి వచ్చేశారు. వాళ్ళు మునిగి చనిపోయారని అశ్రద్ధ చేయటం పొరపాటయిపోయింది. వాళ్ళు ముగ్గురు బలాఢ్యులైన వ్యక్తులు. వాళ్ళముందు తాము ముగ్గురు ఉత్త అర్భకులు. వాళ్ళ చేతుల్లో చావు తప్పదని అర్థమయిపోయింది.

ఆ ముగ్గురు అనుచరులు గాలికంటె వేగంగా వాళ్ళ మీదికి దూసుకొచ్చారు.

స్నేహితులు ముగ్గుర్లోను చావు తెగింపు వచ్చేసింది. యూసుఫ్‌ని కొట్టిన ఇనప ఊచ, కింద సిద్ధంగా వుంది! దాన్ని రవి అందుకుని ముందుకి ఉరికివచ్చిన అనుచరుల

కాళ్ళకు అడ్డంగా కొట్టాడు.

వాళ్ళ మోకాటి చిప్పలు పగిలాయో, యెముకలు చిట్లయో గాని అమాంతం నేలమీద బోర్లబొక్కలా పడి పోయారు..

శివా, నారాయణ అంతక్రితం రవి ఫ్రెడ్రిక్ ని, అతని అనుచరుల్ని బంధించబోయి విఫలమయిన మోకును సద్వినియోగం చేసుకున్నారు. మదపుటేనుగుల్ని బంధించినట్టు ఒకరి కాళ్ళకు మరొకరి కాళ్ళు పెనవేసి చకచక కట్టేశారు.

సరిగ్గా అదే సమయానికి తాటి నిచ్చెన మీదుగా కొందరు వ్యక్తులు షిప్ మీదికి వచ్చేశారు.

ముందుగా కనిపించిన వ్యక్తిని చూసి నారాయణ ఆనందంగా అరిచాడు "నాన్నా!" అంటూ.

—:అయిపోయింది:—

# ఇంట్లో హంతకుడు

మిస్. కె. మధుబాల

మూడు దాటింది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చాలా వేడిగావుంది. డ్రయివర్ వాన్‌ని పోనిస్తున్నాడు. వాన్‌లో గజపతి కూర్చుని వున్నాడు. అతడి చేతులకు బేడీలు వున్నాయి.

ఇద్దరు పోలీసు కాన్‌స్టేబుళ్ళు అతడికి కాపలాగా వాన్‌లో కూర్చున్నారు.

"మహా వుక్క బోస్తోంది" అన్నాడొక కానిస్టేబుల్.

"ఒక సోడా కొడ్తే బాగుంటుంది," అన్నాడు మరొకడు.

"నాకు సోడా పడదు. టీ నచ్చుతుంది."

"మనిషికో రుచి...." అన్నాడు మొదటివాడు.

"నర్సయ్యా, టీ కొట్టు పక్కన ఆపవయ్యా" అన్నాడు ఒక కాన్‌స్టేబుల్.

"నువ్వు ఆపమంటావు. ఆ ఖైదీగాడు దేంజరు

మార్కు మనిషి. అడి కేదేనా అయితే ఎందుకు ఆపావని నన్ను నిలేసి అడుగుతారు" అన్నాడు డ్రయివర్ నర్సయ్య.

"మా యిద్దరి చేతుల్లోనూ రైఫిల్స్ వున్నాయిగా! వాడికేమవుతుంది?" అన్నాడు కాన్‌స్టేబుల్ కన్నయ్య.

"అపవోయ్!" అన్నాడు రెండో కాన్‌స్టేబుల్ కరుపయ్య.

గజపతి కేసు కోర్టులో సాగుతోంది. మూడు నెలల పాటు యెంతో అన్వేషించి అతడిని పోలీసులు పట్టుకున్నారు. పది నిమిషాల్లో గజపతి ముగ్గుర్ని చంపి, దోచుకున్న డబ్బుతో పారిపోయాడు. అతడు పట్టుబడ్డాక కోర్టులో కేసు జరుగుతోంది. రోజూ వాన్‌లో అతడిని కోర్టుకు తీసుకొచ్చి తర్వాత అతడిని జైలుకు చేర్చడం ఆ పోలీసు కాన్‌స్టేబుళ్ళ డ్యూటీ.

ఒక టీ షాపు ముందు పోలీస్ వాన్ ఆగింది. కానిస్టేబులు కరుపయ్య నాలుగు టీ ఆర్డరిచ్చాడు.

"నాలుగెవరికి?" అడిగాడు కన్నయ్య.

"ఈ ఖైదీగాడు మన అతిథిగా, వాడికీ యిద్దాం. ఎలాగూ మనం డబ్బు యివ్వంగా!" అన్నాడు కరుపయ్య.

టీ షాపు అతడు స్వయంగా వాళ్ళకు గ్లాసులో టీ అందించాడు. అందరూ తాగారు. ఖాళీ గ్లాసులను కొట్టతను తీసుకున్నాడు.

"పది రూపాయిలకు చిల్లరుందా?" అన్నాడు కరుపయ్య జేబు తడుముతూ.

"మనలో మనకి డబ్బేమిటి?" అని షాపతను తీయగా నవ్వాడు.

డ్రయివర్ వాన్ని పోనిచ్చాడు. రెండు నిమిషాల తర్వాత ఒక పెట్రోలుబంక్ ముందు వాన్ ఆగింది.

"పెట్రోలు పొయ్యాల" అన్నాడు డ్రయివర్.

"పోయించయ్యా మన సొమ్మేం పోయింది?" అన్నాడు కరుపయ్య బీడీ వెలిగించబోతూ.

"పెట్రోల్ బంక్, బీడీ కాల్చకు" అన్నాడు కన్నయ్య.

డ్రయివర్ కిందకుదిగాడు. గజపతి బాధతో మూలుగు తున్నాడు.

"ఈడి కేమయింది?" అన్నాడు కరుపయ్య.

"వాడినే అడిగితే సరి!" అన్నాడు కరుపయ్య.

"వెంటనే లెట్రిన్‌కి వెళ్ళాలి" అన్నాడు గజపతి.

"కాస్సేపు ఆపుకో, జైలు కెళ్ళాక నీ యిష్టం!"

"ఆగలేను! ప్లీస్!" అన్నాడు గజపతి.

బంక్ మనిషి పెట్రోలు పోస్తున్నాడు. గజపతి లేచాడు—గెంతుతున్నాడు.

"ఇక్కడ లెట్రిన్ వుంటుంది. తీసుకెళ్ళడం మంచిది" అన్నాడు కరుపయ్య.

కన్నయ్య కిందకు దిగాడు. వెనకనే కిందకు దూకాడు గజపతి. బంక్ ఆవరణలో వున్న లెట్రిన్ వైపు పరు గెత్తాడు. కన్నయ్య రైఫిల్‌తో వెనకనే వెళ్ళాడు.

"బేడీలు!" అన్నాడు గజపతి.

కన్నయ్య సందేహిస్తూ వుండిపోయాడు.

"నీ చేతిలో రైఫిల్ వుంది. నేనెటు పోగలను? తొందరగా తియ్యి, ప్లీస్!" అన్నాడు గజపతి.

"నువ్వు మమ్మల్నేం చేయగలవ్!" అంటూ బేడీలు తీసేశాడు.

గజపతి తటాలున లెట్రిన్‌లో దూరి తలుపు మూశాడు.

బయట కానిస్టేబుల్ కన్నయ్య కాపలా వున్నాడు. పెట్రోలు పోసివచ్చిన మనిషితో కన్నయ్య యేదో మాట్లాడుతున్నాడు.

లెట్రిన్‌లో వున్న గజపతి ఆయుధం కోసం నలువైపులా చూశాడు. ఏమీ కనిపించలేదు. బకెట్, ఫినాయిల్ బాటిల్ కనిపించాయి.

బాటిల్లో వున్న ఫినాయిల్‌ని అతను బకెట్‌లో పోసి టాప్ తిప్పాడు. బకెట్‌లో సగందాకా నీళ్ళతో నింపి అతడు టాప్ మూశాడు.

తటాలున తలుపు తెర్చాడతను. కన్నయ్య గుర్తించే లోగా ఫినాయిల్ నీళ్ళను అతడు కన్నయ్య మొహం మీదకు జల్లాడు. కన్నయ్య కళ్ళు మూసుకున్నాడు. ఫినాయిల్‌తో కళ్ళు మండుతున్నాయి.

అతని చేతిలోని రైఫిల్‌ని గజపతి లాక్కున్నాడు. అతడి పొట్టలో తన్నాడు. కన్నయ్య వెనక్కు పడ్డాడు. బంక్ మనిషి నెత్తిమీద బలంగా రైఫిల్‌తో కొట్టి గల్లాపెట్టెలో వున్న నోట్లను అతడు జేబులో వేసుకున్నాడు

కరుపయ్య పరుగెత్తుకొచ్చాడు కాని గజపతి చేతిలోని రైఫిల్ వురుముతూ పేలింది. కరుపయ్య నేల కూలాడు. గజపతి వాన్ వైపు పరుగెత్తాడు.

డ్రయివర్ నర్సయ్యని తలమీద కొట్టి కిందతోశాడతను. స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు. కొంతమంది అతడిని ఆపబోయారు. వాళ్ళవైపు భయంకరంగా షూట్ చేశాడతను.

అందరూ వెనక్కి జరిగారు. గజపతి పోలీస్ వాన్ని వేగంగా రోడ్డున్నట పోనిచ్చాడు.

## 2

గజపతి వాన్ని ఒకచోట ఆపి దిగాడు. రైఫిల్ని వాన్లో వదిలేశాడు. చేతిలో రైఫిల్ వుంటే ప్రజలు గుర్తిస్తారు!

అతడు కొంచెం దూరం వడి వడిగా నడిచాడు. పక్క నుంచి ఖాళీగా పోతున్న ఆటోని ఆపాడు. ఎక్కి కూర్చున్నాడు.

"పద!" అరిచాడు.

"ఎక్కడికి సార్?" అడిగాడు డ్రయివర్.

"ఇదే రోడ్డున్నట ముందుకు పద!" అన్నాడు గజపతి.

రోడ్డున్నట ఆటో దూసుకుపోయింది పోలీస్ వాన్కి దూరంగా పోవాలి!

పది హేను నిమిషాల తర్వాత గజపతి డ్రయివర్ని ఆగమన్నాడు. మీటర్ చూసి బిల్ చెల్లించాడు.

"మరో పది రూపాయిలు యివ్వాండి, సార్!" అన్నాడు డ్రయివర్.

"ఎందుకు?" అడిగాడతను.

"ఇక్కడ నుంచి నాకు సవారీ దొరకదు!" అన్నాడు డ్రయివర్.

గజపతి అతడివైపు సూటిగా చూశాడు. "నేనొక సి.ఐ.డి. ఆఫీసర్ని! తెలుసా?"

"అయితే వెళ్ళండి, సార్! నేను మీరెవరో అనుకున్నాను. నన్ను క్షమించండి" అన్నాడు డ్రయివర్.

ఆటో వెళ్ళిపోయింది. రోడ్డువారగా నిలబడి అతడు నలువైపులా చూశాడు. పక్కనే ఒక సందు వుంది. ఆ

సందమ్మట వెళ్ళాడతను.

సందు యిరువైపులా యిళ్ళు వున్నాయి. చివరిదాకా నడిచాడతను. ఒక గేటు అతడి ఎదురుగా వుంది. గేటు తెర్చుకుని అతడు లోపలకు నడిచాడు.

పెద్ద యిల్లు. మేడ. అతను మెట్లెక్కి పైకి వెళ్ళాడు. తలుపు మూసి వుంది. గోడమీద ఎలెక్ట్రిక్ బెల్ వుంది. అతడు బెల్‌ను నొక్కాడు.

బెల్ మ్రోగడం అతడికి వినపడింది. కాస్సేపట్లో తలుపు తెరవబడింది. తెల్ల లుంగీ, బనియన్ ధరించిన ఒక యువకుడు అతడి కెదురుగా నిలబడ్డాడు.

"మిస్టర్!" అన్నాడు గజపతి.

"ఎవరు మీరు?" అడిగాడా యువకుడు.

"నేనొక సి.ఐ.డి. ఆఫీసర్ని. ఒక హంతకుడు యిటువైపు పారిపోయాడు. ఎవరేనా మీ యింటికి వచ్చారా?"

"ఎవ్వరూ రాలేదు—లోపలకు రండి" అన్నాడా యువకుడు.

గజపతి లోపలకు వెళ్ళాడు. హాల్లోని సోఫాలో కూర్చున్నాడు.

"సుందరీ!" పిల్చాడా యువకుడు.

ఒక యువతి చిన్న పిల్లాడిని యెత్తుకుని హాల్లో కొచ్చింది.

"ఈయన సి.ఐ.డి. ఆఫీసర్. మనతో మాట్లాడ్డానికి వచ్చారు" అన్నాడతను.

ఆమె గజపతికి నమస్కరించింది. భర్త పక్కనే పొడుగాటి సోఫాలో గజపతికి యెదురుగా ఆమె కూర్చుంది.

"ఈ బిల్డింగ్‌లో మీరే వుంటున్నారా?" అడిగాడు గజపతి.

"క్రింద భాగంలో లింగంగారు వుంటున్నారు. పైన మేం వుంటున్నాం" అన్నాడా యువకుడు.

"మీ పేరు?"

"రజనీకాంత్. నా భార్య పేరు సుందరి. మా అబ్బాయి పేరు ఆరుద్ర" అన్నాడతను.

"గుడ్!" అని గజపతి హాల్లో పచార్లు చేస్తూ సిగరెట్ వెలిగించాడు.

హాగ పీల్చి వదిలి అతడు ఆ యువకుడివైపు సూటిగా చూశాడు.

"మీ గదులన్నీ వెతకాలి, పదండి" అన్నాడతను.

అతడిని రజనీకాంత్, సుందరి పడగ్గదిలోకి తీసుకెళ్ళారు.

గజపతి వాళ్ళవైపు చూస్తూ నవ్వాడు.

"నేను సి.ఐ.డి. ఆఫీసర్ని కాను. మీతో అబద్ధం చెప్పాను. ఆ హంతకుడిని నేనే. ఏ మాత్రం నాకు వ్యతిరేకంగా వెళ్ళినా మీ శవాలు యీ గదిలో వుంటాయి. నేను చెప్పినట్లు చేస్తే మీకు ఏ ప్రమాదమూ వుండదు" అన్నాడు.

"ఏం చేయాలో చెప్పండి!" అన్నాడు రజనీకాంత్.

"నా కోసం పోలీసులు పట్నమంతటా గాలిస్తున్నారు. నేను మీ యింట్లో వుంటాను. నాకు ఏ ప్రమాదమూ రాకుండా చూసే బాధ్యత మీది" అన్నాడు గజపతి.

"పోలీసులు మీ రిక్కడున్నారని తెల్సుకొని వస్తే

మీకు ఆశ్రయం ఇచ్చినందుకు మమ్మల్ని అరెస్టు చేస్తారు"
అన్నాడు రజనీకాంత్.

"మీరు నన్ను పట్టివ్వడానికి ప్రయత్నించనంత కాలం యే పోలీసూ యిక్కడకు రాడు!" అన్నాడతను.

"మేం మిమ్మల్ని పోలీసులకు పట్టివ్వం. మా గెస్టుగా మీ రీ యింట్లో వుండొచ్చు" అన్నాడతను.

గజపతి అతడివంక చూశాడు.

"నేను యెంతకాలం యిక్కడుండవలసి వస్తుందో తెలియదు. వారంరోజులు దాటి నేను వుండొచ్చు. రేపే నేను వెళ్ళిపోవచ్చు. నే నెవర్నీ సాధారణంగా నమ్మను. నేనిక్కడ వున్నంత కాలం మీరు యీ పడగ్గదిలోనే వుండాలి. బయటకు వెళ్ళకూడదు."

రజనీకాంత్ అతడివైపు గాభరాగా చూశాడు.

"నేను వీనస్ ఇంజనీరింగ్ కంపెనీ అసిస్టెంట్ మేనేజర్ని. ఈ మధ్యనే ఈ వుద్యోగంలో చేరాను. ఆఫీసుకు రోజూ వెళ్ళాలి!"

గజపతి వెంటనే జవాబివ్వలేదు. కొంతసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు.

"మీరు ఆఫీసుకు రోజూ వెళ్ళొచ్చు. నా గురించి మీరు నోరు మెదిపితే యింట్లో వున్న భార్య, కొడుకు ప్రాణాల్తో మీకు దొరకరు" అన్నాడతను క్రూరంగా.

# 3

రజనీకాంత్ యెనిమిదింటికి తన కారులో ఆఫీసుకు వెళ్ళాడు. అతడు వెళ్ళగానే మెట్లపైనున్న గుమ్మం తలుపును మూసేశాడు గజపతి.

రజనీకాంత్ని గురించి గజపతి యెంతో సమాచారం జాగు చేశాడు? వాళ్ళకు వచ్చిన పత్త్రాలన్నీ చదివాడు.

వాళ్ళతో మాట్లాడి యెంతో తెలుసుకున్నాడు.

సుందరి తలిదండ్రులు బొంబేలో వున్నారు. వాళ్ళు స్వంత ఫ్లాట్‌లో వుంటున్నారు. సుందరి తండ్రి పేరు రామశాస్త్రి. తల్లి పేరు శాంతమ్మ. వాళ్ళు 12 న బయలుదేరి ప్లేన్‌లో మద్రాసు వస్తున్నారు, ముద్దుల కూతుర్ని చూడ్డానికి!

వంటగదిలో సుందరి పనిచేస్తోంది. కొడుకు నిద్రపోతున్నాడు. గజపతి వంటగదిలోకి వెళ్లాడు. అతడిని చూసి ఆమె ఉలిక్కిపడింది.

"సుందరిగారూ. నన్ను చూసి మీరు భయపడవద్దు. నాకు హాని చేయనంత కాలం మీకే ప్రమాదమూ వుండదు."

"నే నెవ్వరికీ హాని చెయ్యను" అందామె.

"మీ అమ్మా, నాన్నా 12 న వస్తున్నారుగా?"

"అవును. వస్తామని రాశారు."

"వాళ్ళు వస్తే మీరు ఏరోడ్రోమ్‌కి వెళ్తూ వుంటారా?"

"నేను వెళ్ళను. ఆయన వెళ్ళి వాళ్ళను యింటికి తీసుకొస్తారు" అందామె.

"మీ నాన్నగారి వయస్సెంత?"

"70 వుంటుంది."

"అమ్మ వయస్సు?"

"63 వుండొచ్చు."

"మీ భర్తకు దగ్గర చుట్టాలు ఎవరెవరున్నారు?"

"తల్లీ తండ్రీ మరణించారు. అన్నయ్య వున్నాడు. ఒక మామయ్య వున్నాడు."

"వాళ్ళను మీ తలిదండ్రులు చూశారా?"

"అన్నయ్యను చూశారు కాని మామయ్యను చూడ లేదు."

"మీ భర్త మామయ్య పేరు?"

"వెంకటరాజు" అందామె.

ఆమెవైపు చూసి అతడు తీయగా నవ్వాడు.

"నేనొక హంతకుడినని మీ తలిదండ్రులకు తెలియ నవసరంలేదు. నేను మీ భర్త మామయ్య వెంకట రాజుని!" అన్నాడతను.

"అలా చెప్తే వాళ్ళు నమ్ముతారు. మిమ్మల్ని ఇంతకు ముందు చూడలేదుగా!" అందామె.

"వాళ్ళు యిక్కడ ఎన్నిరోజులుంటారు?"

"మూడు వారాలు వుండొచ్చు."

"అన్ని రోజులు మామయ్యలా నటించడం కష్టతర మైన పని!"

"నా తలిదండ్రుల మూలంగా మీకే ప్రమాదం రాదు. వాళ్ళు ముసలాళ్ళు. నా తల్లికీ, తండ్రికీ దైవ భక్తి యెక్కువ" అందామె.

"నాకు దేవుడిలో నమ్మకం లేదు. నేను నాస్తికుడిని" అన్నాడతను.

అతడు తన పడగదికి వెళ్ళిపోయాడు. టేబులు మీదున్న మూడు దినపత్రికలనూ చూడసాగాడు.

కాన్‌స్టేబులు కరుపయ్యా చనిపోయాడు. తనచే హత్య చేయబడ్డాడు. వాన్ డ్రయివర్ నర్సయ్య హాస్పిటల్లో ఉన్నాడు. పెట్రోల్ బంక్ మనిషికి తలమీద బాగా గాయం తగిలింది. రొక్కంగా నాలుగువేలుపైన పోయి నట్లు అతడు పోలీసులతో చెప్పాడు. ఈ వివరాలన్నీ దినపత్రికలో వున్నాయి.

గజపతి ఫోటో అన్ని పత్రికల్లోనూ ముద్రించబడింది. తనని గురించి పోలీసులు సవ్యాంగా వర్ణించారు. మీడియమ్ హైట్‌లో ఉండే గజపతి బలిష్టంగా వుంటాడని పోలీసు కమీషనర్ ప్రకటించాడు. అతడిని గురించి ఎన్నో వివరాలు యివ్వబడినాయి.

గజపతిది పెద్దతల అమెరికన్ క్రాఫు. ఇంగ్లీషు, తెలుగు, అరవం, కన్నడం, హిందీ అతడు బాగా మాట్లాడగలడు. భయంకరంగా హత్యలు చేసిన గజపతిని పట్టిచ్చినవారికి 25 వేలు బహుమతి యివ్వబడుతుందని పోలీసు కమీషనర్ ప్రకటించాడు.

అతడు తనలో తను నవ్వుకున్నాడు. తన విలువ డాలర్‌లా పెరిగిపోతోంది. తనకోసం 25 వేలు యివ్వడానికి పోలీసు కమీషనర్ రెడీగా వున్నాడు. కాని తన్ని ఎవరు పట్టివ్వగలరు?

"ఇంపాసిబుల్!" అనుకున్నాడు గజపతి తనలో తాను.

## 4

ఆ రోజు ఆదివారం. రజనీకాంత్ ఆఫీసుకు పోలేదు. ఇంట్లోనే ఉన్నాడు.

మధ్యాన్నం ఒంటిగంటకు గజపతి, రజనీకాంత్ సుందరీ లంచ్ సేవిస్తున్నారు.

క్రితం రాత్రి గజపతిని గురించి తీవ్రంగా రజనీకాంత్ ఆలోచించాడు. గజపతి స్వతహాగా మంచివాడిలా ఉన్నాడు. తను ఇంట్లో లేకపోయినా తన భార్యతో ఎన్నడూ గజపతి చెడ్డవాడిలా ప్రవర్తించలేదు. అతడిని తను మెల్లిగా మార్చాలి! అతడికి తన కంపెనీలో ఉద్యోగం యిప్పించాలి అనుకున్నాడు రజనీ

కాంత్.

సుందరి వంట బాగా చేస్తుంది. ఆమె వండితే ఎంతేనా తినాలనిపిస్తుంది. గజపతి, రజనీకాంత్ ఆకలితో తింటున్నారు.

రజనీకాంత్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"మీరు చాలా తెలివైనవారు. మీ బుర్ర పెద్దది. మీరు వాంతకులుగా మారడానికి కారణం యేమిటి?" ప్రశ్నించాడతను.

"ఈ ప్రశ్న ఎందుకు? మీరు ఏం చెప్పదల్చారు?" అడిగాడు గజపతి.

"మా కంపెనీలో వెయ్యి రూపాయిలు జీతంమీద నేను మీకు ఉద్యోగం యిప్పించగలను. ఈ క్రయిమ్ జీవితానికి గుడ్ బై చెప్పి మీరు హాయిగా జీవించవచ్చు" అన్నాడు రజనీకాంత్.

గజపతి పకపక నవ్వాడు.

"నాకు ఉద్యోగమా! ఈ జీవితంలో నేను ఉద్యోగం చేయలేను. ఇలాగే నేను జీవించాలి" అన్నాడతను.

"మీకంటె తక్కువ తెలివితేటల్తో అనేకమంది మంచి ఉద్యోగాల్లో ఉన్నారు!"

"ఉండొచ్చు. కాని నేను టైమ్ ప్రకారం ఆఫీసుకు వెళ్ళలేను."

"నాలా మీరూ వెళ్ళగలరు. నా తమ్ముడులామిమ్మల్ని భావించి యీ సలహా యిస్తున్నాను. ఈ ఉద్యోగంలో చేర్తే మీరు హాయిగా ఉండొచ్చు. మీకు నేను పెళ్ళి చేయిస్తాను. మీ భార్యతో మీరు సుఖంగా సంసారం సాగించవచ్చు" అన్నాడు రజనీకాంత్.

"పెళ్ళంటే నాకు అసహ్యం! మరో విషయం

గురించి మనం మాట్లాడుదాం! నా పెళ్ళి విషయం మళ్ళా ఎత్తొద్దు" అన్నాడు గజపతి.

అతడి మొహం సీరియస్‌గా వుంది. గజపతి యిలా ఎందుకు అంటున్నాడు? గతంలో జరిగినదేదో అతడిని పెళ్ళికి దూరం చేసిందా?

రజనీకాంత్ ఆలోచిస్తున్నాడు.

"నన్ను క్షమించండి. ఇటుపైన మీ పెళ్ళి విషయం మాట్లాడను" అన్నాడు రజనీకాంత్.

"మిస్టర్ రజనీకాంత్, నాకు ఆడవాళ్ళు నచ్చరు. యెందువలనో ఆడవాళ్ళు నన్ను ఆకర్షించరు" అన్నాడు గజపతి.

"నా భార్య సుందరి మీకు నచ్చిందా?"

"ఐ లైక్ హర్!" అన్నాడు గజపతి.

"సుందరిలాంటి యువతులు ఎందరో ఈ దేశంలో ఉన్నారు. మీ పెళ్ళికి యెంత ఖర్చయినా నేను భరిస్తాను" అన్నాడు రజనీకాంత్.

గజపతి జవాబివ్వలేదు. భోజనం ముగించి గజపతి తన గదికి వెళ్ళిపోయాడు. రజనీకాంత్ తన భార్యవైపు చూశాడు.

"ఎంతకాలం యిలా మనం ఉండాలో?" అన్నాడు రజనీకాంత్.

సుందరి అతడివంక చూసింది.

"నా తల్లీ తండ్రీ వచ్చేవరకు మనం అతడికేదో చెయ్యాలి" అందామె.

"అతడి మూలంగా నీ తలిదండ్రులకు యేదేనా ప్రమాదం వుంటుందని నువ్వు అనుకుంటున్నావా?"

"హంతకుడు ఎప్పటికీ హంతకుడే! అతడి మూలంగా

నా తలిదండ్రులకు ఏమవుతుందో!"

"అత'తో మళ్లా మాట్లాడతాను. అతడిని మార్చడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు రజనీకాంత్.

"ప్రయత్నించండి!" అందామె.

రజనీకాంత్ చెయ్యి కడుక్కున్నాడు. సమీపంలో ఉన్న పడగ్గది గుమ్మం ముందుకు వెళ్ళాడతను. తలుపును తట్టాడు.

"కమిన్!" అన్నాడు గజపతి తలుపు తెర్చి.

# 5

పోలీసు కమీషనర్ బాండ్ ఎదురుగా ఇన్‌స్పెక్టర్ రామన్ కూర్చుని వున్నాడు.

"గజపతికోసం పట్నమంతా గాలించాం. అతడు ఎక్కడా లేడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కమిషనర్ బాండ్ పీలుస్తూన్న పైప్‌ని చేతో పట్టుకుని అతడివైపు సూటిగా చూశాడు.

"ఇన్‌స్పెక్టర్ రామన్, అదంతా పియర్ వాన్ పెన్స్‌గా వుంది. అతడు సాధారణ మానవుడు. టక్కున మాయమైపోలేడు. పోలీసు వాన్ యెక్కడ అతను ఆపాడో మీకు తెలుసు. అతడు అక్కడే దిగివుంటాడు" అన్నాడు బాండ్.

"అదంతా నేను ఆలోచించాను, సార్. వాన్ ఆగిన ప్రదేశానికి సమీపంలో వున్న అన్ని యిళ్ళకూ పోలీసులు వెళ్ళి దర్యాప్తు చేశారు. అతడు లేడు."

"వాన్ దిగి అక్కడున్న యిళ్ళల్లో అతడు దాక్కోడు. వాన్‌కి వీలైనంత దూరంగా అతడు పోతాడు. టాక్సీలోనో, బస్సులోనో, ఆటోలోనో అతడు వెళ్ళి వుండొచ్చు. అతడు ఎక్కడ దిగాడో కనుక్కోవాలి!"

"మీరు చెప్పిన లైనులో నేను పరిశోధన ప్రారంభించాను. అతడి ఫోటోలు ప్రతి ఆటో డ్రయివర్కీ, టాక్సీ డ్రయివర్కీ, బస్సు కండక్టర్కీ పోలీసులు చూపించి ప్రశ్నిస్తున్నారు. రిపోర్టులకోసం ఎదురు చూస్తున్నాను" అన్నాడు ఇన్స్పెక్టర్ రామన్.

"అది వేగంగా జరగాలి" అన్నాడు కమీషనర్ బాండ్.

"ఈ పట్నంనుంచి బయటకు వెళ్ళేచోట్ల మేం పోలీసులను నియమించాం. స్టేషన్లలో, బస్టాండ్లలో, ఏర్పోర్టులో మా మనుషులు ఉన్నారు. అతడు బయటకు పోవడం కష్టం" అన్నాడు ఇన్స్పెక్టర్ రామన్.

"ప్రొసీడ్!" అన్నాడు బాండ్ పైప్ పీలుస్తూ.

"అతడి దగ్గర నాలుగువేలపైన రొక్కం ఉంది. అదంతా పెట్రోలు బంకకు చెందినది...."

"ఈ పాటికి మరి కొంత డబ్బు అతడు మరెక్కడో దోచుకుని వుండొచ్చుగా?" అన్నాడు బాండ్.

"ఎక్కడా దోపిడీ కంప్లెయింట్స్ మాకు రాలేదు. డబ్బు పోతే వెంటనే పోలీసు రిపోర్టు యిస్తారు. అది కూడా చూస్తున్నాను."

"ఆల్ రైట్, అతడి దగ్గర నాలుగువేలు వుందనుకుందాం. నువ్వు చెప్పదల్చినదేమిటి?" అడిగాడు కమీషనర్ బాండ్.

"అతడు ఆ డబ్బుతో మరీ పెద్ద హోటల్స్కు వెళ్ళడు. మీడియమ్ సైజు హోటల్సు కెళ్ళి మా మనుషులు దర్యాప్తు చేస్తున్నారు. త్వరలో ఏదో తెలుస్తుంది" అన్నాడు రామన్.

"నాకు కావలసింది పరిశోధన కాదు, క్విక్ రిజల్ట్స్!"

అరిచాడు బాండ్.

"అందుకే నేనూ కృషిచేస్తున్నాను, సార్. వాడు మనకు దొరుకుతాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"పెట్రోలు బంక్ దగ్గర జరిగిన హత్యాకాండ మీద అప్పుడే పత్రికలు రాస్తున్నాయి. పైనుంచి నాకు ఒత్తిడి ఎక్కువైంది. రెండు రోజుల కొకసారి వచ్చి నన్ను కల్సుకుని వివరంగా రిపోర్టిస్తూ వుండు!"

"అలాగే సార్" అని ఇన్‌స్పెక్టర్ రామన్ కుర్చీ లోంచి లేచాడు.

టెలిఫోన్ మ్రోగింది. కమిషనర్ బాండ్ యేదో మాట్లాడి రిసీవర్ని రామన్‌కి ఇచ్చాడు.

"అర్జంట్ కాల్, నీకు!" అన్నాడు బాండ్.

ఇన్‌స్పెక్టర్ రామన్ రిసీవర్ని అందుకున్నాడు.

"ఇన్‌స్పెక్టర్ రామన్ హియర్!" అన్నాడతను.

"రవి రిపోర్టింగ్ సార్" అన్నాడొకడతను.

"రవీ, చెప్పు!"

"తేనేంపేట ఆటో స్టేండ్‌లో ఒక ఆటో డ్రయివర్ గజపతి ఫోటో చూసి పోల్చాడు. అతడు ఆటోలో వెళ్లాడు. ఒకచోట దిగాడు. ఆటో డ్రయివర్ ఎక్కువగా డబ్బివ్వని అడిగాడట. తనొక సి. ఐ. డి. ఆఫీసర్నని అతడు డ్రయివర్ని బెదిరించి, మీటర్‌లో వున్న మొత్తం మాత్రం యిచ్చి వెళ్ళిపోయాడు."

"అతడు ఎక్కడ దిగాడు?"

"చామియర్స్ రోడ్డు పోస్టాఫీసు దగ్గర దిగాడట."

"అతడి అడ్రెసు తీసుకో! అతడితో ముళ్ళా, మనకు అవుసరం వుండొచ్చు" అన్నాడు రామన్.

"తీసుకున్నాను, సార్" అన్నాడు రవి.

"గుడ్ వర్క్" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

"ఏదేనా తెలిసిందా?" అడిగాడు బాండ్.

"ఒక క్లూ దొరికింది, సార్. పోలీసు వాన్‌లోంచి దిగిన గజపతి ఒక ఆటోలో వెళ్లాడు. అతడు యెక్కడ దిగాడో తెలిసింది."

"రన్, మై ఫ్రెండ్! అక్కడ వెతికి చూడు."

"యస్సార్" అని యిన్‌స్పెక్టర్ రామన్ బయటకు పరుగెత్తాడు.

# 6

కింద కారు ఆగింది. సుందరి ఆనందంగా కిందకు పరుగెత్తింది. క్షణంలో అందరూ పైకి వచ్చారు.

కొడుకు అరుద్ర మాత్రం గజపతి పక్కనే సోఫాలో కూర్చుని బొమ్మతో ఆడుకుంటున్నాడు.

"మీరు ఒప్పుకున్నట్లు చేయకపోతే మీ కుర్రాడిని పీక పిసికి చంపేస్తాను!" అని ఆ దంపతులకు ముందే చెప్పాడతను.

రజనీకాంత్ ఒక పెట్టెను పైకి మోసుకొచ్చాడు. సుందరి ఏర్ బాగ్‌ను తెచ్చింది. వాళ్ళ వెనకనే రామ్మూర్తి, శాంతమ్మ వచ్చారు.

గజపతి వాళ్లవైపు నవ్వుతూ చూశాడు. రామ్మూర్తి జుత్తు బాగా నెరిసింది. మెల్లిగా నడుస్తున్నాడతను. అతడి చెవికి హియరింగ్ ఎయిడ్ వుంది. చెవిటివాడై ఉండాలి!

శాంతమ్మ పొట్టిగా, పచ్చగా సిలిండర్‌లా వుంది. ఒంటినిండా నగలున్నాయి. చేతిలో హేండ్ బాగ్ కనిపిస్తోంది.

వాళ్ళు ధనవంతులని చూడగానే యెవరికేనా తెలిసి

పోతుంది.

రజనీకాంత్ నవ్వుతూ గజపతివైపు చూపించాడు.

"మీరు ఇతడిని ఇంతకుముందు చూడలేదు. నా మామయ్య వెంకటరాజు" అన్నాడు రజనీకాంత్.

గజపతి లేచి నిలబడి వాళ్ళకు నమస్కరించాడు.

"మీ ఇద్దర్నీ కలుసుకున్నందుకు సంతోషం. మీ గురించి మేనల్లుడిద్వారా చాలా విన్నాను" అన్నాడు గజపతి.

"ఉయ్యార్ హేపీ" అన్నాడు రామ్మూర్తి.

సుందరి వాళ్ళిద్దర్నీ ఒక గదిలోకి తీసుకువెళ్ళింది. రజనీకాంత్ అతడి కెదురుగా వచ్చాడు.

"నామీద మీకు నమ్మకం ఏర్పడిందా?"

గజపతి గమ్మత్తుగా నవ్వాడు.

"ఒకటిచేస్తే మీమీద నాకు నమ్మకం కుదుర్తుంది. నేను ఇక్కడనుంచి వెళ్ళిపోతాను."

"ఏం కావాలో చెప్పండి!"

సుందరి హాల్లోకొచ్చి కొడుకును తీసుకుని తన తండ్రి ఉన్న గదిలోకి నడిచింది.

"మీ మావగారూ, అత్తగారూ వాళ్ళ ఫ్లాట్ కి తాళంవేసి యిక్కడకు వచ్చారు. అవునా?"

"అవును."

"ఇక్కడ పోలీసులు నా కోసం విపరీతంగా వెతుకుతున్నారు. ఈ పట్నంలో బయటకు కదలడం కష్టంగా వుంది. నేను బొంబే పోతాను. వాళ్ళ ఫ్లాట్ లో కొంత కాలం తల దాచుకుంటాను" అన్నాడతను.

"అది మంచి ఐడియా! అలా చేయడానికి ఏంకావాలో చెప్పండి!"

"ఆ ఫ్లాట్ తాళం చెవులు నాకు కావాలి!"

"ఇంపాసిబుల్! ఆయన వాటిని యెవ్వరికీ యివ్వరు!"

గజపతి అతడివైపు సూటిగా చూశాడు. "నేను యిక్కడనుంచి పోవాలంటే మీరు ఆ తాళం చెవులను దొంగిలించి నాకివ్వాలి" అన్నాడతను.

"అక్కడ మీరు యెలా వుంటారు? ఇరుగు పొరుగు వాళ్ళు మిమ్మల్ని చూసి అనుమానించవచ్చు!"

"అక్కడికెళ్లాక అదంతా నేను చూసుకుంటాను."

రజనీకాంత్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఏం చెయ్యాలో తోచడంలేదు!" అన్నాడతను.

"నేను మీ ప్రియమైన మావయ్యను. కాన్సర్‌తో బాధపడుతున్నాను. బొంబేలోని టాటా హాస్పిటల్‌కి నేను వెళ్లాలి. వాళ్ళ ఫ్లాట్‌లో వుండి రోజూ హాస్పిటల్‌కి వెళ్ళివస్తూ వుంటాను. మీ మావగారు నాకు తన ఫ్లాట్ తాళంచెవులు యిచ్చి అక్కడ వుండమనాలి నన్ను!"

"మీ ఆర్డరు చాలా పెద్దది!" అన్నాడు రజనీకాంత్.

"మీరు యేదో చేసి నాకు కావలసింది సాధించాలి. దానితో నేను యిక్కడినుంచి వెళ్ళిపోతాను" అన్నాడు గజపతి.

"మీరు యీ పట్నం వదిలి ఎలా వెళ్తారు? పోలీసులు మిమ్మల్ని పోల్చి పట్టుకుంటారు!"

"నేను వేషం మార్చానుగా! నా పేరు వెంకటరాజా. ఈ రూపంలో యెవరేనా నేను గజపతిని అనుకుంటారా? చూడండి నన్ను!"

అప్పుడు రజనీకాంత్ అతడిని పరీక్షగా చూశాడు. పంచ, జుబ్బాలో వున్నాడతను. అమెరికన్ క్రాపు

మాయమైంది. మధ్యపాపిడి క్రాపు. నుదురుమీద పెద్ద బొట్టు. గుబురుగా పెరిగిన మీసాలు.

"మిమ్మల్ని పోల్చలేరు" అన్నాడు రజనీకాంత్.

"వేషాలుమార్చడంలో నేను ఎక్స్పర్ట్ని. అవుసరాన్ని బట్టి వేషాలు మారుస్తూ వుంటాను" అన్నాడు గజపతి.

ఆ నాటి రాత్రి అందరూ భోజనాలు చేస్తున్నారు. రామ్మూర్తి తన అల్లుడివైపు చూశాడు.

"నీ మావయ్య రాలేదే?" అడిగాడతను.

"మావయ్య కాన్సర్తో బాధపడ్తున్నాడు. త్వరలో బొంబే వెళ్తున్నాడు. అక్కడ యెక్కడుండాలా అని అతడు ఆలోచిస్తున్నాడు" అన్నాడు రజనీకాంత్.

"మన ఫ్లాట్ వుందిగా, అక్కడ వుండమను. ఆ ఫ్లాట్కి అతడు కాపలాగా కూడా వుంటాడు" అన్నాడు రామ్మూర్తి.

"అది నేను ఆలోచించలేదు" అన్నాడు రజనీకాంత్ నవ్వుతూ.

"అక్కడతను వండుకు తినొచ్చు. అన్నీ వున్నాయి. మేం తిరిగి వెళ్ళినదాకా అతడు అక్కడే వుండొచ్చు" అన్నాడు రామ్మూర్తి.

"రేపు మావయ్యతో చెప్తాను. అతడు వుంటాడో లేదో! అతడికి మొహమాటం ఎక్కువ!" అన్నాడు రజనీకాంత్.

"మనలో మనకి మొహమాటమేమిటి? నీ మావయ్య మాకూ కావలసినవాడే" అన్నాడు రామ్మూర్తి.

"అలాగే అతడిని వుండమంటాను" అన్నాడు రజనీకాంత్.

# 7

ఏరో డ్రోమ్‌కి గజపతి చేరుకున్నాడు. అతడి చేతిలో ఏర్ బాగ్ వుంది. స్టీరింగ్ వీల్ వెనుక కూర్చున్న రజనీ కాంత్ వైపు అతడు నవ్వుతూ చూశాడు.

"మైడియర్ ఫ్రెండ్, మీకు చాలా థాంక్స్! మీరు చెప్పినట్లు అంతా చేశారు" అన్నాడు గజపతి.

"నే వెళ్ళనా?" అడిగాడు రజనీకాంత్.

"వెళ్ళండి."

"మీరు మారి బాగుపడ్తే నేను చాలా సంతోషిస్తాను" అన్నాడు రజనీకాంత్.

గజపతి జవాబివ్వలేదు. కారు వెనక్కు తిరిగి వెళ్ళి పోయింది. గజపతి ఏర్ పోర్టులోకి వెళ్ళాడు.

మఫ్టీలో వున్న ఒక సి.ఐ.డి. అతడిని ఆపాడు. అతడి వైపు పరీక్షగా చూశాడు.

"మీ పేరు?"

"వెంకటరాజు" అన్నాడతను.

"మీరు ఎక్కడికి వెళ్తున్నారు?"

"బొంబేకి. నేను కాన్సర్ రోగిని. టాటా హాస్పిటల్‌కి వెళ్ళి చూపించుకోవాలి" అన్నాడతను.

తన పర్సులోంచి తీసి ఒక డాక్టర్ రిపోర్టును అతడు చూపించాడు. దాన్ని జాగ్రత్తగా అతడు చదివాడు.

"మీరు వెళ్ళొచ్చు సార్" అన్నాడు మఫ్టీలో వున్న సి.ఐ.డి. ఆఫీసర్.

ప్లేనులో గజపతి బొంబేకి వెళ్ళాడు. ఆటోలో పటేల్ రోడ్డులో వున్న ఆ ఫ్లాట్‌కు చేరుకున్నాడు.

33 వ ఫ్లాట్ మొదటి అంతస్తులో వుంది. అతడు మెట్లెక్కి పైకి వెళ్ళాడు. 33 వ ఫ్లాట్ ముందుకు నడిచాడు.

తాళాన్ని తెర్చాడు.

ఎదురుగా వున్న ఫ్లాట్ లోంచి ఒక వ్యక్తి అతడివైపు అనుమానంగా చూశాడు. అతడు గజపతి దగ్గరకు వచ్చాడు.

“మిస్టర్! యెవరు మీరు?” అడిగాడు ఎదుటి ఫ్లాట్ మనిషి.

“నా పేరు వెంకటరాజు. నేను కాన్సర్ రోగిని. మద్రాసు నుంచి వచ్చాను. రామ్మూర్తిగారు నా చుట్టం” అన్నాడతను.

“ఎలా?”

“రామ్మూర్తిగారి అల్లుడు రజనీకాంత్ నా మేనల్లుడు. రామ్మూర్తిగారూ, శాంతమ్మగారూ మద్రాసులోనే వున్నారు. రామ్మూర్తిగారు ఈ తాళంచెవులు నాకిచ్చి వాళ్ళు తిరిగి వచ్చిందాకా యిక్కడ వుండమన్నారు” అన్నాడు గజపతి.

అతడు తీయగా నవ్వాడు.

“ఇదంతా మిమ్మల్ని అడిగినందుకు క్షమించండి. వెళ్ళేముందు తన ఫ్లాట్ వైపు చూస్తూ వుండమని ఆయన అన్నారు. అందుకని వచ్చాను” అన్నాడతను.

“తమ పేరు?”

“డింబారావు ఆడిక్” అన్నాడతను.

“మళ్ళా కల్సుకుందాం” అని గజపతి ఫ్లాట్ లోపలకు నడిచాడు.

ఫ్లాట్ అఖండంగా వుంది. మూడు పడగ్గదులు. విశాలమైన హాలు. చక్కటి యటాచ్డ్ బాత్ రూమ్స్!

ఒక పడగ్గదిలో అతను తన ఏర్ బాగ్ ను టేబుల్ మీద పెట్టాడు. వంటగదిలోకి వెళ్ళాడు. వంటగది చాలా

నీట్‌గా వుంది. గాస్ స్టవ్, గాడ్‌రెజ్ రిఫ్రిజిరేటర్, సుమిత్ మిక్సీ అన్నీ అక్కడున్నాయి.

"తలదాచుకోడానికి ఫైన్ ప్లేస్" అనుకున్నాడు అతడు తనలో తాను.

అతడికి బాగా ఆకలిగా వుంది. అతడు బయటకు వెళ్ళి ఫ్లాట్‌ను లాక్ చేశాడు. అర గంటలో తిరిగి వచ్చాడు.

రెండు విస్కీ బాటిల్స్‌ను టేబుల్ మీద వుంచాడు. గాస్‌స్టవ్ వెలిగించి బ్రెడ్ స్లయిసెస్‌ను కాల్చాడు. జామ్‌తో కలిపి ఆరు స్లయిసెస్‌ను తిన్నాడు. ఆకలి తీరింది.

అతడు టైము చూశాడు. ఐదు అవుతోంది. ఆలో చినా అతడు బయటకు నడిచాడు. ఫ్లాట్‌ను లాక్ చేశాడు. మెట్లమ్మట కిందకు దిగి, గేటుదాటి రోడ్డమ్మట నడవసాగాడు.

# 8

సందులమ్మట నడిచి అతడు ఒక యింటి ముందు ఆగాడు. కాకా కలేల్కర్ పేరుతో ఒక ప్లాస్టిక్ బోర్డు తలుపుకుంది.

అతడు తలుపు తట్టాడు. తలుపు తెరవబడింది. యాభైయేళ్ళ మనిషి అతడివైపు పరీక్షగా చూశాడు.

"మీకేం కావాలి?" ప్రశ్నించాడతను.

"మద్రాసు నుంచి గజపతి నన్ను పంపాడు" అన్నాడతను.

"రండి లోపలకు" అన్నాడతను.

అతడు లోపలకు వెళ్ళగానే కలేల్కర్ ముందు

తలుపును మూసేశాడు. లోపలున్న ఒక ఏర్ కండిషండ్ గదిలోకి వాళ్ళు వెళ్లారు.

కలేల్కర్ అతడిని కూర్చోమన్నాడు. అతడు కుర్చీలో కూర్చున్నాడు.

"గజపతి ఎలా వున్నాడు?" అడిగాడతను.

అతడు నవ్వాడు.

"కలేల్కర్, నువ్వు నన్ను పోల్చలేదు. గజపతి నేనే!" అన్నాడతను.

"పేపర్లలో నీ గురించి చాలా చదివాను. తలదాచుకోవాలని బొంబాయే వచ్చావనన్నమాట!" అన్నాడతను.

"యూ ఆర్ రైట్! నాకొక జర్మన్ లేక అమెరికన్ పిస్టల్ కావాలి" అన్నాడు గజపతి.

అతడు ఒక స్టీలు బీరువా తెరిచి కొన్ని పిస్టళ్ళను టేబులు మీద పడేశాడు.

"ఆరు రకాలు. ఏది కావాలో చూసుకో! ఇది బెస్టు. అమెరికన్ థామ్సన్ పిస్టల్. 25 సార్లు షూట్ చేయొచ్చు. తర్వాత మాళ్ళీ ఫిల్ చేయాలి!"

"ఎంతిది?"

"ఐదు వేల ఐదువందలు."

"అంత డబ్బు నా దగ్గర లేదు."

"ఎంతివ్వగలవు?"

"ప్రస్తుతం రెండు వేలివ్వగలను."

"అది అడ్వాన్స్‌గా యిచ్చి తీసుకెళ్ళు. తతిమ్మాది నెలలోపల యివ్వాలి."

గజపతి నవ్వాడు.

"ఇరవై నాలుగ్గంటల్లో యిస్తాను" అన్నాడు గజపతి.

థామ్సన్ పిస్టల్ని అతడు తన బాగ్‌లో పడేసు

కొన్నాడు. రెండు వేలు తీసి అతడికిచ్చాడు.

"ఇంతవరకూ నా దగ్గర కొన్నవన్నీ పోయేయా?"

"కొన్ని పాడయిపోయాయి. కొన్ని పోలీసుల చేతిలో పడ్డాయి" అన్నాడు గజపతి.

ఫ్లాస్కులోని టీ రెండు కప్పుల్లో పోశాడు కలేల్కర్. ఇద్దరూ హాట్ టీ తాగారు.

"నిన్ను చూసి చాలా కాలం అయింది" అన్నాడు కలేల్కర్.

"ఈసారి యిక్కడకు రావడానికి చాలా భయపడ్డాను" అన్నాడు గజపతి.

"మరేం ఫరవాలేదు. చేతిలో డబ్బున్నంత కాలం మనుషులను కొనొచ్చు" అన్నాడు కలేల్కర్.

అతడి మాటలు గజపతికి అర్థమయ్యాయి. తొందరగా తనూ డబ్బును సంపాదించాలి!

"యీ పిస్టల్ని షూట్ చేసి చూడాలి" అన్నాడు గజపతి, బాగ్‌లోంచి పిస్టల్ని పైకి తీస్తూ.

"టెస్టు చేద్దాం పద!" అన్నాడు కలేల్కర్.

ఇద్దరూ వెనక నున్న హాల్లోకి వెళ్లారు. సౌండ్ ప్రూఫ్, ఏర్ కండిషండ్ హాలు. గోడవారగా టార్గెట్లు అమర్చబడ్డాయి.

గురిచూసి ఒక టార్గెట్ వైపు గజపతి షూట్ చేశాడు. రబ్బరుబంతి తునాతునకలైంది.

"ఫైన్ పిస్టల్" అన్నాడు గజపతి.

"నువ్వు దాన్ని ప్రేమిస్తావు!" అన్నాడు కలేల్కర్ నవ్వుతూ.

"దీనికి సైలెన్సర్ అమర్చవచ్చుగా?"

"బ్రహ్మాండంగా! బాలన్సు యిచ్చాక సైలెన్సర్

విషయం మాట్లాడుదాం" అన్నాడతను.

"ఆల్ రైట్, వెళ్తాను" అని గజపతి బయటకు నడిచాడు.

ముందు తలుపు మూయబడింది. గజపతి సందమ్మట వేగంగా నడవసాగాడు.

ఆ సందులో అంత విలువైన స్మగుల్డు ఆయుధాలను అమ్మతారని యెవ్వరూ వూహించరు. ఆలోచిస్తూ గజపతి మెయిన్ రోడ్డుకు చేరుకున్నాడు.

రోడ్డమ్మట పోతున్న ఆటోని ఆపి ఎక్కాడు.

"ఎక్కడికి సార్?"

"మాతుంగావైపు పోనీ" అన్నాడతను.

ఆటో దూసుకుపోయింది.

# 9

రోడ్డుదీపాలు వెలుగుతున్నాయి అతడు రోడ్డువారగా నడుస్తున్నాడు.

టైమ్ పది దాటింది. రోడ్డుమీద జనసంచారం ఎక్కువగా లేదు.

వెనుక నుంచి యేదో కారు వస్తోంది. అతడు మెల్లిగా రోడ్డు మధ్యకు జరిగాడు. మధ్యలో నడుస్తున్నాడు. నాలుగుసార్లు కారు హారన్ మ్రోగింది.

అతడు కదల్లేదు. వెనకనే కారు ఆగింది.

"చావాలని కోరికగా వుందా?" అర్చిందో యువతి కారులోంచి.

వెనుదిరిగి అతడామెవైపు పరుగెత్తాడు. తలుపు తెర్చి ఆమె చేయిని పట్టుకున్నాడు.

"యూ రాస్కెల్, లీవ్ మీ?" అర్చిందామె.

అతడాను తోసి కారు యిగ్నిషన్ కీని లాక్కు

న్నాడు. తలుపు మూసి అటువైపుకు వెళ్ళి పక్కనే కూర్చున్నాడు.

కారు కీని యథాస్థానంలో వుంచాడు.

"ఇప్పుడు కారు పోనీ!" అన్నాడతను.

"కిందకు దిగు!"

అతడు కదల్లేదు.

"నే నెవరో తెలుసా?"

"తెలియదు."

"మిస్ జుబేదాని. హోటల్ డ్రీమ్‌లాండ్‌లో నా కాబ్రే డాన్సులు చూడ్డానికి మంత్రులు కూడా వస్తుంటారు. క్షణంలో నిన్ను అరెస్టు చేయగలను" అందామె.

అతడు పరిహాసంగా నవ్వాడు.

"నన్ను అరెస్టు చేయించగల్గిన క్షణం నీకు దొరకదులే!" అన్నాడతను.

పక్కనుంచి యేదో జీప్ దూసుకుపోయింది. ఆమె అరవబోయింది. అమాంతంగా అతడామె నోరును నొక్కేశాడు. తలమీద పిస్టల్ పిడితో కొట్టాడు. ఆమె అతడిమీదకు ఒరిగిపోయింది.

ముందు సీటుమీద ఆమెను పడుకోబెట్టి అతడు దిగి తలుపు మూశాడు. ముందునుంచి తిరిగివెళ్ళి స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు.

కారును పోనిచ్చాడు. కాబ్రే డాన్సర్ జుబేదా హోటల్లో డాన్సు చేయకుండా యిలా యెందుకు కార్లో వెళ్తోంది? అతడు ఆలోచిస్తున్నాడు.

అతడు సిగరెట్ పీలుస్తున్నాడు. ఒక బార్‌లో తాగిన విస్కీతో నిషాగా వుంది.

నిర్మానుష్యంగా వున్న ఒకచోట అతడు కారును

ఆపాడు. కారులోపల లైట్‌ను అతడు ఆన్ చేశాడు. ఆమెవైపు చూశాడు. ఆమె స్పృహతప్పి పడుంది. ఆమె క్రిందున్న హేండ్ బాగ్‌ను లాగి, తెర్చి చూశాడతను.

అందులో నోట్లకట్ట లున్నాయి. వేగంగా లెక్క పెట్టాడు. ఇరవై వేలు! ఆ డబ్బును అతడు తన బాగ్‌లో పడేసుకున్నాడు. క్రిందకు దిగాడు.

కారు ప్రక్కనే నిలబడి క్షణకాలం ఆలోచించాడు. ఆమె తనను చూసింది. పోలీసులకు తనని గురించి చెప్తుంది. ఆ అవకాశం ఆమెకుండకూడదు!

అతడామెమీదకు వంగాడు. ఆమె బాగ్‌ను ముక్కు మీద పెట్టి బలంగా నొక్కాడు. నొక్కి అలాగే వుండిపోయాడు. ఊపిరాడక ఆమె అల్లల్లాడి చివరకు నిర్జీవంగా వుండిపోయింది. అతడామెవైపు పరీక్షగా చూశాడు.

స్టీరింగ్ వీల్‌ని రుమాల్తో తుడిచాడు. కారు తలుపులను తుడిచాడు. కారు లోపల లైటును ఆఫ్ చేశాడు. అక్కడినుండి వడివడిగా నడిచి వెళ్ళిపోయాడు.

అరగంటసేపు నడిచాక మరో రోడ్డుమీద ఆటో దొరికింది. అతడు అందులో కూర్చుని వెళ్ళాడు. మరో రెండు ఆటోలు మారి చివరకి యింటికి దూరంగా అతడు దిగాడు.

తనుండే ఫ్లాట్‌వైపు మెల్లిగా నడిచాడు. తోవలో యిరానీ హోటల్ కనిపించింది. అతడు లోపలకు వెళ్లాడు. చికెన్ బిర్యానీ, మటన్ చాప్స్ పాక్ చేయించి తీసుకున్నాడు. డబ్బు చెల్లించి తన ఫ్లాట్‌వైపు వేగంగా కదిలాడు.

మెట్లెక్కి అతడు తాళాన్ని తెర్చాడు.

"మీరా?" అన్నారెవరో.

అతడు ఉలిక్కిపడ్డాడు.

ఎదుటి ఫ్లాట్‌లో వుండే డింబాగావు అడిక్ గుమ్మంలో నిలబడి వున్నాడు.

అతడు అడిక్ వైపు నవ్వుతూ చూశాడు.

"హాస్పిటల్లో లేటయిపోయింది. వెయ్యి టెస్టులు! అవి పూర్తయ్యేసరికి మనుషులు చస్తారు...." అన్నాడతను.

అతడు లోపలకు వెళ్ళబోయాడు.

"రామ్మూర్తిగారు నాతో ఫోన్‌లో ఇవాళ మాట్లాడారు" అన్నాడతను.

"ఏమన్నారాయన?"

"బొంబేకి మీరు కొత్తవారని చెప్పి మీకన్నివిధాలా సహాయపడమన్నారు. మీకేదేనా కావలిస్తే నన్ను అడగండి."

"థాంక్స్ మీకు. కావలిస్తే అడుగుతాను" అని అతడు లోపలకు వెళ్ళి తలుపు మూసి లాక్ చేశాడు.

తన పడగ్గదిలోకి వెళ్ళాడు. స్విచ్ నొక్కాడు. ఫ్లోరసెంట్ లైటు వెలిగింది.

గ్లాసులో విస్కీ పోసుకుని, చల్లటి నీళ్ళు కలిపి గడగడ తాగేశాడు. టైమ్ చూశాడు. పదకొండున్నర అయింది.

గంటపాటు అతడు విస్కీ తాగుతూ కూర్చున్నాడు. స్వర్గంలో ఉంటున్నట్లుంది. సిగరెట్ పీలుస్తూ అతడు తాగుతున్నాడు. అతడికి తన గతం గుర్తుకొస్తోంది.

అతడు బాంకులో ఉద్యోగం చేసేవాడు. అహల్యను పెళ్ళాడాడు. ఆమె సొంతగానో ప్రేమించాడు. ఆమె

మేనమామ గోపీ తరచు తనింటికి వస్తూ ఉండేవాడు. మేనమామ ఎందుకంతగా వస్తున్నాడో ఒక రోజున అతడికి తెలిసిపోయింది.

వంటగదిలో పెనవేసుకుని పడుకొని వున్న వాళ్లిద్దరూ అతడి కళ్ళకు విష సర్పాల్లా కనిపించారు. కత్తితో పొడిచి, పొడిచి అతడు వాళ్ళిద్దర్నీ చంపేశాడు.

వాళ్ళ కేకలు విని ఎందరో ముందు తలుపును కొట్టసాగారు. అతడు పెరట్లోకెళ్ళి గోడమీకి పారిపోయాడు. స్టేషన్‌లో సిద్ధంగా వున్న మెయిల్ ఎక్కి మద్రాసు చేరుకున్నాడు.

మద్రాసులో ముగ్గుర్ని చంపి డబ్బు దోచుకుని అతడు బొంబేకి వెళ్ళిపోయాడు, తనలా దోపిడీలు చేసేవాళ్ళకు మంచి ఆయుధాలు కావాలి. కలేక్కర్‌తో అతడికి పరిచయమయింది. అతడు రెండు పిస్టల్సు కొన్నాడు.

బొంబేనుంచి హైద్రాబాదుకు వెళ్లాడు. అక్కడున్న ఒక హోటల్లో మద్రాసు పోలీసులు అతడిని అరస్టుచేసి తీసుకుపోయారు.

మళ్ళా తప్పించుకుని అతడు బయటపడ్డాడు. ఇప్పుడు మళ్ళా అతడు బొంబేలో వున్నాడు!

అతడు గ్లాసులో ఎక్కువగా విస్కీ పోసుకుని, నీళ్ళు కలిపి తాగేశాడు. హోటల్‌నుంచి తను తెచ్చిన పాకెట్ విప్పాడు.

ఆకలిగా అతడు బిర్యానీ తిన్నాడు. మటన్ చాప్సను నమిలేశాడు. మంచినీళ్ళు తాగి, మెల్లిగా పరుపుమీద వాలాడు.

క్షణంలో అతడికి నిద్రపట్టేసింది.

అదే సమయంలో మోటర్ సైకిల్ మీద వెళ్తూన్న

ఒక సార్జంట్ రోడ్డు వారగా ఉన్న కారును చూసి ఆగాడు.

కారు దగ్గరకు వెళ్లాడు. లోపలి లైటు ఆన్ చేసి చూశాడు.

ముందు సీటుమీద ఆమె వెల్లకిలా పడుకుని ఉంది. ఆమెలో ప్రాణంలేదు!

ఆమెను ఎక్కడో చూసినట్లు అతడికి అనిపిస్తోంది. ఎవరామె? కొంతసేపైనాక గురుతొచ్చింది. కాబ్రే డాన్సర్ జుబేదా! హోటల్ డ్రీమ్‌లాండ్‌లో డాన్స్ చేస్తూ వుంటుంది. పత్రికల్లో యిచ్చే ప్రకటనల్లో ఆమె ఫొటోను ఆ హోటలు వాళ్ళు వేయిస్తూ ఉంటారు.

అక్కడున్న హేండ్ బాగ్‌ను అతడు చూశాడు. అందులో యెక్కువగా డబ్బులేదు.

అతడు తలుపు మూశాడు. మోటర్ సైకిల్ మీద కూసుకుపోయాడు. ఒక షాపులోకి వెళ్ళి పోలీసులకు రిపోర్టిచాడు.

ఇన్‌స్పెక్టర్ చవాన్ అటువైపునుంచి మాట్లాడాడు. కారు దగ్గర సార్జంటును ఉండమని ఇన్‌స్పెక్టర్ చవాన్ హెచ్చరించాడు. తను వెంటనే వస్తున్నానన్నాడు.

## 10

గజపతి మేలుకునేసరికి ఏడు దాటింది. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి అతను మొహం కడుక్కున్నాడు. తన మీసాలను పూర్తిగా తీసేశాడు.

జుత్తును తనే పొట్టిగా కత్తిరించేసుకున్నాడు. పాంట్, స్లాక్ ధరించాడు. ఎడం పాపిడితీసి క్రాపును కూడా అతడు మార్చాడు.

బయటకు వెళ్ళాడు. తాళంవేసి మెట్లమ్మట కిందకు

పరుగెత్తాడు. ఫర్లాంగు దూరంలో ఉన్న న్యూస్ పేపరు మార్టుకు వెళ్ళి, మూడు దినపత్రికలను కొన్నాడు.

సమీపంలో వున్న కాఫీ బార్‌లో కూర్చుని హాట్ కాఫీ ఆర్డరిచ్చాడు.

మొదటి పేజీలో జుబేదా హత్య గురించి పెద్ద అక్షరాల్లో యివ్వబడింది. కాబ్రే డాన్సర్ కిల్డ్ అని ఒక పత్రిక పెద్ద హెడ్‌లైన్ యిచ్చింది.

కాఫీ వచ్చింది. అతడు వేగంగా కాఫీ తాగాడు. మరో కాఫీ ఆర్డరిచ్చి పత్రికలను అతడు పూర్తిగా చూడసాగాడు.

"డ్రీమ్‌లాండ్ హోటల్లో కాంట్రాక్టుమీద డాన్స్ చేసే మిస్ జుబేదాను యెవరో నిన్న రాత్రి హత్య చేశారు. సార్జంట్ శేఖర్ ఆమె శవాన్ని మొదటి సారిగా చూశాడు. అతడి రిపోర్టు అందగానే ఇన్‌స్పెక్టర్ చవాన్, పోలీసు కుక్కలతో సహా అక్కడకు చేరుకున్నాడు.

"పదకొండు ప్రాంతంలో ఆమె మరణించి వుంటుందని పోలీసు డాక్టర్ అంచనా. ఆ రోడ్డుమీద జన సంచారం ఎక్కువగా ఉండదు. హత్యచేసిన వ్యక్తి ఆ కారు దగ్గర నుంచి యెక్కడికో వెళ్ళిపోయి ఉండాలి. హంతకుడి కోసం పోలీసులు వెతుకుతున్నారు.

"హోటల్ డ్రీమ్‌లాండ్ మేనేజర్ కైలాస్‌ని యిన్‌స్పెక్టర్ చవాన్ కలుసుకుని ప్రశ్నించాడు. క్రితం రాత్రి మూడు డాన్స్ నంబర్లలో మాత్రం పాల్గొని ఆమె యింటికి వెళ్ళిపోయింది. తన తల్లి ఆరోగ్యం బాగా లేనందువలన ఆమె ముందుగా వెళ్ళిపోయింది. ఆమె బాగ్‌లో ఇరవై వేలు ఉండాలని, ఆ క్యాష్ ఆమెకు తను

స్వయంగా యిచ్చినట్లు మేనేజర్ చెప్పాడు. ఆమె హేండ్ బాగ్‌లో అంత కాష్ లేదు. కొంత చిల్లర మాత్రం ఉందని పోలీసులు అంటున్నారు. డబ్బుకోసం ఈ హత్య జరిగి ఉండొచ్చని పోలీసులు అభిప్రాయపడు తున్నారు."

తతిమ్మా పత్రికలు చూశాడతను.

"పక్కల మూలంగా పోలీసులకు ఒక క్లూ దొరికింది. హంతకుడు ఎటువైపు పోయినదీ వాళ్ళు కనుక్కున్నారు. ఆ ప్రాంతాల్లో దర్యాప్తు సాగిస్తున్నారు" అని ముద్రించి వుంది మరో పత్రికలో.

ఒక పత్రికా విలేఖరి మరో దిన పత్రికలో యొంతో రాశాడు.

"జనసంచారంలేని ఆ రోడ్డుమీద ఇటువంటి ఘోరాలు ఇంతకుముందు ఎన్నో జరిగాయి. డబ్బుకోసం ఈ హత్య జరిగి వుంటే ఆమె మెళ్ళో వున్న బంగారం గొలుసును హంతకుడు ఎందుకు వదిలేశాడు? ఆమె వేలికి వుంగరం కూడా వుంది. అతడు రొక్కాన్ని మాత్రం పట్టుకు పోయాడు.

"అక్కడకు వెళ్ళి నేను దర్యాప్తు చేయగా ఆ సమ యంలో పంచ, జుబ్బా ధరించినతను ఆ రోడ్డువైపు నుంచి రావడం ఒక లాటరీ టికెట్లు అమ్మే అతను చూశానని చెప్పాడు. ఆ వ్యక్తికోసం పోలీసులు వెతుకు తున్నారు."

బేరర్ తెచ్చిన కాఫీని అతడు తాగాడు. బిల్లు చెల్లించి బయటకు నడిచాడు. ఆలోచిస్తూ అతడు రోడ్డమ్మట నడుస్తున్నాడు.

ఇటువైన పంచ, జుబ్బా తను ధరించకూడదు. కొంత

కాలంపాటు తను బయటకు రాకూడదు. ఫ్లాట్‌లోనే వుండిపోవాలి!

అతడు తన ఫ్లాట్‌కు చేరుకున్నాడు. ఎదుటి గుమ్మంలో డింబారావు ఆడిక్ లేనందుకు అతడు సంతోషించాడు.

అతడు లోపలకెళ్ళి తలుపు మూసుకున్నాడు. పడగదిలోకి నడిచాడు. ఒళ్ళు వేడెక్కి చమట కారోంది. అతడు ఫాన్ స్విచ్ నొక్కాడు. చల్లటి గాలి వీస్తోంది.

సోఫాలో కూర్చుని అతడు పత్రికలను మళ్లా చూడసాగాడు.

# 11

రామ్మూర్తి తన కూతురివంక సూటిగా చూశాడు.

"అమ్మాయి, అల్లుడు నాతో ముభావంగా వుంటున్నాడు. అతడిలో ఏదో మార్పు నాకు కనిపిస్తోంది. ఏమైంది?" అడిగాడతను.

"ఆయనలో మార్పు నేనూ చూశాను, నాన్నా. రాత్రి గదిలోకొచ్చి వెంటనే పడుకుంటున్నారు. ఏమిటి అయిందంటే చెప్పరు" అందామె.

రామ్మూర్తి నవ్వుకున్నాడు.

"అది నేనే కనుక్కొంటానులే" అన్నాడతను.

ఆ నాటి రాత్రి అతడు రజనీకాంత్‌ని తన గదికి రమ్మన్నాడు. అతడు గదిలోకొచ్చాడు.

"కూర్చో, నాయనా" అన్నాడు రామ్మూర్తి.

అతడు కూర్చోలేదు. రామ్మూర్తివైపు సీరియస్‌గా చూశాడు.

"ఏం కావాలో చెప్పండి. టైర్డ్‌గా వుంది" అన్నాడతను.

రామ్మూర్తి అతడి వంక సూటిగా చూశాడు.

"నువ్వెంతగా యెందుకు అలిసిపోతున్నావు?"

అతడు జవాబివ్వలేదు.

"నాతో చెప్పు! మనసులో ఏదో ఉంచుకుంటే నీ జీవితం పాడవుతుంది."

రజనీకాంత్ సోఫాలో కూర్చున్నాడు. మావవైపు చూశాను. అమాంతంగా అతడి కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"ఏమైందో చెప్పు! నేనేదేనా తప్పుచేశానా?" అడిగాడు రామ్మూర్తి.

"తప్పు చేసింది మీరు కాదు, నేను సార్" అన్నాడు రజనీకాంత్.

"ఏం చేశావు?"

"మీతో నేనెన్నడూ అబద్ధం చెప్పలేదు. ఈసారి అబద్ధం చెప్పవలసి వచ్చింది."

"ఏమిటది?"

"బొంబేలోని మీ ఫ్లాట్‌కు వెళ్ళినతను నా మావయ్య వెంకటరాజు కాదు. నా మేనమామని మీతో అబద్ధమాడాను."

"ఎవరతను?"

"అతడో హంతకుడు! పెట్రోలు బంక్ దగ్గర ఒక కానిస్టేబుల్ని చంపి అతడు పారిపోతూ యీ యింట్లో చేరాడు. చాలా రోజులనుండి ఇక్కడే ఉంటూ వచ్చాడు' అతడిని వదిలించుకోడం కోసం మీతో అబద్ధమాడి బొంబే పంపేశాను."

"చాలా మంచి పని చేశావు! అతడి మూలంగా ఇక్కడి వాళ్ళకు ప్రమాదం లేకుండా చేశావు. అది మంచిదేగా?" అడిగాడు రామ్మూర్తి.

"కాని ఆ ఫ్లాట్‌లో అతను ఏం చేస్తున్నాడో!"

"డోంట్ వర్రీ, నా ఫ్లాట్‌లో అతడు ఏమీ చెయ్యలేడు. పట్టుకుపోడానికి అక్కడ నోట్లకట్టలు లేవు. నా డబ్బు బ్యాంకులో ఉంది. ఆ హంతకుడిని సరైనచోట బంధించావు. ఇప్పుడతడిని పోలీసులు క్షణంలో పట్టుకోవచ్చు" అన్నాడు రామ్మూర్తి.

అతడి మాటలు విన్నాక రజనీకాంత్‌లో వుషారు పుట్టుకొచ్చింది.

"అతడికి నామీద బాగా నమ్మకం వుంది. అతడు అక్కడే వుంటాడు. అతడి గురించి మనం ఏం చేయాలి?"

రామ్మూర్తి సోఫాలోంచి లేచాడు. టెలిఫోన్ దగ్గరకు నడిచాడు రిసీవర్ ఎత్తి బొంబేకి ఎస్. టి. డి. కాల్ చేశాడు.

"డింబారావు ఆడిక్ హియర్" అందో కంఠం అటువైపునుంచి.

"నేను రామ్మూర్తిని, మా చుట్టం వెంకటరాజు నా ఫ్లాట్‌లో ఉన్నాడా?"

"ఉన్నాడు, సార్."

"నేను ఫోన్ చేసినట్లు అతడికి చెప్పకు. అతడు ఆ ఫ్లాట్ వదిలి ఎక్కడకూ పోకుండా చూడు!"

"అలాగే చూస్తాను, సార్" అన్నాడతను.

రామ్మూర్తి రిసీవర్‌ని పెట్టేశాడు. అల్లుడివైపు ఓసారి చూసి అతడు బొంబేకి మరో ఎస్.టి.డి. కాల్ చేశాడు.

"ప్లీస్ వెయిట్" అందో కంఠం.

ఓ నిమిషం తర్వాత ఒక గంభీర కంఠం అటువైపు

ధ్వనించింది.

"పోలీసు కమీషనర్ సవార్కర్ హియర్!"

"నేను రామ్మూర్తిని. మద్రాసు వచ్చాను అమ్మాయిని చూడ్డానికి. ఇక్కడనుంచి మీతో మాట్లాడుతున్నాను. నా ఫ్లాట్‌లో ఒక హంతకుడు తలదాచుకున్నాడు. అతడిని వెంటనే అరస్టు చేయండి" అన్నాడతను.

"ఎవరతను?"

"ఆగండి ప్లీజ్" అని రామ్మూర్తి అల్లుడితో మాట్లాడాడు.

"అతడి పేరు గజపతి! మద్రాసులో ఒక కానిస్టేబుల్ని హత్య చేసింది అతనే. పంచ, జుబ్బా ధరించి మారువేషంలో అతడు బొంబే వెళ్ళి నా ఫ్లాట్‌లో చేరాడు."

"గుడ్ హెవన్స్, మిస్ జుబేదాని అతడే చంపి వుండాలి" అన్నాడు సవార్కర్.

"అతడు మొదట నా అల్లుడి యింట్లో చేరాడు. అతడికి భయపడి అల్లుడు యేమీ చెయ్యలేకపోయాడు. అతడు బొంబేకి పారిపోయాడు. వెంటనే మీకు రిపోర్టు యిస్తున్నాను" అన్నాడు రామ్మూర్తి.

"నేనే స్వయంగా వెళ్ళి అరెస్టు చేస్తాను. థాంక్స్ ఎలాట్ ఫర్ ది టిప్!"

రామ్మూర్తి రిసీవర్ పెట్టేశాడు. విజయవంతంగా అల్లుడివైపు చూశాడు.

"అతడిని నా ఫ్లాట్‌కి పంపడం నువ్వు చేసిన మంచి పని. కాస్సేపట్లో పోలీసులు అతడిని అరస్టు చేస్తారు" అన్నాడు రామమూర్తి.

# 12

కలేల్కర్‌కి డబ్బు చెల్లించి గజపతి తన ఫ్లాట్‌కు తిరిగివచ్చాడు. తాళం తెరుస్తుండగా ఎదుటి ఫ్లాట్‌లో వుండే ఆడిక్ అతడిని పలకరించాడు.

"మీరా, వెళ్ళండి" అన్నాడు ఆడిక్.

వుషారుగా గజపతి లోపలకు వెళ్ళాడు.

వులిక్కిపడ్డాడు. ఎదురుగా ఆరుగురు పోలీసులు పిస్టల్సుతో రెడీగా వున్నారు. పోలీసు కమీషనర్ సవార్కర్ అతని భుజంమీద చెయ్యివేశాడు.

"మిస్టర్, ఏమిటిదంతా?" అన్నాడు గజపతి.

"నిన్ను అరెస్టు చేస్తున్నాం! కాన్‌స్టేబుల్ కరుపయ్యను హత్య చేసినందుకు. అంతేకాదు. ఈ పట్నంలో మిస్ జుబేదాను చంపినందుకు!" అరిచాడు కమీషనర్ సవార్కర్.

"ఇదంతా నాకర్థం కావడంలేదు. నేనొక కేన్సర్ పేషెంటుని...."

"షటప్, యూ డర్టీ కిల్లర్! రజనీకాంత్ మావ రామ్మూర్తిగారు నువ్విక్కడున్నావని చెప్పి మాకెంతో సహాయపడ్డారు."

"ద్రోహులు!" అరిచాడు గజపతి.

అతడి చేతిలోవున్న బాగ్‌ను ఇన్‌స్పెక్టర్ చవాన్ లాక్కున్నాడు. అందులో వున్న థామ్సన్ పిస్టల్ని పోలీసు కమీషనర్‌కి చూపించాడు.

"నాకు గురువులైన రామ్మూర్తిగారు ఫోన్ చేసి వెంటనే చెప్పకపోతే మరికొన్ని హత్యలు బొంబే పట్నంలో జరిగుండేవి. అరెస్టుహిమ్!" అన్నాడు సవార్కర్.

ఇన్‌స్పెక్టర్ చవాన్ అతడి చేతులకు బేడీలు వేశాడు.

"అతడిని తీసుకుపొండి" అర్చాడు కమీషనర్ సవార్కర్.

నలుగురు పోలీసులు గజపతిని బయటకు లాక్కుపోయారు.

—:అ యి పో యిం ది:—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

అక్కడినించీ చిన్న చిన్న గుడిసెలు కనిపించటం మొదలుపెట్టాయి. ఆ ఇళ్ళ ముట చిన్న చిన్న పిల్లలు నిలబడి వరుసగా నడిచివస్తున్న నాగరిక మనుషులను వింతగా చూస్తూ కిచకిచలాడటం మొదలుపెట్టారు.

కొన్ని సెకన్లు మాత్రమే గడిచాయి.

పూర్తిగా గూడెంలోకి ప్రవేశించారు.

అప్పుడే అప్పటివరకు ఆ వెలుగు గురించి వాళ్ళు ఫీలవుతున్న సస్పెన్స్—టెన్షన్ పటాపంచలయ్యింది.

ఆ వెలుగేమిటో తెలియగానే వాళ్ళ గుండెలు ఆగినంత పనయ్యింది. అంతా విగ్రహాల్లా ఐపోయారు.

గూడెం మధ్యలో దాదాపు పదిహేను మీటర్ల ఎత్తున పెద్ద నోరు తెరుచుకున్న ఓ దేవత విగ్రహం ఉంది. ఆ దేవత మెళ్ళో ఉన్న పెద్ద హారం మధ్యలో

ఉంది ఓ మణి. అక్కడే వెలుగుతున్న కాగడాల వెలుతురుపడి ఆ మణి ప్రకాశిస్తోంది. ఆ తేజస్సు వెదజల్లుతోంది ఆ మణి అని తెలియగానే భారత్ కు గుండెల్లో ఏదో అలజడి మొదలయ్యింది.

ఇంతకు ముందు యెన్నోసార్లు పూర్వం అలాంటి మణులు ఉండేవని విన్నాడు. అవి సూర్యుని కాంతి లాంటి తేజస్సును కలిగివుండేవని చదివాడు. కాని ప్రత్యక్షంగా చూడటం ఇదే మొదటిసారి.

"స్టెల్లా, అపురూపం కదూ" అన్నాడు.

"అవును. ఎయిత్ వండర్ అనిపిస్తోంది. ఈ మణి ముందు నీ దగ్గర ఉన్న వజ్రాలు యెందుకూ పనికిరావు. కేవలం గాజుముక్కలతో సమానం" అన్నది.

"అవును. నాకూ అలాగే అనిపిస్తోంది" అన్నాడు దాన్నే చూస్తూ.

• • •

వాళ్ళందరినీ ఆ గూడెం మధ్యలో వున్న పెద్ద గుడిసె దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆ గుడిసె మిగిలిన వాటికంటే కొంచెం పెద్దదిగా వుంది. దాని బయట అటూ యిటూ రెండు కాగడాలు వెలుగుతున్నాయి.

వాళ్ళని అక్కడే వుంచి వాళ్ళలో ఒకడు లోపలకు వెళ్ళాడు. రెండు నిముషాల తర్వాత లోపల్నుంచి కొంచెం వయసు మళ్ళినవాడితో బయటకు వచ్చి అక్కడే నిలబడి వున్న నాగరికులను చూపించి వాళ్ళ భాషలో యేదో కిచకిచలాడాడు వాడు.

తర్వాత ఆ ముసలాడిని చూపించి యేదో చెప్పి యేం చెయ్యాలో చూపించాడు.

వాడు ఆ జాతివాళ్ళ కుల పెద్ద అనీ వాళ్ళకు వాడే

నాయకుడనీ వాడికి అభివాదం చెయ్యమంటున్నాడనీ గ్రహించారు వాళ్ళు. వాడు చూపించినట్టుగానే చేశారు.

వెనక్కి వంగి ఒక చేతిని గాల్లో పైకెత్తారు.

అది ఆ జాతివాళ్ళలో గౌరవసూచకంగా అభివాదం చేసుకోవటం.

షెల్లా మనసులోనే ఆ జాతినంతటినీ తిట్టుకుంది.

అప్పటికప్పుడే అక్కడికి నాలుగైదు వెదురు కర్రలతో చేసిన మంచాలు లాంటివి తీసుకువచ్చారు. అవి బాగా పొడుగ్గా రైలుపెట్టెలా వున్నాయి. వాళ్ళంతా పొడుగ్గా వున్నారు కాబట్టి వాళ్ళకు అంత పొడుగ్గా వుంటేకాని సరిపోవు.

అంతా కూర్చున్నారు.

ప్రతి యింటి బయటా ఒక్కో కాగడా వెలుగుతోంది. ఆ వెలుతుర్లో ఆ ప్రదేశమంతా ఎంతో క్లియర్‌గా కనపడుతోంది.

ఆ వెలుగులో ఎంతో ఎత్తుగా భయం కలిగించేలా వున్న దేవత విగ్రహం ఆ విగ్రహం మెళ్ళో వున్న హారంలో ధగధగ మని మెరిసిపోతున్న మణి కనపడుతున్నాయి.

బాగా ఎత్తుగా వున్న కొయ్య సింహాసనం లాంటి దాన్ని లోపల్నించి మోసుకువచ్చి మంచాల ఎదురుగా వేశారు. దానిమీద నాయకుడు ఠీవిగా కూర్చుని మీసాలు మెలివేశాడు.

షెల్లా—భారత్ పక్క పక్కనే కూర్చుని నాయకుడిని అదోలా చూశారు.

నాయకుడి కళ్ళు తీక్షణంగా డేగ కళ్ళలా

వున్నాయి. నల్లగా శిలలా వున్నాడు. అలాంటి మను
షుల్లో మంచితనం వుంటుందంటే నమ్మశక్యంగా అని
పించలేదు.

కాని ఆశ్చర్యం!

ఆ మనుషులు మంచివాళ్ళు! తీసుకొచ్చి నాగరికుల్లాగే
మంచాలు వాల్చి కూర్చోబెట్టారు.

నిముసాలమీద వెదురుగొట్టాలతో వాళ్ళందరికీ యేదో
పానీయం తీసుకువచ్చి యిచ్చారు వాళ్ళు.... ఈసారి మగ
వాళ్ళతోపాటు నలుగురు ఆడవాళ్ళు కూడా వచ్చారు.
వాళ్ళు మొలకు యేదో చర్మాన్ని చుట్టుకున్నారు కాని
వక్షభాగంలో మాత్రం యెలాంటి అచ్ఛాదన లేదు. ఆడ
వాళ్ళ మొహాల్లో ఎలాంటి కళ, కాంతీ లేవు.

ఆ పానియం ఎర్రటి రంగులో నెత్తురులా వుంది.
దాన్ని తాగటానికి సంశయం కలిగింది.

ఆ సంశయాన్ని చూసి 'బాగానే వుంటుంది తాగం
డన్నట్టు' చేత్తో సైగ చేశాడు నాయకుడు.

భారత్ దాన్ని చిన్నగా సిప్ చేశాడు.

తియ్యగా వుంది.

జలాశయం వొద్దున తిన్న చిన్న చిన్న పండ్ల రుచి
లోనే వుంది ఆ పానీయం.

"బాగుంది. తాగండి" అన్నాడు భారత్.

అప్పుడే మిగిలిన వాళ్ళంతా ఆ పానీయాన్ని గబగబా
తాగేశారు. దాన్ని తాగిన తర్వాత యింకా తాగాలని
అనిపించింది.

"షాంకీల్ వుంటే బావుండేది" అన్నాడు భారత్.

అప్పటివరకూ అతడిని మరచిపోయినందుకు ఆశ్చర్య
పడింది సెల్లా.

"అవును. దొంగయినా మనకోసం ప్రాణాలు పోగొట్టుకున్నాడు. మనతో కలిసి వుంటే బావుండేది. ఒక రకంగా పాంకిల్ ప్రాణాలు మనమే తీశామేమో! ఇప్పుడు వుంటే యెంతో తియ్యగా వున్న ఈ పానీయం తాగేవాడు. ఎక్కడ పుట్టాడో, ఎక్కడ పెరిగాడో చివరకు యీ దీవిలో విష పాముకు బలై పోయాడు" అన్నది.

కొంచెంసేపటి తర్వాత కొంచెం ఎత్తు తక్కువగా వున్న చెక్కల కుర్చీని తీసుకువచ్చి నాయకుడి సింహాసనం పక్కగా వేశారు.

గాలికి కాగడాలు చిన్నగా వూగుతున్నాయి.

ఉన్నట్టుండి యెవరో డప్పులు మోగిస్తున్న మోత వినిపించింది వాళ్ళకు—కొంచెం దూరంలో....

వాటిని యెందుకు మోగిస్తున్నారో అర్థం కాలేదు.

"ఎందుకీ డప్పు?" అడిగింది స్టెల్లా.

"తెలీదు. ఈ జాతుల ఆచారాలు చాలా చాదస్తంగా వుంటాయి. వీళ్ళంతా మూఢనమ్మకాల్లో పుట్టి అందులోనే పెరిగి అందులోనే అంతరించిపోతూ వుంటారు. వాళ్లు ఏ పని ఎప్పుడు ఎందుకు చేస్తారో కూడా మనం వూహించలేము. ఇప్పుడు ఈ డప్పుల మోత కూడా అంతే. ఇంతకీ ఆ నాయకుడి ఆసనం పక్కనే మరో ఆసనం వేశారు. ఇద్దరు మనుషులకు నాయకుడు తన కిచకిచ భాషలో ఏదో చెప్పి పంపాడు. దీన్నిబట్టి నీకేమర్థమవుతోంది? ఈ నాయకుడు ఎవరికోసమో ఎదురుచూస్తున్నాడు కదూ?" అడిగాడు భారత్.

"అవును. నేనూ అలాగే అనుకున్నాను. ఏమయినా మన భాష తెలీని ఈ మొరటు మనుషులు మనం ఈ దీవి

నించీ బయటపడటానికి సహాయపడతారనుకుంటే ఎందుకో నాకు నమ్మశక్యంగా అనిపించటం లేదు."

"అలా నిరుత్సాహపడకు. ప్రస్తుతం మనకు వీళ్ళను ఆశ్రయించటం తప్పించి మరో మార్గం లేదు."

"నిరుత్సాహం కాదు భారత్. వీళ్ళు మనకు సహాయపడకపోవచ్చునని నా నమ్మకం."

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటున్నప్పుడు వున్నట్టుండి యేదో కలకలం లాంటిది వినిపించింది.

తలలు తిప్పి చూస్తే కొంతమంది ఆ జాతి మనుషుల మధ్య నడిచివస్తున్న ఓ మామూలు మనిషి కనిపించాడు. కొంచెం దగ్గరకు రాగానే ఆ మనిషిని చూసి నెల్లా ఆశ్చర్యపడింది.

• • •

ఆయన వయస్సు అరవై యేళ్ళ వరకు వుంటాయి. జుట్టంతా పొడుగ్గా పెరిగి తెల్లగా నెరిసిపోయి వుంది. కళ్ళు కూడా లోపలకు పీక్కుపోయి జీవం లేకుండా వున్నాయి. గడ్డం నెరిసిపోయి బాగా పొడుగ్గా పెరిగి వున్నది. బాగా వెనక్కు వాలినట్టున్న పెద్దపెద్ద చెవులు. పొడుగ్గా వున్న ముక్కు.

నడుముకు మిగిలినవాళ్ళలాగే యేదో చర్మాన్ని చుట్టుకున్నాడు. ఛాతీమీద కూడా ఓ, చర్మాన్ని షర్టులా కట్టుకొని వేసుకున్నాడు. చేతిలో వంపు తిరిగిన వెదురు కర్ర వుంది.

దాని సాయంతోనే నడుస్తూ వచ్చాడు.

ఆయన్ని చూడటంతోనే ఒక్కసారి లేచి నిలబడి నాయకుడు కిచకిచ లాడాడు. ఆయనా నడుం వెనక్కు వంచి చేతిని గాల్లోకి లేపి నాయకుడికి అభివాదం

చేశాడు.

తర్వాత తనకై ఎదురుచూస్తున్న ఆసనంమీద కూర్చు న్నాడు.

నాయకుడే ఆయన్ని చూసి లేచాడని వీళ్ళు కూడా లేచి నిలబడ్డారు. వాళ్ళు కూర్చున్న తర్వాత మళ్ళీ కూర్చున్నారు.

స్టెల్లా ఆయన గురించే ఆలోచిస్తోంది. ఆయన యీ జాతి మనిషి కాదు. నాగరికుడే. కాని అనాగరికుల్లో కలిసి పోయి అలాగే అనిపిస్తున్నాడు.

ఎదురుగా వెదురు మంచాలమీద కూర్చునివున్న నాగ రికులను చూశాడాయన. వాళ్ళని చూపుతూ నాయకుడు ఆయనకు కిచకిచ భాషలో యేదో చెప్పాడు.

ఆయన తల వూపాడు వింటూ.

అప్పటికి గూడెంలో వున్న ఆ జాతి మనుషులంతా పిల్ల లతో కలిసి వాళ్ళని చూట్టానికి వచ్చేశారు. వాళ్ళందరూ చుట్టూ చేరి అలా తమందరినీ చూపులతో తినేస్తుంటే స్టెల్లా సహించలేకపోయింది. ముఖ్యంగా వాళ్ళనించి వస్తున్న వెగటు వాసన ఆమెకు భరించరానిదిగా తయా రయ్యింది.

స్టెల్లా అందం అక్కడకు వచ్చిన వారందరినీ ఆకర్షించింది. ఆమెనే వింతగా యెక్కువసేపు చూశారు వాళ్ళు.

ఆయన నాయకుడు చెప్పినదంతా విని లేచి భారత్ దగ్గరకు వచ్చాడు. భారత్ లేచి నిల్చున్నాడు.

"ఐయామ్ ఆండ్రూస్. బ్రిటిషర్ని" అన్నాడు ఆంగ్లంలో.

ఆశ్చర్యంతోపాటు భారత్కు సంతోషం కూడా కలి

గింది — ఆంగ్లం తెలిసిన మనిషి ఆ అటవికుల్లో దొరికి నందుకు.

ఆమాంతం ఆంద్రూస్‌ను కౌగిలించుకొన్నంత పని చేశాడు. ఇక తమకు ఎలాంటి భయం లేదు ఆ దీవిలో. ఆంద్రూస్ సాయంతో యెలాగయినా ఆ దీవినించి బయటపడవచ్చునన్న ఆశ పూర్తిగా కలిగింది.

వెంటనే తనని పరిచయం చేసుకున్నాడు భారత్. వరుసగా మిగిలిన వాళ్ళందరినీ పరిచయం చేసి ప్లేన్‌లో దొంగల గురించి విమానం దీవిలో కూలిపోవటం వరకు అంతా ఆంద్రూస్‌తో చెప్పేశాడు.

అలా జరిగినందుకు తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్త పరిచాడు ఆంద్రూస్.

తర్వాత భారత్ చెప్పిన కథ నంతటినీ కిచకిచ భాషలో నాయకుడికి అక్కడ వున్న వాళ్ళందరికీ వివరించి కొంత యాక్షన్‌ని కూడా కలిపి చెప్పాడు.

అంతా విని నాయకుడు కూడా తన భాషలో ఏదో అన్నాడు గబగబా చేతులు తిప్పుతూ—

"నాయకుడు కూడా యిలా జరిగినందుకు విచారపడు తున్నాడు" అని ఆ భాషను ఆంగ్లంలోకి తర్జుమా చేసి చెప్పాడు ఆంద్రూస్.

"మీరు బ్రిటీషర్ అయివుండి ఈ దీవిలోకి యెందుకు వచ్చారు? ఈ మొరటుమనుషుల్లో యెందుకు కలిసి పోయారు? మిమ్మల్ని చూస్తుంటే చాలా యేళ్ళుగా మీరు ఈ దీవిలో వీళ్ళతో నే కలిసి జీవిస్తున్నట్టుగా అని పిస్తోంది" అన్నాడు భారత్.

అందుకు ఆంద్రూస్ నవ్వి "అదంతా ఒక కథలే. తర్వాత తీరిగ్గా చెబుతా... ఇప్పుడు కాదు. ముందు అతిథు

లకు మర్యాదల గురించి విచారించకపోతే ఈ నాయకుడు పూరుకోడు. అతిథి మర్యాదలు పాటించటంలో ఈజాతి వాళ్ళకు మన నాగరికులు కూడా సాటిరారు. మీకు ఎర్రటి పానీయం అందజేయబడిందా?" అని అడిగాడు.

తల వూపాడు భారత్.

అప్పుడే అతని కడుపులో ఆకలి మంట దహించుకు పోతున్నట్టుగా అనిపించింది.

తనకేనా? మిగిలిన వాళ్ళకూ్కడా అలాగే అనిపిస్తోందా? కేవలం రెండు గంటల క్రితమే ఆకలి పూర్తిగా తీరిపోయేంతగా నీటిమడుగు దగ్గర చిన్న చిన్న పండ్లను తిన్నాడు. కొన్ని నిముషాల క్రితమే ఎర్రటి పానీయాన్ని తాగాడు.

అయినా అప్పుడే ఆకలి బాధిస్తోంది—

సరిగ్గా అప్పుడే అన్నది స్టెల్లా—

"నాకు భరించలేనంత ఆకలిగా వుంది."

"స్టెల్లా.... నాకూ అలాగే వుంది. ఆశ్చర్యంగా వుంది కదా....మనం అక్కడ తిన్న పండ్లకు కనీసం ఆరుగంటల వరకయినా ఆకలి కాదని అనుకున్నాను. నేనూ ఈ ఆకలి బాధను భరించలేకుండా వున్నాను" అన్నాడు భారత్.

అప్పుడే ఒక్కొక్కరూ తమను వేధిస్తున్న ఆకలి బాధ గురించి స్టెల్లాతో భారత్‌తో చెప్పటం మొదలు పెట్టారు.

"ఏమిటి?" అడిగాడు ఆంద్రూస్.

ఆకలవుతోందని చెప్పటానికి బిడియపడ్డాడు భారత్. అందుకే "ఏమీ లేదు" అన్నాడు.

"ఏదో వుంది. దయచేసి మీరు మానసులో వున్న విషయాన్ని చెప్పటానికి సంకోచించకండి."

ఆండ్రూస్ అంతగా చెప్పిన తర్వాత "మా అందరికీ బాగా ఆకలవుతోంది. భరించలేకుండా వున్నాం. నిజానికి ఈ సమయంలో మాకు యిలా ఆకలి అనిపించటం ఆశ్చర్యంగా వుంది. ఎందుకంటే?" అని జలాశయందగ్గర చిన్న చిన్న పండ్లు తినటం, గూడెంలో ఎర్రటి పానీయం తాగటం గురించి చెప్పాడు భారత్.

నవ్వాడు ఆండ్రూస్.

నవ్వుతూనే "ఆ చిన్నపండ్ల లక్షణమే అది. ఆకలి తీరటానికి ఆ పండ్లను యెంత యెక్కువగా తీసుకుంటే అంత తక్కువ వ్యవధిలోనే యెంతో ఆకలి మంటను ఆ పండ్లు కలగజేస్తాయి. ఆ పండ్లలో తీసిన రసమే ఎర్రటిపానీయం. కొంచెం తీసుకొంటే చాలు అరగంట లోపలే భరించలేనంత ఆకలి అవుతుంది. ఆ ఆకలి తీరటానికి మీరు ఎంతో తిండి తింటారు" అన్నాడు.

నాగరికులకు ఆకలవుతోందని ఆండ్రూస్ నాయకుడికి చెప్పాడు. నాయకుడు వెంటనే పక్కనే నిలబడివున్న మనుషులకు యేవో ఆజ్ఞలు జారీచేశాడు.

వాళ్ళు వెళ్ళిపోయారు.

నిముషాలు గడుస్తున్నాయి.

ఉన్నట్టుండి భారత్ కు పాంకీల్ తిన్న విషపండ్ల చెట్టు గురించి గుర్తుకు వచ్చింది.

వెంటనే ఆ పండ్ల గురించి అడిగాడు.

"మైగాడ్. అవి చాలా విషపూరితమైన పండ్లు. పొరపాటున కూడా పక్షులు సైతం ఆ పండ్లదగ్గరకే వెళ్ళవు. అసలు ఆ చెట్టుమీదనే వాలవు. భయంకరమైన విష సర్పంలో వుండే విషం లాంటిదే ఆ పండ్ల నిండా వుంటుంది. ఆ పండును కొరికిన తర్వాత మనిషి బతకట

మ నేది అసాధ్యం" అన్నాడు ఆంద్రూస్.

అప్పుడు చెప్పాడు భారత్ — షాంకీల్ ఆ పండును తిని ప్రాణాలు పోగొట్టుకోవటం గురించి.... ఆ తర్వాత అతడిని అక్కడే గొయ్యి తవ్వి పూడ్చిపెట్టటం గురించి....

ఆ విషయాన్ని వినగానే అదిరిపడ్డాడు ఆంద్రూస్.

క్షణం తర్వాత "మీరు పొరపాటు చేశారు" అన్నాడు.

"ఏమిటి?"

"ఈ విషయం ఈ జాతి మనుషులకు తెలిసిందంటే వాళ్ళు శివమెత్తుతారు" అన్నాడు మళ్ళీ....

"వివరంగా చెప్పండి" భారత్ అడిగాడు.

"మరణించిన మనుషులను యీ దీవిలో యెక్కడా పూడ్చిపెట్టరు. తీసుకెళ్ళి సముద్రంలో పారేసి వస్తారు. పూడ్చిపెట్టిన మనుషుల ప్రేతాత్మ గాల్లో కలిసి యిక్కడే తిరుగుతూ వాళ్ళను బాధిస్తూ వుంటుందని వాళ్ళ నమ్మకం."

ఆ మాటలు వినగానే భారత్ మొహం అదోలా అయ్యింది. అలాంటి ఆచారం వుందని తనకు తెలీదు. షాంకీల్ చనిపోయే వెనుక దీవిలో అసలు మనుషులు వున్నారనే విషయమే తనకు తెలీదు. అలాంటప్పుడు అందులో తను బాధపడవలసింది యేదీ లేదు.

అదే మాటను ఆంద్రూస్‌తో అన్నాడు.

"నువ్వెన్ని చెప్పినా అందువల్ల ఉపయోగం లేదు. కేవలం మూఢనమ్మకాలకే విలువ యిచ్చే మనుషులు వీళ్ళంతా ...మన రీజనింగ్, మన సంజాయిషీలు వీళ్ళకు పనికిరావు. ఏమైనా మీరు పొరపాటు చేసినట్టే లెక్క

వీళ్ళ దృష్టిలో. ఐతే ఆ విషయాన్ని వాళ్ళు తెలుసుకో నంత వరకు ఇబ్బంది లేదు."

"పోనీ, నన్ను ఓ పని చెయ్యమంటారా?"

"ఏమిటి?"

"తెల్లవారుతూనే ఆ ప్రదేశానికి వెళ్ళి పాతిపెట్టిన ఆ శవాన్ని బయటకు తీయించి సముద్రంలో విసిరేసే యేర్పాట్లు చెయ్యమంటారా?"

"వద్దు. అది మరీ ప్రమాదకరమయిన పని. ఆ శవాన్ని బయటకు తీస్తున్నప్పుడు ఎవరైనా చూశారంటే దాని పరిణామం చాలా ఘోరంగా వుంటుంది. అందువల్ల మీరు ఇక ఆ విషయంలో మవునంగా వుండండి. ఎలా జరగ వలసి వుందో అలాగే జరుగుతుంది."

భారత్ యేదో మాట్లాడబోయాడు కాని యింత లోనే "ఇక మాటలు అనవసరం అనుకుంటాను. ఆ విషయం గురించి ఎక్కువ మాట్లాడవద్దు" అన్నది సెల్లా చిన్నగా అప్పటివరకు ఆ సంభాషణను జాగ్రత్తగా విని.

ఆమె మాటలు ఆంబ్రోస్‌కు సరిగా వినిపించలేదు. అందుకే "ఏమిటీ ఆమె అంటున్నది?" అనడిగాడు.

"ఏమీ లేదు. బాగా ఆకలవుతోందని అంటుంది."

"అలాగా....ఏర్పాట్లు జరుగుతున్నాయి. తిండి గురించే కొంతమంది మనుషులు వెళ్ళారు. వస్తూవుంటారు" అన్నాడు.

"ఇంతకీ ఈ దీవి పేరేమిటో అడగటం మరచి పోయాను" ఉన్నట్టుండి భారత్ అన్నాడు.

"టకారా."

"టకారా దీవా! ఇంతకు ముందెప్పుడూ ఈ దీవి పేరు విన్లేదు."

ఆ మాటకు నవ్వాడు ఆండ్రూస్.

"సముద్రంలో యిలాంటి దీవులు కొన్ని వందలు వున్నాయి. అన్ని దీవుల గురించి ఇంతవరకు యెవ్వరికీ తెలీదు. అలా తెలియని దీవుల్లో ఇది కూడా ఒకటి."

"ఏ ప్రాంతంలో వుంది ఈ దీవి?"

"తెలీదు."

"తెలీకుండా నే ఈ దీవికి వచ్చారా?"

మళ్ళీ నవ్వాడు ఆండ్రూస్.

"మీరంతా ఈ దీవి గురించి తెలిసే వచ్చారా?"

"అంటే?"

"అవును. చెప్పాను కదా అదంతా ఓ కథ అని. తర్వాత చెబుతాను. అదిగో, మీకు ఆహారం వచ్చింది. ముందు ఆకలి తీర్చుకోండి."

అప్పుడే ఓ పదిమంది మనుషులు—ఆదులో ఇంతకు ముందు పానీయం అందించిన స్త్రీలు కూడా వున్నారు—వెడల్పుగా వున్న ఆకులతో కట్టిన విస్తళ్ళలో బాగా వండిన మాంసాన్ని వుంచి వరుసగా అందరికీ యిచ్చారు.

ఆ మాంసం బాగా సువాసనలు వెదజల్లుతోంది. ఆ వాసన తగలటంతో నే వున్నట్టుండి ఆకలి మరింతగా పెరిగిపోయింది. వాళ్ళ చేతుల్లోనించి ఆకులను లాక్కొని ఆవురావురుమంటూ తినసాగారు.

ఆండ్రూస్—వాళ్ళు ఆత్రంగా తినటాన్ని చూసి చిన్నగా నవ్వుకున్నాడు. అంతా ఆ చిన్న పండ్ల ప్రభావమే అనుకున్నాడు

అలాంటి మాంసాన్ని ఇంతకుముందెప్పుడూ వాళ్ళు తినివుండలేదు. దాని గురించి ఆండ్రూస్‌ను అడగాలను కున్నాడు భారత్. కాని అడగటానికి అది సమయం

కాదు. ముందు ఆకలితీరాలి. ఆ తర్వాతనే ఇక ఏ కబుర్లయినా.

సెల్లాకూడా ఆ మాంసాన్ని తింటూ బాగా ఆశ్చర్యపడింది. అంత మొరటుగా వున్న ఆ మనుషులు అంత రుచిగా మాంసాన్ని వండుతారని వూహించలేదు.

కొంచెంసేపటి తర్వాత ఆకలిబాధ తీరింది.

అలాంటి మంచి భోజనాన్ని ఏర్పాటు చేసినందుకు నాయకుడికి అంతా కృతజ్ఞతలు తెలియజేసుకున్నారు. ఆ విషయాన్ని ఆంద్రూస్ నాయకుడికి చెప్పాడు. అందుకు నాయకుడు నవ్వి కిచకిచ లాడాడు ఏదో....

"అతిథులను సంతోషపరచటమే మా లక్ష్యం" అంటూ చెప్పాడు ఆంద్రూస్.

అప్పటికే బాగా పొద్దుపోయినట్లనిపించింది. నిజానికి నగరాల్లో ఐతే ఆ టైముకు పొద్దుపోయినట్టుకాదు.

కాని — దీవుల్లో అలాకాదు.

వెలుగు పోవటంతోనే పొద్దు పోతుంది.

అప్పుడు అడిగాడు భారత్ — ఆంద్రూస్‌ను.

"ఇప్పుడు మాకు వడ్డించిన మాంసం ఏ జంతువుది?"

"ఇక్కడ దాన్ని నల్ల మృగం అంటాము. ఈ దీవిలో బాగా లోపలకు వెళితే దట్టమైన అడవివుంది. అందులో ఈ నల్లమృగాలు యెక్కువగా దొరుకుతాయి. దీని మాంసం బాగా రుచిగా వుంటుంది."

నిండుగా ఆహారం తీసుకోవటంతో అందరికీ నిద్ర ముంచుకు వచ్చింది. కళ్ళు చిన్నగా మూతలు పడుతున్నాయి.

నాయకుడు ఆంద్రూస్‌తో ఏదో చెప్పాడు.

"మీరు అలసిపోయి వున్నారేమో....విశ్రాంతి తీసు

కోమంటున్నాడు నాయకుడు. మీకోసం ఈ వెనుక వైపున మందనంలో వున్న ఇళ్ళలో పడకలు యేర్పాటు చేయబడ్డాయి" అన్నాడు ఆంద్రూస్.

అంతా లేచి నిలబడ్డారు.

నాయకుడు ఏదో చెప్పి వెళ్ళిపోయాడు తన ఇంట్లోకి. నలుగురు మనుషులు వచ్చి తమ వెంట నడవమని సైగ చేశారు.

"విశ్రాంతి పొందండి. నేనూ వెళతాను. గుడ్ నైట్" అని వంకీ కఱ్ఱ సాయంతో నడుచుకుంటూ వెళ్ళిపోయాడు ఆంద్రూస్.

* * *

"ఆ మనుషులు భారత్ — సెల్లాలతో పాటు అందరినీ అక్కడినించి ఇళ్ళమధ్యనించి వెనుక వైపుకు తీసుకెళ్ళారు. ఆ వెనుకవైపు విశాలంగా వున్న మైదానంలో వరుసగా చాలా ఇళ్ళు వున్నాయి. అన్నీ వెదురు ఆకుల తో వేసినవే.

అక్కడక్కడ ఇళ్ళముందు పొడుగాటి గుంజలు భూమిలో పాతి వున్నాయి. వాటికి కాగడాలు కట్టి వున్నాయి.

కాగడాల వెలుగు రెపరెప లాడుతోంది ఆ ప్రాంతంలో. ఒక్కొ ఇంట్లో యిద్దరు మనుషులు పడుకోవచ్చునని చెప్పారు వాళ్ళు. ఆ ఇళ్ళలోపల సన్నని ఆకులతో అల్లిన పెద్ద పెద్ద చాపలు పరిచివున్నాయి. తలగడలు లేవు. చలివేసినప్పుడు కప్పుకోటానికి చాపలపక్కనే పొడుగాటి జంతు చర్మాలు వేల్లాడుతున్నాయి.

నాలుగో ఇంట్లో భారత్ — సెల్లా పడుకోవాలను కున్నారు. ఆ పక్కనే వున్న ఇంట్లో ముగ్గురు స్త్రీలు

పడుకుంటూనున్నారు. మిగిలినవాళ్ళంతా వరుసగా వున్న ఇళ్ల లో—

ఆ మనుషులు వెళ్లొస్తామని సైగ చేసి వెళ్ళిపోయారు. వెళ్ళిపోయేముందు ఇంటి తలుపులు గట్టిగా బిగించుకోమని చెప్పారు.

వాళ్ళు వెళ్ళిపోగానే అంతా యెవరి యిళ్ళలోకి వాళ్ళు వెళ్ళిపోయారు. చివరగా భారత్—సెల్లా తమ ఇంట్లో దూరారు.

లోపలకు వెళ్ళగానే తలుపును మూసి తాడుతో గట్టిగా కట్టేశాడు. రాత్రివేళ క్రూరమృగాలు వచ్చే అవకాశం వుంటుందని తలుపు బిగించుకోమని చెప్పారని అనుకున్నాడు.

సెల్లా అప్పటికే ఆ చాపమీద వాలిపోయింది. ఆ చాప అదోవిధమైన చిత్రమైన వాసన వేస్తోంది.

భారత్ ఆమె పక్కనే వచ్చి కూర్చుని సిగరెట్ టిన్ బయటకు తీశాడు. అప్పటివరకూ ఒక్క సిగరెట్ కూడా కాల్చనందుకు అతనికి ఆశ్చర్యమయ్యింది.

సెల్లాకూడా ఓ సిగరెట్ తీసుకుని "అంతా నీకేమని పిస్తోంది?" అన్నది.

"వింతగా వుంది. ఇంతకుముందు ఇలాంటి అనుభవాలను సినిమాల్లో చూశాను. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాం. ఏమయినా మనం అదృష్టవంతులం. ఈ దీవిలో వున్న ఈ ఆటవికులు మంచివాళ్ళు. లేకపోతే మనందరినీ ఈ పాటికి ఆ దేవత విగ్రహానికి బలిచ్చి జాతర చేసేవాళ్ళు."

"నిజమే. ఏమయినా ఈ వాతావరణం యెందుకో

నాలో కలవరాన్ని కలగజేస్తోంది. అసలు ఆ ఆండ్రూస్ ఎవరు? ఇక్కడికి యెలా వచ్చాడు? ఎందుకు వచ్చాడు? ఈ దీవిలోనే ఎందుకు వుండిపోయాడు? ఈ దీవి నించి బయటపడే మార్గం లేకయేనా? ఒకవేళ అదే నిజమైతే యిప్పుడు మనం ఈ దీవినించి బయటపడటం కూడా అసాధ్యమేకదా?" అని అడిగింది.

పొగ పీలుస్తూ భారత్ మాట్లాడలేదు.

కొంచెంసేపు గడిచాక "ఏమో .... మనం యేమీ వూహించటానికి వీల్లేదు. ఆండ్రూస్ యే కారణాలవల్ల ఈ దీవిలో ఈ మొరటు మనుషులమధ్య వుండిపోయాడో మనకు తెలీదు. ఆయన తన చరిత్రను మనకు చెప్పలేదు. తర్వాత చెబుతానన్నాడు. ఆయన తన కథ చెప్పేవరకూ మనం ఏదీ అనుకోవటానికి వీల్లేదు. స్టెల్లా.... అంతకంటే కూడా నన్ను మరో విషయం ఎక్కువ కలవరపెడుతోంది" అన్నాడు.

"ఏమిటి?" అతడి కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"షాంకీల్‌ను భూమిలో పాతిపెట్టడం గురించి ఆండ్రూస్ చెప్పిన విషయం విన్నావు కదా? ఆ శవం గురించి ఈ మనుషులకు తెలిసిందంటే దారుణమయిన పరిస్థితులను యెదుర్కోవలసి వుంటుందని అన్నాడు. ఇప్పుడేమిటి చెయ్యటం? వాళ్ళే ఆ శవాన్ని పూడ్చిపెట్టిన విషయాన్ని గమనిస్తే అతిథ్యం మనకు ఇలా వుండదనుకుంటాను."

విచారంగా అన్నాడు భారత్.

"అవును. నిజమే. ఈ అటవికులందరికీ చాలా చిత్రమైన నమ్మకాలు వుంటాయి. లేకపోతే మరణించిన మనుషులను పూడ్చిపెడితే వాళ్ళ ప్రేతాత్మ గాల్లో తిరగటం

యేమిటి?? వీళ్ళందరినీ బాధించటం యేమిటి? బ్లయిండ్ బిలీఫ్.... రిడిక్యులస్" అన్నది.

భారత్ యేదో ఆలోచనలో వుండిపోయాడు.

చేతిలో వెలుగుతున్న సిగరెట్టు అయిపోయిన తర్వాత మరో సిగరెట్టును వెలిగించాడు.

అతనిలో ఆ క్షణాల్లో ఎన్నో రకాల ఆలోచనలు దొర్లిపోయాయి.

ఓవైపు—షాంకీల్ శవం.

మరోవైపు— తేజస్సును వెదజల్లే ఆ మణి.

అప్రయత్నంగానే అతని ఆలోచనలు ఎర్రని కాంతులను ప్రసరిస్తున్న ఆ మణి చుట్టూనే తిరుగుతున్నాయి.

కొంచెంసేపు అతడినే పరీక్షగా గమనించి "భారత్! యేమిటా ఆలోచన? ఆ మణి గురించేనా?" అన్నది స్టెల్లా.

అతను ఉలిక్కిపడి "నీకెలా తెలుసు!" అన్నాడు.

నవ్వింది స్టెల్లా—

"నీ ఆలోచనలు నాకు తెలీదా? వజ్రాలన్నా, మణులన్నా నీకెలాంటి ఇంట్రస్టు వుంటుందో నాకు తెలుసు. నేననుకుంటాను ఆ మణి విలువ మన నాగరిక ప్రపంచపు మార్కెట్‌లో కొన్ని కోట్ల రూపాయల వరకు వుంటుందని."

"యూ ఆర్ రైట్.... నా అంచనా కూడా అంతే. అసలు విలువకట్టటానికి వీల్లేని మణి. సృష్టిలో అపూర్వమైనది....కథల్లో వినటమే కాని చూడటం ఇదే మొదటిసారి. నాకు ఆలోచిస్తుంటే ఇప్పుడు అనిపిస్తోంది—ఒక రకంగా మన మంచికే ప్లేన్ ఈ దీవిలో కూలిపోయిందేమో!"

"మన మంచికే! అంటే?"

"ఇప్పుడు కాదు. తర్వాత చెబుతాను. పడుకో. బాగా పొద్దుపోయింది."

"నాకు నిద్ర రావటంలేదు" కొంటెగా చూస్తూ అన్నది.

"నాకు వస్తోంది."

"నీ పక్కనే పడుకున్నది ఓ ఆడది. అందాల రాసి."

"ష్! ఇక మాట్లాడకు" అంటూ స్టెల్లా మొహం మీదకు వంగి ఆమె పెదవులమీద బలంగా ముద్దు పెట్టుకున్నాడు.

అంతే. ఆవేశంగా అతడిని పెనవేసుకుపోయింది స్టెల్లా.

తాత్కాలికంగా వాళ్ళు పరిసరాలను అన్ని రకాల ఇతర ఆలోచనలను మరచిపోయి మరో లోకానికి వెళ్ళిపోయారు.

బయట కాగడాలు గాలికి కొట్టుకుంటూనే వెలుగుతున్నాయి.

దూరంగా దీవిలో ఎక్కడో ఏవో జంతువుల అరుపులు వుండుండి వినిపిస్తున్నాయి.

కొంచెంసేపట్లోనే భారత్—స్టెల్లా నిద్రలోకి జారిపోయారు. దాదాపుగా అంతా నిద్రాదేవి వొడిలోకి వెళ్ళిపోయారు. గూడెమంతా నిద్రలో జోగుతున్నట్టుగా వుంది.

•     •     •

ఎందుకో వున్నట్టుండి భారత్‌కు చటుక్కున మెలకువ వచ్చింది. చివాలున చాపమీద లేచి కూర్చున్నాడు.

ఎందుకు మెలకువ వచ్చింది?

చెవులు రిక్కించాడు.

ఎవరో ఏడుస్తున్నారు.... అవును. సందేహం లేదు. చాలా దగ్గిర్నించి ఏడుపు వినపడుతోంది.

సెల్లాను చూశాడు. గాఢ నిద్రలో వుంది.

ఆమెను నిద్ర లేపుదామనుకున్నాడు. మళ్ళీ ఎందుకో లేపాలనిపించలేదు. అందుకే లేచి నిల్చున్నాడు.

తలుపుకు కట్టిన తాడును వూడదీసుకుని ఒక్కసారి అటూ ఇటూ చూసుకుని బయటకు వచ్చాడు. కొన్ని కాగడాలు ఆరిపోయి వున్నాయి.

కొంచెం దూరంలో రెండు కాగడాలు మాత్రం ఇంకా చిన్నగా వెలుగుతున్నాయి.

పక్కనే వున్న యింట్లోనించే ఆ ఏడుపు వినిపిస్తోందని అతనికి అర్థమైపోయింది. గబగబా అక్కడకు వెళ్ళి తలుపుదగ్గర నిలబడ్డాడు.

లోపల్నించి ఎక్కిళ్ళుపెట్టి ఓ స్త్రీ ఏడుస్తోంది. సన్నగా వినపడుతోంది. ఇంకో ఇద్దరు ఆమెను ఓదారుస్తున్నట్టుగా వుంది.

భారత్ ఆ తలుపుమీద అరచేత్తో చప్పుడు చేశాడు.

ఎవ్వరూ పలకలేదు.

"తలుపు తెరవండి.... నేను భారత్‌ని."

రెండు నిముషాల తర్వాత తలుపు తెరుచుకుంది.

భారత్ లోపలకు అడుగుపెట్టాడు. అతడితోపాటు కాగడాల వెలుగు కూడా లోపల ప్రవేశించింది.

చాపమీద ఓ స్త్రీ కూర్చుని మోకాళ్ళమీద తల వుంచుకుని యేడుస్తోంది. మిగిలిన ఇద్దరు ఆమెను ఓదారుస్తున్నారు.

"ఏం జరిగింది?"

వెంటనే జవాబు రాలేదు.

మళ్ళీ అడిగాడు.

"భయంగా వుందిట. తనకు వున్న ఒకే ఒక్క చెల్లెలు గుర్తుకు వచ్చిందిట. ఆమెను చూడగలనో లేదో అని యేడుస్తోంది."

చెప్పారు వాళ్ళు.

వాళ్ళకీ యేడుపు వస్తున్నట్టుగానే వుంది. వాళ్ళ మొహాలు పాలిపోయి దీనంగా వున్నాయి.

వాళ్ళు తన గురించి చెబుతుంటే ఆ స్త్రీకి దుఃఖం మరింత పెరిగిపోయింది.

"ప్లీజ్! విచారపడొద్దు. తప్పకుండా మనం త్వరలోనే ఈ దీవినించి బయటపడతాం. మన గమ్యాలను చేరుకుంటాం. అధైర్యపడొద్దు. ఒక్కరు అధైర్యపడితే అందరిలోనూ పిరికితనం ప్రవేశిస్తుంది. అప్పుడు మనం ధైర్యంగా ముందుకు వెళ్ళలేము."

ఆమెకు ధైర్యం చెప్పాడు.

ఆ స్త్రీ యేడుపు ఆపేసింది.

కొంచెంసేపు అక్కడే కూర్చుని తర్వాత లేచి బయటకు వచ్చాడు.

కాగడాల వెలుగులో అతని నీడ యిళ్ళమీదకు పొడుగ్గా సాగుతోంది. వాతావరణం ప్రశాంతంగా వుంది.

నిశ్శబ్దంగా వుంది.

ఒంటరిగా నిల్చుండి ఆలోచనల్లో మునిగిపోయాడు భారత్. ఒకందుకు అతనికి విచారంగా వుంది.

ఒక విధంగా తమతో పాటుగా వీళ్ళంతా యీ

దీవిలో చిక్కుపడిపోవటానికి కారణం తను—స్టెల్లా....

ఆమె రివాల్వర్ తీసి పేల్చకుండా వున్నట్లయితే ప్లేన్‌లో కాల్పులు సంభవించి వుండేవి కాదు.

ప్లేన్ టాంకు అంటుకుని కూలిపోయేది కాదు. మండుతున్న ప్లేన్‌లోనించి సముద్రంలోకి దూకిన మనుషులు ఏమైపోయారో? బహుశ వాళ్ళు మరణించి వుండొచ్చు. ఒకవేళ బతికితే యిలాంటి యే దీవినో చేరుకుని వుండొచ్చు.

భారత్‌కు హఠాత్తుగా కెరోన్ గుర్తుకు వచ్చింది.

కెరోన్! తనని నమ్ముకుని ప్రాణాలు పోగొట్టుకుంది.

నిజంగా కెరోన్ శాపమే తమని కష్టాలకు గురి చేస్తోందా?

ఉన్నట్టుండి యెక్కడో దూరంగా యేదో జంతువు ప్రాణభయంతో చేసిన ఆర్తనాదం వినిపించింది.

సరిగ్గా అప్పుడే స్టెల్లా తలుపు తెరుచుకుని బయటకు వచ్చింది.

అతడి దగ్గరగా వచ్చి భుజంమీద రెండు చేతులూ వేసి "ఎందుకిలా ఒంటరిగా చలిగాలిలో నిలుచున్నావ్?" అన్నది.

ఆ స్త్రీ యేడుపు గురించి చెప్పాడు.

"నిజమే. మగవాళ్ళే కొంతమంది దిగులుతో, భయంతో కుంగిపోతున్నారు. ఇలాంటి పరిస్థితులను స్త్రీలు తట్టుకోవటం సాధ్యం కాదు" అన్నది.

"నువ్వు మాత్రం ఆడదానివి కదూ" నవ్వుతూ అడిగాడు భారత్.

"కావచ్చు. కాని చిన్నతనం నుంచీ నేను మగవాడిగానే పెరిగాను. మగవాడితో సమానంగా అన్ని విద్య

లనూ నేర్చుకున్నాను. అందువల్ల నాకు గుండెధైర్యం ఎక్కువ."

"ఒప్పుకుంటాను. ఇంతకీ రేపటి మన కార్యక్రమం యేమిటి?"

"తెలీదు. ముందు మనం ఈ దీవి నుంచి బయటపడటం ఎలాగో ఆండ్రూస్‌ను అడిగి తెలుసుకోవాలి. ఎంత త్వరగా ఈ దీవినించి బయటపడితే అంత మంచిది. ఎందుకంటే ఈ మొరటు మనుషులు వాళ్ళ పిచ్చి నమ్మకాలతో, ఆచారాలతో మనల్ని వేధిస్తారు."

"నిజమే. నా మనసులో మరో భయంకూడా సుడులు తిరుగుతోంది. షాంకీల్ శవాన్ని ఈ మనుషులు తెలుసుకోరు కదా!"

"ఏమో! ఇక్కడ నిలబడి మనం యెన్నిరకాల ఆలోచనలు చేసినా అందువల్ల ఉపయోగం లేదు. ఇంత రాత్రి వేళ ఇలా బయటనిల్చుని మాట్లాడుకోవటం కూడా ప్రమాదమే. క్రూరజంతువులు సంచరిస్తూ వుంటాయి. లోపలకు వెళ్ళి పడుకుందాం" అంటూ అతడి చేతిని పట్టుకుని ఇంట్లోకి నడిచింది స్టెల్లా.

మౌనంగా ఆమెను అనుసరించాడు భారత్.

వాళ్ళు తలుపును బిగించి పడుకున్న కొంచెంసేపటికే ఆ ప్రాంతంలో పులి గాండ్రింపు వినిపించింది.

భయంతో ఒకరినొకరు చూసుకున్నారు భారత్ — స్టెల్లా.

• • •

సూర్యోదయ మవుతుండగా అందరికీ మెలకువ వచ్చింది. అంతకు పూర్వమే కొంతమందికి మెలకువ వచ్చింది కాని కొంచెం సందడి మొదలయిన తర్వాతనే

బయటకు రావాలని లేవలేదు.

రాత్రి బాగా యేడ్చిన స్త్రీ కళ్ళు భాగము వుబ్బిపోవటాన్ని అంతా గమనించారు. అప్పటికప్పుడే ఆమె ఆ రాత్రి యేడ్చిన విషయం వాళ్ళందరికీ తెలిసిపోయింది.

అప్పుడు మగవాళ్ళు కూడా కొంతమంది వాళ్ళ మనసులో వున్న భయాన్ని, బాధను ఒకరికొకరు వ్యక్తం చేసుకున్నారు.

ముసలాయన గబగబా భారత్ దగ్గరకు వచ్చి "ఈ రోజు మనం ఈ దీవినించి బయటకు వెళ్ళగలమా?" అనడిగాడు.

ఆయనకు ఏమని జవాబు చెప్పాలో భారత్‌కు అర్థం కాలేదు. తన చేతుల్లో యేముంది?

పదేపదే ఆయన అదే ప్రశ్నను అడగటంతో అతనికి విసుగు కలిగింది. కోపంకూడా వచ్చింది. అయినా ఎలాగో నిగ్రహించుకుని—

"ముందు మనం ఈ దీవినించి ఎలా బయటపడాలో ఆంద్రూస్‌ను అడిగి తెలుసుకుందాం. తర్వాత ఆ విధంగా చేద్దాం. త్వరగా ఇక్కడినించి బయటపడాలని అందరికీ ఆదుర్దాగానే వుంది" అన్నాడు.

తర్వాత ఆయన చిన్నగా యేదో గొణుక్కున్నాడు.

ఆయన్ని చూస్తే వెంటనే భారత్‌కి జాలి కలిగింది. అరవై యేళ్ళ పైనే వుంటాయి. నడిచే ఓపిక లేదు. చూపు కూడా సరిగా కనపడదు. అలాంటి మనిషికి కూడా ఎన్ని కష్టాలు?

మైగాడ్ ....ఏమి టీ పరిస్థితి??

అప్పటికే టకారా జాతివాళ్ళ గూడెంలో సందడి మొదలయ్యింది. నలుగురు మనుషులు వచ్చి వాళ్ళందరినీ

మళ్ళీ నాయకుడి ఇంటిదగ్గరకు తీసుకెళ్ళారు.

నాయకుడు ఇంటి బయటవున్న చెట్టుకింద తన సింహాసనంమీద కూర్చున్నాడు. ఆయన్ని చూడటంతోనే ముందుగా భారత్ వెనక్కు వంగి గాలిలో చేతిని వూపి అభివాదం చేశాడు. మిగిలినవాళ్ళంతా భారత్‌ను అనుకరించారు.

తన జాతి పద్ధతిలోనే వాళ్ళంతా తనకు గౌరవసూచకంగా అభివాదం చెయ్యటంతో నాయకుడికి పట్టరాని సంతోషం కలిగింది.

చేతులు వూపుతూ తన సంతోషాన్ని నవ్వులో వ్యక్త పరిచాడు.

భారత్ దృష్టి దేవత విగ్రహం మెళ్ళో వున్న హారం మీద పడింది. అందులో వున్న మణి సూర్యుడి కాంతిలో అద్భుతమైన తేజస్సుతో ప్రకాశిస్తోంది.

దాన్ని చూడగానే అతని గుండెల్లో తిరిగి అలజడి మొదలయ్యింది.

మణి—కోట్లు విలువచేసే మణి. దాని విలువ తెలియని మొరటు మనుషుల మధ్య ఓ విగ్రహం మెళ్ళో పడి వుంది.

పదేపదే ఆ మణి అతడిని ఆకర్షిస్తోన్నది....అతడిలో యెన్నో రకాల ఆలోచనలు కలుగ జేస్తోంది.

అవును. ఎలాగైనా ఆ మణిని తన సొంతం చేసుకోవాలి. దాన్ని తను పొందాలి. ఎలాగైనా సరే. కాని ఇది సాధ్యమయ్యేదేనా? ఊహు....అసాధ్యం....

భారత్‌కు అప్రయత్నంగా నవ్వొచ్చింది.

ముందు తామంతా ఆ దీవినించి బయటపడే మార్గం వుందో లేదో తెలియకుండానే తను ఆ మణి గురించి

ఆలోచనలు చేస్తున్నాడు

స్టెల్లా ఆలోచిస్తోందా? ఈ మణి గురించి ...

ఏమో! అడిగితేనే కానీ తెలీదు.

బలవంతంగా మెదడులో రొద పెడుతున్న ఆలోచన లను పక్కకు నెట్టాడు.

ఎందుకంటే అప్పుడే వంకీ కర్రసాయంతో చిన్న చిన్న అంగలతో ఆండ్రూస్ అక్కడికి వచ్చాడు. వస్తూనే నాయకుడికి అభివాదం చేశాడు.

తర్వాత భారత్‌తో కరచాలనం చేశాడు.

స్టెల్లాను చూసి చిరునవ్వు నవ్వుతూ "రాత్రి బాగా విశ్రాంతి తీసుకున్నారా?" అనడిగాడు.

తల వూపింది ఆమె.

"మీ తర్వాత ప్రోగ్రాం ఏమిటి?"

భారత్ నవ్వి "మా ప్రోగ్రాం అంటూ యేదీలేదు. మాకు వున్న ఆలోచనల్లా ఒక్కటే. ఈ దీవినించి బయటపడి యెవరి గమ్యస్థానాలను వాళ్ళు చేరుకోవటం యెలా? ప్రస్తుతానికి యిదే ఆలోచన. ఇక్కడినించి బయటపడే మార్గాన్ని మీరు యిప్పుడు చెప్పగలిగితే మేమంతా యీ రోజునే మా ప్రయాణం మొదలు పెడతాం" అన్నాడు.

"అవును... మేమంతా దిగులుతో, భయంతో ప్రతి క్షణం కుమిలిపోతున్నాం. మమ్మల్ని ఈ దీవినించి బయటకు పంపించే మార్గం ఏదో చెప్పండి....ప్లీజ్ ...."

అంతా ఒక్కసారిగా అన్నారు.

ఓ. స్త్రీ రాత్రి మరో స్త్రీ నిద్ర పోకుండా ఏడ్చిన విషయం గురించి కూడా ఆయనతో చెప్పింది. ఆయన అంతా విని ఒకసారి తెల్లగా నెరిసిన గడ్డాన్ని చేత్తో

దువ్వుకుని—

చిన్నగా నవ్వాడు.

ఆ తర్వాత అంద్రూస్ మొహం గంభీరంగా మారి పోయింది. కొంచెంసేపు మౌనంగానే వుండి ఆ తర్వాత—

"ఇలా చెబుతున్నందుకు క్షమించండి. అసలు ఈ దీవి యే ప్రాంతంలో వున్నదో, ఇక్కడినించి బయలుదేరితే యెక్కడికి వెళతామో నాకు యింతవరకు తెలీదు. నాకే కాదు. ఈ దీవిలో యెవ్వరికీ తెలీదు" అన్నాడు.

ఆ మాటలు వినగానే ఒక్కసారిగా అంతా మృత్యువును చూసినవాళ్ళలా కదిలిపోయారు. అంద్రూస్ మాటలు వాళ్ళ మెదడులోకి విషబాణాల్లా దూసుకు పోయాయి. ఒక్కక్షణం వాళ్ళకు మృత్యువు వొడిలోకి వెళ్ళిపోతున్నట్టు అనిపించింది.

ఈ దీవి ఎక్కడ వున్నదో, యిక్కడినించి బయట పడితే యెక్కడికి వెళతారో యెన్నో యేళ్ళనించి ఆ దీవిలో ఉంటున్న అంద్రూస్‌కే తెలీదా?

అసలు ఆ దీవిలో ఎవ్వరికీ తెలీదా?

ఇది నిజమా?

ఇదే నిజమైతే తమ గతి యేమిటి? తమ కేమిటి దారి? శాశ్వతంగా అంద్రూస్‌లాగే అంతా ఆ దీవిలోనే గడ్డాలు పెంచుకొని మొరటు మనుషుల్తో కలిసిపోయి జంతుచర్మాలు కట్టుకుని వాళ్ళలాగే జీవించాలా?

లేక దిగులుతో చచ్చిపోవటమా?

ఏమిటి? ఏమిటి?

భారత్—అంద్రూస్‌ను యేదో అడగటానికి నోరు తెరిచాడు. కాని అతడికి ఆ అవకాశం లేకుండా పోయింది.

ఉన్నట్టుండి ఆ స్త్రీ పెద్దగా రోదించటం మొదలు పెట్టింది. ఉలిక్కిపడ్డాడు భారత్.

ఆంద్రూస్ చివుక్కున ఆమెవైపు తిరిగి "ఎందుకు ఏడుస్తోంది?" అన్నాడు.

స్టెల్లా అన్నది, "ఆమే రాత్రి కూడా యేడ్చింది. ఆమెకు భయంగా వుందిట. మీరు ఈ దీవినించి బయట పడటం యెలాగో తెలియదని చెప్పటంతో అప్‌సెట్ అయ్యింది."

నాయకుడికి ఈ గొడవేమిటో అర్థం కాలేదు. కిచకిచ లాడుతూ ఆంద్రూస్‌ను యేదో అడిగాడు. అందుకు ఆంద్రూస్ ఆ బృందానికి వచ్చిన సమస్య గురించి చెప్పి వాళ్ళంతా దిగులుపడుతున్నారని అన్నాడు.

నాయకుడు విచారంగా మార్చాడు వదనాన్ని. వెంటనే యేదో అన్నాడు.

స్టెల్లా మిగిలిన ఇద్దరు స్త్రీలు ఆ యేడుస్తున్నామెను ఓదార్చారు.

"దిగులుపడకు. ఏదో ఒక మార్గంతో మనం తప్ప కుండా ఈ దీవినించి బయటపడతాం. మనందరం ఎంతో ప్రశాంతంగా యీ సమస్యను గురించి ఆలోచించాలి. దిగులు, ఏడుపు, భయం సమస్యలకు పరిష్కారం ఎప్పటికీ కాదు...."

ఇలా చెబుతూ ఆమె యేడుపును కొంతవరకు అరికట్ట గలిగారు.

"ఏమిటి నాయకుడు అంటున్నాడు?" భారత్ — ఆంద్రూస్‌ను అడిగాడు.

ఆంట్రూస్ తల ఎగరేసి "నాయకుడు కూడా యిదే అంటున్నాడు. తను ఈ దీవిలో పుట్టాడట. ఈ దీవిలోనే

పెరిగాడట. కాని యెప్పుడూ ఈ దీవిని వదిలి పోలేదట. అప్పుడప్పుడు యెవరైనా విధివశాత్తూ ఈ దీవికి వచ్చిన మనుష్యులు కూడా బయటపడాలనే ప్రయత్నాలు చేసినా వాళ్ళ శవాలు సముద్రంలో తేలుతూ ఈ దీవికే కొట్టుకు వచ్చాయట. ఇతర దీవులతో ఈ దీవికి యెలాంటి సంబంధాలు లేవు. అందుకే ఈ దీవిలోని టకారాజాతి మనుష్యులంతా యెంతో నిర్భయంగా జీవిస్తున్నారు. మరో దీవి జాతులతో వైరం యేర్పడే అవకాశం లేదు. వాళ్ళు దండెత్తి వస్తారనే భయం లేదు" అని చెప్పాడు.

ఆయన చెప్పిన సుదీర్ఘమైన ఉపన్యాసం వినేసరికి అందరికీ నిస్సత్తువ ఆవహించింది. బ్రతుకుమీద ఆశ ఎగిరి పోయింది. తమ చావు షాంకీల్ చావులాగే ఆ దీవిలోనే రాసిపెట్టి వుందని యెంతో గట్టిగా అనుకున్నారు.

ఒక్కసారి భారంగా నిట్టూర్చాడు భారత్. అందరి మొహాల్లోకీ చూశాడు. పాలిపోయి వున్నాయి. జీవకళ లేదు. అందరిలోనూ మృత్యు భయమే కనిపిస్తోంది.

ముసలాయన వణికిపోవటాన్ని గమనిస్తే భారత్‌కు జాలి కలిగింది. ఆయన యేదో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నాడు కాని మాట్లాడలేకపోతున్నాడని గ్రహించాడు. మిగిలిన అందరి పరిస్థితి కూడా దాదాపు అట్లాగే వుంది.

చివరగా ఆంద్రూస్‌ను చూశాడు మళ్ళీ.

భారత్ చూపులోని ఆంతర్యాన్ని గ్రహించినట్టు "ఐయామ్ సారీ భారత్.... వెరీసారీ వెరీ.... నేను చెప్పిన ఈ కఠోర నిజం మీ అందరి గుండెలమీదా చావుదెబ్బ కొట్టివుంటుందని నాకు తెలుసు. ఐనా తప్పదు. నేనెలా మిమ్మల్ని మభ్యపెట్టేది? నిజం ముందుగా తెలిస్తే మీరు

గుండె రాయి చేసుకుని బతుకుతారు. ఇన్నేళ్ళుగా నేను ఈ దీవిలోనే యెందుకు వుండిపోయానో ఇప్పటికైనా అర్థమయ్యిందా? కొన్నేళ్ళు ఈ జీవనానికి అలవాటు పడిన తర్వాత యేదో విధంగా రిస్కు తీసుకుని బయటకు వెళ్ళిపోవాలనే ఆలోచన నశించిపోతుంది... దట్సాల్" అన్నాడు అతని భుజంమీద చిన్నగా తడుతూ.

నాయకుడు మౌనంగా అందరి ముఖకవళికలనూ గమనిస్తూ సింహాసనంమీద కూర్చుని వున్నాడు. అయితే అతనికి చీమ కుట్టినట్టు కూడా అనిపించలేదు.

టకారాజాతి మనుషులు చిన్నగా అప్పుడప్పుడు నాయకుడిని ఏవో గుసగుసగా అడుగుతున్నారు. నాయకుడు చిన్నగానే వాళ్ళకు జవాబులు చెబుతున్నాడు.

ఎండెక్కుతోంది. సూర్యుడు ఆకాశంమీద జరజరా పాకుతున్నాడు.

సెల్లాకు కూడా ఆ పరిస్థితిలో ఎలా మూవ్ కావాలో అర్థం కాలేదు. ఆ బృందం మొత్తంలో భారత్—సెల్లా ఆ యిద్దరే యిద్దరు కొంచెం ధైర్యంగా వున్నారు. మిగిలిన అందరూ జారిపోయిన గుండెలతో జీవచ్ఛవాల్లా నిలబడి వున్నారు.

అంతటా మౌనమే చోటు చేసుకుని వుంది.

దాన్ని ఛేదిస్తూ "ఒకసారి ఈ దీవినిచూసి వస్తారా?" అడిగాడు ఆంద్రూస్.

వెంటనే ఎవ్వరూ మాట్లాడలేదు.

భారత్ తల పైకెత్తి చూసే కాంతులను వెదజల్లుతున్న మణి కనిపించింది. ఆ దేవత విగ్రహం భయానకంగా వుంది. పెద్ద పెద్ద కనుగుడ్లు—బయటకు పొడుగ్గా సాగిన ఎర్రని నాలుక—దానికి రెండువైపులా పొడుగాటి

తెల్లని కోరలు.... చేతుల్లో ఈ టెల్లాంటి ఏవో ఆయుధాలు. ఎంతో యెత్తుగా వుంది. కొండలో తొలచిన ఏకశిలా విగ్రహంలా వుంది. మెళ్ళో గుండెల మధ్య వేల్లాడుతున్న హారంలో ఆ అద్భుత మణి....

ఊహు....తప్పదు. ఏదో మార్గం అన్వేషించాలి.... ఆ మణితో ఈ దీవినించి పారిపోవటంకోసమైనా సరే యిక్కడినించి బయట ప్రపంచానికి వెళ్ళే దారిని వెతకాలి....

దృఢంగా అనుకున్నాడు.

"డియర్ ఫ్రెండ్ .... ఈ దీవిని ఒకసారి చూస్తారా?" ఆంద్రూస్ మళ్ళీ అడిగేసరికి భారత్ తన ఆలోచనలనించి బయటపడి తల వూపాడు.

"ఈ దీవిలో ప్రతి నిమిషం ప్రమాదంతో కూడుకుని వుంటుంది. ఏ వైపునించి ప్రమాదం ఏ జంతువు రూపంలో వస్తుందో తెలీదు. అలాంటి ప్రమాదాలను ఎదుర్కొగల మనో ధైర్యం వుంటేనే దీవి లోపలకు వెళ్ళండి. మీరు లోపలకు వెళుతున్న మార్గాన్ని జాగ్రత్తగా గుర్తుంచుకోండి. వీలయితే ఏవయినా గుర్తులు పెట్టుకోండి. లేకపోతే తిరిగిరావటం కష్టం."

ఆంద్రూస్ అలా అనేసరికి భారత్—స్టెల్లా తప్పించి మిగిలినవాళ్ళు "వద్దు....అనుక్షణం ప్రమాదం ఎదురైతే మేము ఎదుర్కోలేము" అన్నారు.

స్టెల్లా అన్నది "ప్రస్తుతం మనం ప్రమాదంలోనే వున్నాం. ఈ దీవినించి బయటపడే అవకాశం ఇక యెలాంటి పరిస్థితులలోనూ వుండదని నిర్ధారించుకున్న తర్వాత ఇక్కడే ఈ జాతి మనుషుల్లాగే అనుక్షణం ప్రమాదాలను ఎదుర్కొంటూ బతకాలి. ఇటువంటప్పుడు

ప్రమాదానికి భయపడి యిక్కడే గోళ్ళు గిల్లుకుంటే దిగులుతో భయంతో కుంచించుకుపోతూ కూర్చునేకంటే అలా బయట తిరిగిరావటమే మంచిది."

ఆ తర్వాత యెవ్వరూ మాట్లాడలేదు.

భారత్ అన్నాడు, "ఈ ముగ్గురు ఆడవాళ్ళు మన ఓడ్లుమాన్ ఇక్కడే వుంటారు. మిగిలిన అందరం బయటకు వెళదాం."

సరేనన్నారు.

ఆండ్రూస్ నాయకుడితో యేదో చెప్పాడు. నాయకుడు నలుగురు మనుషులను పిల్చి కిచకిచ లాడాడు.

వాళ్ళు అక్కడినించి వెళ్ళిపోయారు.

ఆండ్రూస్‌తో యేదో చెప్పాడు నాయకుడు.

తల వూపాడు ఆండ్రూస్.

"ఏమిటి? మా గురించేనా?" భారత్ అడిగాడు.

నవ్వి "అవును. నల్లమృగాలు దొరికితే వేటాడి తీసుకు రమ్మంటున్నాడు. నల్లమృగాల మాంసమంటే ఈ టకారా జాతివాళ్ళకు ప్రాణం. మీలు కుదిరి అవి దొరికితే తీసుకురండి. నాయకుడు సంతోషపడతాడు" అన్నాడు ఆండ్రూస్.

ఇంతలోనే వెళ్ళిన నలుగురు మనుషులూ కొన్ని బల్లేలూ, కత్తులతో తిరిగివచ్చారు. వాటిని భారత్ — టిల్లా మిగిలిన వాళ్ళకిచ్చారు.

"ఆయుధాలతోనే దీవి లోపలకు వెళ్ళడం క్షేమకరం. మీదపడే జంతువులతో పోరాడవచ్చు. ఇక వెళ్ళి రండి. కొంతవరకు ఈ జాతిమనిషి మీకు తోడుగా వస్తాడు."

స్త్రీలను ముసలిమనిషిని అక్కడే వదిలి మరోసారి ఆంద్రూస్ కు, నాయకుడికి చెప్పి అక్కడినించి కదిలాడు భారత్. మిగిలినవాళ్ళంతా అతడిని అనుసరించారు. టకారాజాతి మనిషి ఆంద్రూస్ యేదో చెప్పగానే వాళ్ళతో కలిసి బయల్దేరాడు.

ఇళ్ళముందునించి వాళ్ళంతా నడిచి వెళుతుంటే టకారాజాతి పిల్లలు వింతగా చూశారు. పిల్లలు దాదాపుగా భారత్ — స్టెల్లాల ఎత్తులో వున్నారు. వాళ్ళ పాదాలు కూడా బాగా వెడల్పుగా వున్నాయి.

  

పొడుగాటి చెట్ల మధ్యనించి నడుస్తున్నారు. ఎండ చెట్లకొమ్మల మధ్యనించి చీల్చుకుని భూమ్మీదకు పడుతోంది.

ఎవరికివారే ఆలోచనల్లో మునిగిపోయి చాలా యాంత్రికంగా నడుస్తున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ వున్న ఆయుధాలు బరువుగా అనిపించాయి.

బల్లేలు వాడిగా మొనతేలి వున్నాయి. ఏ జంతువు మీదకైనా గురిచూసి విసిరితే దాన్ని చీల్చుకుని లోపలకు వెళ్ళిపోయేలా వున్నాయి. కత్తులు వంపు తిరిగినాయి.

టకారాజాతి మనిషి బల్లాన్ని వూపుకుంటూ నడుస్తున్నాడు. అతడి ఆకారాన్ని చూస్తుంటే అతడు మనుషులను అమాంతం విరుచుకుతినే రాక్షసుడిలా అగుపించాడు. అతను స్టెల్లా పక్కగా వచ్చాడు. ఒక్కసారిగా కుప్పుమని వెగటువాసన కొట్టింది. ఆ వాసనను భరించలేకపోయింది ఆమె. అయినా తప్పలేదు. తన నడక వేగాన్ని తగ్గించింది. అతడు క్షణంలో ఆమెను

దాటి ముందుకు వెళ్ళిపోయాడు.

పొడుగాటి చెట్లు ఆగిపోయాయి. చిన్న చిన్న పొదలు మొదలయినాయి. అక్కడినించే కొత్తదారి మొదలయ్యింది.

రాత్రి వాళ్ళు వచ్చిన దారి కాదు అది. ఆ దారి ఎక్కడికి వెళుతుందో తెలీదు. దూరంగా మళ్ళీ పొడ వాటి చెట్లు కనపడుతున్నాయి.

"ఎంత దూరం యిలా?" యెవరో అడిగారు వున్నట్టుండి.

"తెలీదు. ముందు మనం యిక్కడనించి బయటపడే దారి తెలుసుకోవాలంటే ఈ దీవి గురించి కొంతవరకైనా తెలుసుకోవాలి. అందుకోసమే ఆండ్రూస్ దీవిని చూసారా? అని అడిగినప్పుడు నేను తల వూపాను" భారత్ చెప్పాడు.

చిన్న పొదలు కూడా అంతమయ్యేటప్పుడు పొడువాటి చెట్ల మధ్యనించి ఇద్దరు టకారాజాతి మనుషులు వాళ్ళకు ఎదురొచ్చారు. వాళ్ళ చేతుల్లో బల్లేలతో పాటుగా రెండు నల్లటి జంతువులు కూడా కనిపించాయి.

దగ్గరగా వచ్చిన తర్వాత ఆగిపోయారు.

అప్పుడు పరీక్షగా చూసి అవే ఆండ్రూస్ చెప్పిన నల్లమృగాలు అయివుంటా యనుకున్నారు.

బల్లేలు కడుపులో దిగబడ్డాయేమో! నెత్తురు బొట్లు బొట్లుగా కారుతోంది. వాటి చెవులు పొడుగ్గా వున్నాయి. కొమ్ములు లేవు. వాటి కాళ్ళు తీగలతో కట్టి బల్లెలకు వేల్లాడదీసి భుజాలమీద పెట్టుకున్నారు.

వాళ్ళు భారత్ వాళ్ళతో వస్తున్న టకారా జాతి మనిషితో యేదో మాట్లాడారు.

వాడు యేదో చెప్పాడు.

వాళ్ళేదో అన్నారు నవ్వుతూ పిల్లని చూస్తూ.

వాడు కూడా పిల్లావైపు అదోలా చూసి యేదో చెప్పాడు. తర్వాత ముగ్గురూ నవ్వుకున్నారు వికృతంగా నోర్లు తెరిచి.

వాళ్ళంతా గమనిస్తూనే వున్నారు ఆ ముగ్గురి మాటలు—ప్రవర్తన.

పిల్లా కూడా చూస్తోంది. కాని వాళ్ళు తన గురించే మాట్లాడుకుంటున్నారని తెలిసినా యేం మాట్లాడుకుంటున్నారో అర్థం కాలేదు. వాళ్ళ భాష తమకు తెలియనందుకు బాధపడింది.

ఇదంతా చూసి భారత్ ఆ మనిషితో "ఇక మేం వెళతాము. నువ్వు వెనక్కు తిరిగి వెళ్ళిపో" అని సైగలతో చెప్పాడు.

వాడు కొంచెంసేపు మౌనంగా చూసి తర్వాత సరే నన్నట్టు తల వూపాడు. వాళ్ళు బయలేదుతుంటే జాగ్రత్త అన్నట్టుగా చెప్పి నల్లమృగాలు దొరికితే తీసుకురమ్మని సైగలతోనే చెప్పాడు బల్లెలకు వేల్లాడుతున్న నల్ల మృగాలను చూపి.

తల వూపాడు భారత్.

ఆ ముగ్గురూ వెళ్ళిపోయారు.

నడుస్తూ "వాళ్ళు నా గురించే మాట్లాడుకున్నారని తెలిసింది. కాని ఏం మాట్లాడుకుని వుంటారో వూహించలేకుండా వున్నాను" అన్నది పిల్లా భారత్ తో.

"దేని గురించో యెందుకు? నీ అందం గురించే ఐవుంటుంది."

"ఈ మొరటు మనుషులకు అందం గురించి కూడా

తెలుసా?" కోపంగా అన్నది.

"ఏమో.... తెలీదు. ఇక మనం శాశ్వతంగా ఈ దీవి లోనే వుండిపోవలసి వస్తే అప్పుడు ఈ టకారా జాతి వాళ్ళ కిచకిచల భాష నేర్చుకోక తప్పదు. అప్పుడు తెలుస్తుంది నీకు ఈ మొరటు మనుషులు మన గురించి ఏం మాట్లాడుకుంటారో?"

"వద్దు భారత్. పొరపాటున కూడా నువ్వు ఇలాంటి మాటలు అనొద్దు. మనం శాశ్వతంగా ఈ దీవిలోనే వుండిపోతామనే ఆలోచననే రానీయకు. ఏదోవిధంగా ఇక్కడినించి బయటకు వెళ్ళటం జరిగితీరాలి. మనం కృషిచేస్తే అందుకు మార్గం దొరక్కుండా వుండదు."

"నా ఉద్దేశంకూడా అదే! అందుకే మిగిలినవాళ్ళలా నేనూ ఆండ్రూస్ మాటలు విని కొంత నిరుత్సాహపడినా పూర్తిగా నీరసించిపోలేదు. మండుతున్న విమానం కూలి పోయినా మనం ప్రాణాలతో మిగిలిపోయామంటే తప్ప కుండా మనం మన గమ్యస్థానాలను చేరుకుంటామనే అనిపిస్తోంది. అవును కదూ?" అడిగాడు.

సెల్టా తల వూపిందికాని మిగిలిన వాళ్ళు మాట్లాడ లేదు. ఎందుకో ఎంత ప్రయత్నంచేసినా వాళ్ళందరికీ నమ్మకం కలగటంలేదు. అక్కడినించి బయటపడతామనే ఆశ పూర్తిగా అడుగంటిపోయింది ఆ దీవినీ, ఆ మను షులను చూస్తుంటే.

ఎండ కాల్చేస్తోంది. వేడిగాలి సెగలు కక్కుతోంది. ఆ దీవి వాతావరణ పరిస్థితి చాలా వింతగా అనిపించింది. పగలంతా సెగలు కురిపించే వేడిగాలి చీకటి పడగానే వణుకు పుట్టించే చల్లని చలి గాలి.

పొదలు అంతరించి పోయాయి.

తిరిగి పొడుగ్గా వున్న చెట్లలోకి ప్రవేశించారు. ఐతే ఈ చెట్ల ఆకులు వెడల్పుగా కాకుండా పొడుగ్గా సన్నని చివర్లు కలిగివున్నాయి. గాలికి ఆకు రాలి ఎవరిమీదైనా పడితే అది శరీరంలోకి దిగిపోయేలా వుంది.

ఆకులు రాలి గుట్టలుగా కిందపడి వున్నాయి.

ఎండిపోయిన ఆకులమీదనించి నడుస్తుంటే గలగల మని చప్పుడవుతోంది.

నడుస్తున్నదల్లా ఆగి వొంగి కిందనించి ఓ ఆకును చేతికి తీసుకుంది స్టెల్లా. ఆ ఆకును పరీక్షగా చూసింది. యూకలిప్టస్ ఆకులా వుంది. కాని ఇంకా పొడుగ్గా వుంది. దాని చివర సన్నని ముల్లులా వుంది గట్టిగా.

"చిత్రమైన ఆకు....ఇలాంటి చెట్లను ఇంతకుముందు ఎప్పుడూ చూళ్ళేదు" అన్నది స్టెల్లా.

"అసలు ఈ దీవే చిత్రమైనదిగా వుంది. విషంతో నిండిన పండ్లున్న చెట్లు....ముల్లు వున్న ఆకులు....ఆకలిని రెట్టింపు చేసే పండ్లు....ఇంకా ఇలాంటి వింతలు ఈ దీవిలో ఎన్ని వున్నాయో."

దట్టంగా పరుచుకుని వున్నాయి చెట్లు. ఎండ లోపలకు పడటంలేదు. చల్లగానే వుంది.

"ఇంకా ఎంత దూరం?" నలభై యేళ్ళు దాటుతున్న ఒకాయన అడిగాడు.

"సముద్రం వచ్చేవరకూ నడవాలి. అక్కడకు వెళితే మనకు ఓ ఐడియా అంటూ కలుగుతుందని నా ఉద్దేశం" భారత్ చెప్పాడు.

అందరికీ అసహనంగా వుందని అతడికి తెలుసు. ఐనా తప్పదు. సంఖ్యాబలం తప్పకుండా అవసరం. కలిసి కట్టుగా వుంటేనే ఆ దీవినించి బయటపడటానికి కొంచె

మైనా అవకాశం వుంటుంది. ఓ ప్రమాదాన్ని యెదుర్కోవటానికైనా ఎక్కువమంది మనుషులవసరం తప్పదు. అందుకే అందరికీ ధైర్యం చెప్పటం వాళ్ళు నిర్వీర్యులై పోకుండా చూడటం.

పెద్ద గాలి వీచింది. ఆ చెట్ల ఆకులు రాలాయి.

ఒక ఆకు విసురుగా వచ్చి ఒక వ్యక్తి మెడమీద పడింది.

కెవ్వున అరిచాడు అతను--బాధతో అక్కడే కూలబడిపోయాడు. మెడమీద పొడుగాటి ఆకు దిగబడిపోయి అలాగే వుండిపోయింది.

వెంటనే సెల్లా ఆ ఆకును లాగేసింది.

అతని మెడమీదనించి నెత్తురు చివ్వున బయటకు చిమ్మింది. నెత్తురు రాకుండా వేలితో గట్టిగా నొక్కిపట్టింది.

ఆ వ్యక్తి గిలగిల్లాడిపోయాడు.

"ఎలా వుంది?"

"మంటగా వుంది. కత్తి దిగినంత బాధగా వుంది."

అంతా భయంగా తలలు పైకెత్తి ఆ చెట్లకేసి చూశారు. ఆకులు కత్తుల్లా వూగుతున్నాయి గాలికి.

"ఎక్కువసేపు మనం ఈ చెట్లకింద నడవటంకూడా మంచిది కాదు. వేగంగా నడవండి. అదిగో ఇంకొంచెం దూరంలోనే ఈ కత్తుల చెట్లు అంతమవుతున్నాయి. ఈ చెట్లు దాటితే మనకు ఈ భయం వుండదు."

అతను లేచి నిలుచున్నాడు. అంతా పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడక మొదలుపెట్టారు.

* * *

కొంచెం దూరం నడిచేసరికి ముందు నడుస్తున్న సెల్లా

ఆగిపోయింది.

"ఏమిటి?" అడిగాడు భారత్.

కొంచెం దూరంలో ఆకులమధ్య తలపైకెత్తి జరజర పాకివస్తున్న ఆ ప్రాణిని చూడగానే స్టెల్లా కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి.

నిశ్చయంగా అది పాము! కాని దాని రంగు నీలిరంగు. దాని తల చాలా లావుగా వుంది. తలమీద బుడిపెలాంటిది వుంది. దాన్లోంచి ఏదో ముల్లులాంటిది బయటకు పొడుచుకు వచ్చింది.

స్టెల్లా అదేమిటో చెప్పకముందే వాళ్ళంతా ఆ పామును చూసి భయంతో కొయ్యబారిపోయారు.

వాళ్ళకు కొంచెం దూరంలో వచ్చి ఆగిపోయింది ఆ నీలిపాము. పడగవిప్పి బుసకొడుతూ కళ్ళను అటూ ఇటూ తిప్పుతూ చూస్తోంది.

స్నేక్ పార్కులో ఎన్నో రకాల పాములను చూశాడు భారత్. మిగిలిన వాళ్ళు కూడా చూశారు. కాని అలాంటి నీలిరంగు పామును ఇంతవరకు యెవ్వరూ, యెప్పుడూ చూడలేదు.

అది తోకను పైకి లేపుతూ అటూ ఇటూ ఆకులమీద కొరడాలా కొడుతోంది. చప్పుడవుతోంది.

అంతా నిశ్చేష్టులై విగ్రహాల్లా నిలబడిపోయారు వూపిరి పీల్చటంకూడా మరచిపోయి.

ఆ నీలిరంగు పాము నెలా ఎదుర్కోవటం?

దారికి అడ్డుగా వుండిపోయింది. దాని బుసపెట్టే శబ్దం వింటుంటే గుండెలు అదురుతున్నాయి.

టెన్షన్. దాన్ని భరించటం కష్టంగా వుంది.

పాము అక్కడనించి కదల్లేదు. పడగవిప్పి ప్రతి

సికనుకూ దాన్ని కదిలిస్తూ చూస్తోంది.

“భారత్” పిల్చింది స్టెల్లా.

“ఈ పాము ఓర్పు చూస్తుంటే ఇది చీకటిపడేవరకూ ఇలాగే వుండిపోయేలా ఉంది. దీనికి భయమంటే ఏమిటో ఇప్పటివరకూ తెలిసినట్టులేదు. ఈ వంకీ కత్తులతో, బల్లెలతో ఇలాంటి పాములను ఎదుర్కోవటం టకారజాతి మనుషులకు సాధ్యమేమోకాని మనకు సాధ్యంకాదు. రివాల్వర్‌తో షూట్ చెయ్యవచ్చు. కాని ఈ పాము కోసం ఓ బుల్లెట్‌ను వృథాపరిచటం నాకిష్టంలేదు. అందుకే నాకో ఆలోచన వచ్చింది.”

“ఏమిటా ఆలోచన?”

చెప్పింది స్టెల్లా.

కొంచెం పక్కకు జరిగింది స్టెల్లా. పాము దృష్టి స్టెల్లామీదకు డైవర్టు అయ్యింది. ఒకరి పక్కన ఒకరు నిల్చుని ఉన్నారు.

చిన్నగా వంగాడు భారత్.

గాస్ లైటర్‌తో కింద వున్న ఎండుటాకులను అంటించాడు. బాగా ఎండి వున్న ఆకులు వెంటనే అంటుకున్నాయి.

లేచి నిల్చున్నాడు.

చిటపటలాడుతూ తృణాలమీద ఆకులు అంటుకుని మంట పైకిలేచింది.

అంతా పక్కకు తప్పుకున్నారు. వేడి తగులుతోంది. గాలి సన్నగా వీస్తోంది పామువైపుకే.

ఉలిక్కిపడింది నీలిరంగు పాము.

కళ్ళు మరింత పెద్దవిచేసి ఎర్రగా పైకిలేస్తూ ముందుకు దూసుకు వస్తున్న మంట కనిపించింది.

ఇప్పుడు మనుషులకూ పాముకూ మధ్యగా మంట వచ్చేసింది. ఆకులు మండుతున్నాయి. గాలి మంటను పామువైపుకు నెట్టుకు వెళుతోంది.

ఒకే ఒక్క క్షణం.

వూహించని వేగంతో పాము వెనక్కి తిరిగింది. జరజరా పాకుతూ క్షణాలో ఆకులకిందనించి వెళ్ళిపోయింది.

"గ్రాండ్ సక్సెస్. నీ తెలివి అమోఘం" అన్నాడు భారత్. మిగిలిన వాళ్ళుకూడా శైలాను మెచ్చుకున్నారు.

తిరిగి మంటపక్కనించే ముందుకు వెళ్ళిపోయారు.

కత్తుల చెట్లు అంతే మైపోయాయి.

మామూలు చెట్లు పొదలు ప్రత్యక్షమైనాయి

అన్నీ చిన్న చిన్న చెట్లు. దగ్గరగా వున్నాయి. అంతా అడవిలా వుంది. చెట్లకు తీగలు అల్లుకుపోయాయి.

"ఈ అడవిలో మృగాలు ఉంటాయేమో" అన్నది శైలా.

"వుండొచ్చు. అందుకే మనం ప్రతిక్షణం జాగ్రత్తగా ఉండాలి."

"ఇంకెక్కడ సముద్రం? నడిచీ నడిచీ కాళ్ళు లాగుతున్నాయి."

"ఆకలిగా వుంది. నిన్న సాయంత్రం కనిపించిన చిన్న పండ్ల చెట్లు కనపడలేదు."

ఇలా మాట్లాడుకుంటూ నడుస్తున్నప్పుడు కొంచెం దూరంనించి సముద్రపు హోరు వినిపించింది.

"అదిగో సముద్రం" అరిచారు ఎవరో.

"అవును. అది తప్పకుండా సముద్రం హోరు. చల్లటి గాలికూడా వీస్తోంది. మనం సముద్రానికి చేరువలోకి

వచ్చాము."

మరో పది నిమిషాలకు వాళ్ళకు సముద్రం కనపడింది. పొంగి పొర్లుతోంది.

అక్కడికి దగ్గరిలోనే వుంది.

అలల మీదనించి వస్తున్న గాలి చల్లగా వుంది. సముద్రాన్ని చూడటంతోనే వాళ్ళందరికీ ఉత్సాహం, సంతోషం కలిగినా వెంటనే ఆ సముద్రాన్ని దాటి వెళ్ళటం ఓ సమస్య అనే విషయం గుర్తొచ్చి అంతు లేని నిరుత్సాహం కూడా కలిగింది.

ఇంకొంచెం ముందుకు నడిచారు.

సముద్రానికి చేరువగా వెళ్ళి నిలబడ్డారు.

గంభీరంగా ప్రవహిస్తోంది. కనుచూపు మేరలో అంతా సముద్రమే. తెల్లగా అగుపడుతోంది. ఎక్కడో దూరంగా మరో దీవి ఉన్నట్టు కాని—చెట్లు కాని కని పించటంలేదు.

ఆకాశంలోకి చూశాడు భారత్. సముద్రంమీదుగా ఎక్కడైనా పక్షులు కనపడతాయేమోనని.... ఊహు.... ఒక్క పక్షికూడ కనపడలేదు.

అంటే ఆ దరిదాపుల్లో యెక్కడా భూమి లేదన్న మాట. అంతేకాదు. విమానాలుకూడా ఏవీ ఎగురుతున్న జాడలు కనిపించలేదు.

వెనక్కు తిరిగి చూశాడు.

దట్టంగా పెరిగిన చెట్లు — వాటిని అల్లుకుపోయిన తీగెలు.

భారత్ ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడని అను కుంది స్టెల్లా. మిగిలిన వాళ్ళు కూడా అలాగే అను కున్నారు. ఏమైనా వాళ్ళందరిలో స్టెల్లా—భారత్

ఇద్దరే తమకు విముక్తి కలిగించగలరనే నమ్మకం వాళ్ళకు వుంది—ఒకవేళ ఏదైనా అవకాశం వుండే పక్షంలో.

ఉన్నట్టుండి పెదవులు కదిలించాడు భారత్.

"మన ప్రయత్నం కష్టమైనదే. ఐనా ఇంతకంటే మరో మార్గంలేదు. నాకో ఆలోచన వచ్చింది. ఈ దీవిలో ఉన్న టకార జాతి మనుషులకు, ఆండ్రూస్‌కు కూడా మనం ఇక్కడినించి బయటపడటం ఇష్టంలేదులా వుంది. అందుకే మనకు ఈ మార్గం గురించి సూచించలేక పోయారు. అదేమిటంటే ఈ చెట్ల కొమ్మలను విరిచి తీగెలతో బిగించి తెప్పల్లాంటివి బలంగా తయారుచేసి వాటి సాయంతో మనం ముందు ఈ దీవినించి బయట పడి సముద్రంలో ప్రయాణం చేద్దాం. కొంతదూరం వెళ్ళిన తర్వాత యేదో ఒక ఓడగాని లేక నాగరిక ప్రపంచంతో సంబంధాలు కలిగివున్న మరో దీవికాని మనకు కనపడవచ్చు. మన అదృష్టం బావుండి అలా జరిగితే ఫర్వాలేదు. లేక ఈ దీవిలో ఈ మృగాల్లాంటి మనుషుల మధ్య మృత జీవుల్లా చచ్చేవరకూ బతికేకంటే మన ప్రయత్నంలో ప్రాణాలు పోగొట్టుకున్నా ఫర్వా లేదు. ఎందుకంటే అంతకుమించి మనం చేయగలిగింది ఏదీలేదు. ఇందుకు మీరేమంటారు?" అన్నాడు.

భారత్ వూహించని విధంగా అంతా సంతోషంతో అరిచారు. అతడిని అమాంతం పైకెత్తి గాల్లో గిరగిరా తిప్పారు.

ఎదురుచూడని ఆ చర్యకు భారత్ ఆశ్చర్యపోయాడు. స్టెల్లా కూడా షాక్ తిన్నది.

అతడిని కిందికి దించి "మాకు ఇష్టమే. ఈ ఆలోచన

మా అందరికీ నచ్చింది. నిజమే. జీవచ్ఛవాల్లా ఈ మొరటు మనుషుల మధ్య జంతువుల్లా బతికే కంటే మన గమ్యాన్ని చేరే ప్రయత్నంలో మన ప్రాణాలు పోయినా ఇష్టమే. మనకు ఇంతకుమించి మరో మార్గంలేదు. నువ్వు చెప్పినట్టు వినటానికి మేము సిద్ధంగా వున్నాం" అన్నారు అంతా ఏక కంఠంతో.

"థాంక్ యూ. ఐతే ఇక ఆలస్యం ఎందుకు? ఇప్పుడే మన పని మొదలు పెడదాం."

అంతా సరేనన్నారు.

సముద్రం దగ్గర్నించి వెనక్కి తిరిగి వస్తుంటే "ఈ టకార జాతివాళ్ళు పట్టి స్వార్థపరుల్లా ఉన్నారు. లేక పోతే వాళ్ళకు ఈ మార్గం తెలీకుండా వుంటుందా?" అన్నది సెల్లా.

"ఏమో! తెలీదు. వాళ్ళకు తెలీకపోయినా ఆండ్రూస్ కైనా ఈ ఆలోచన రాకుండా ఉండదు. తప్పకుండా వచ్చి వుండాలి. ఐనా మనకు చెప్పలేదు. ఆయనకి సహజంగానే కొంత జెలసీ వుంటుంది. ఎందుకంటే ఆయన ఎన్నో యేళ్ళుగా ఈ దీవిలో ఓ బందీగా జీవితాన్ని గడుపుతున్నాడు. ఆయన ఉద్దేశం మనం కూడా తనకు తోడుగా ఇక్కడే వుండి అలాగే జీవించా లనేమో....అంతే ఐవుంటుంది" అన్నాడు.

అంతా చెట్ల దగ్గరకు వచ్చారు.

"ఈ వంకీ కత్తులు మనకు ఈ విధంగా ఉపయోగ పడబోతున్నాయి. అదృష్టవశాత్తూ మనల్ని యే క్రూర మృగాలూ అటకాయించలేదు. ఇవిగో ఈ కత్తులతో ఇలాంటి పెద్ద కొమ్మలను నరుకుదాం" అంటూ తన

చేతిలో వున్న బల్లేన్ని సెల్లాకు ఇచ్చి ఆమె చేతిలో వున్న వంకీ కత్తిని గను తీసుకున్నాడు.

* * *

అంతా ఉత్సాహంగా కొమ్మలు నరకటం మొదలు పెట్టారు. సెల్లా తీగలు తెంచి భారత్ చెప్పినట్టుగా మరో ఇద్దరి సాయంతో వాటిని కొమ్మలకు వేసి కట్టేస్తోంది.

రెండు గంటలు పైగా గడిచాయి.

ఒకవైపు కొమ్మలను నరుకుతూనే మరోవైపు క్రూర మృగాలు ఏవైనా వస్తున్నాయేమోనని చూస్తున్నాడు భారత్.

వంకీ కత్తులు చప్పుడు చేస్తున్నాయి.

భారత్ నరకటం ఆపేసి తెప్పలను తయారు చేస్తున్నాడు.

ఉన్నట్టుండి వాళ్ళకు పులి గాండ్రింపు వినపడింది. వెంటనే మళ్ళీ వినపడింది. అంతా షాక్ కొట్టినట్లు అదిరిపడి లేచి నిల్చున్నారు.

అలా నిల్చుంటున్నప్పుడే సెల్లా—భారత్‌ల దృష్టి కొంచెం దూరంలో ఓ చెట్టు చాటున నిలబడి తమనే చూస్తోన్న టకారి జాతివాడిమీద పడింది.

వాడ్ని చూసి షాకైవారు వాళ్ళు. సులభంగానే గుర్తుపట్టారు వాడిని. వాడు రాత్రి వల్లమృగం మాంసాన్ని విస్తళ్లలో పెట్టుకు వచ్చిన వాళ్ళలో ఒకడు.

భారత్—సెల్లా వాడిని చూడటంతోనే కలవరపడి అక్కడినించి వెనక్కి తిరిగి వేగంగా నడిచాడు.

తాత్కాలికంగా వాళ్ళు పులి గాండ్రింపు గురించి మరచిపోయినా మరోసారి ఆ గాండ్రింపు వినేసరికి ఈ

లోకంలోకి వచ్చారు. సరిగ్గా అప్పుడే పెద్ద చావు కేక కూడా వాళ్ళకు వినపడింది.

చెట్ల మధ్యలో ఆకులమీద పొర్లుతున్న చప్పుడు.

ముందుకు పరిగెత్తారు.

చెట్ల వెనుకవైపు వున్న చిన్న ఖాళీ ప్రదేశంలో ఎదురుగా కనిపించిన దృశ్యం చూడగానే చలించి పోయారు.

బల్లెం దూరంగా పడిపోయింది. అక్కడినించి వేగంగా వెళ్ళిన టకార జాతివాడు కిందపడి దొర్లుతున్నాడు. పులి వాడిని పంజాతో కొడుతూనే నోటితో గొంతు పట్టుకోటానికి ప్రయత్నం చేస్తోంది.

వాడు దొర్లుతూనే బల్లెం దగ్గరకు వచ్చాడు. చేత్తో దాన్ని అందుకోబోయాడు. కాని కుదర్లేదు. పులి ఎగిరి చేతిమీదకు దూకింది. పళ్ళతో ఆ చేతిని పీకింది.

హృదయవిదారకంగా అరిచాడు. మణికట్టువరకు చెయ్యి తెగిపోయింది.

ఆ దృశ్యాన్ని చూస్తుంటే అందరి కాళ్ళూ వణికాయి.

సెల్లా చూస్తూ వూరుకోలేకపోయింది. రివాల్వర్ బయటకుతీస్తూ "పాపం వాడు అన్యాయంగా ప్రాణాలు పోగొట్టుకుంటున్నాడు. నువ్వు వెనుకనించి బల్లెం విసురు. నేను షూట్ చేస్తాను" అన్నది సెల్లా.

ఆమె ప్రయత్నాన్ని వారించాడు భారత్.

"వద్దు వాడు చావాలి. వాడు బతకటం మనకే ప్రమాదం. ఒకవేళ వాడు పులివాత పడకుండా వున్నట్లయితే నేనే వాడ్ని చంపి సముద్రంలోకి విసిరే వాడ్ని."

ఆశ్చర్యంగా అతడి మాటలు అర్థం అవక కళ్ళలోకి చూసింది.

మిగిలినవాళ్ళు ఎగ్సయిట్ మెంట్ తో పులికీ వాడికి జరుగుతున్న పోరాటాన్ని చూస్తున్నారు. ఒంటిచేత్తోనే వాడు పులి దెబ్బలను కాచుకునే ప్రయత్నాలు చేస్తున్నాడు. అప్పటికే వాడి శరీరమంతా గాయాలతో నిండిపోయింది.

కీచకీచల భాషలో ఏదో అరుస్తున్నాడు. "రక్షించండి" కాపాడండి అని అయి వుండవచ్చు.

"అవును స్టెల్లా వాడు చావాలి. వాడితో మనకు ఎటువంటి శత్రుత్వమూ లేకపోయినా ఇలా కోరుకోక తప్పదు. ఎందుకంటే మనం తెప్పలను తయారుచెయ్యటం వాడు చూశాడు. చూసినవాడు వూరుకోడు. నాయకుడికీ, ఆంద్రూస్ కీ చెబుతాడు. వాళ్ళకీ విషయం తెలిస్తే వాళ్ళు మనల్ని యేమయినా చెయ్యొచ్చు. లేకపోతే వీడు మనల్ని రహస్యంగా కనిపెట్టవలసిన అవసరం ఏమిటి?"

స్టెల్లా కళ్ళు మెరిశాయి.

"నువ్వు చెప్పింది నిజం. వాడు బ్రతికే వుంటే మన పథకం అమలు జరిగే అవకాశం వుండదు."

ఇక వాడిలో శక్తి అయిపోయింది. దొరికినచోటు నల్లా గాయపరిచింది పులి. చివరకు ఒక్కసారి నోరంతా తెరిచి వాడి గొంతుకు పట్టుకొని కొరికింది.

చావుకేక పెట్టబోయాడు కాని ఆ కేక బయటకు రాలేదు. కీచుమంటూ ఆగిపోయింది.

భయానకమైన ఆ దృశ్యాన్ని చూడలేక కళ్ళు మూసుకున్నారు. భయంతో వణుకుపుట్టింది. యెంతో దగ్గరగా పులి ఓ మనిషిమీద దాడిచేసి పీక కొరికి చంపే

దృశ్యం.

రెండు నిమిషాల్లో వాడిలో చలనం ఆగిపోయింది. వాడిని నోటితో కరిచి పట్టుకుని అక్కడినించి దూరంగా యెక్కడికో పరుగుదీసింది.

అందరూ భారంగా నిట్టూర్చారు.

"మై గాడ్. టెర్రిబిల్ ఇన్సిడెంట్. ఐ హావ్ నెవర్ సీన్ ఇన్ మై లైఫ్" అన్నది స్టెల్లా.

"ఈ టకార జాతి మనిషి షాంకీల్ లాగే మనల్ని కాపాడాడు. వాడు పులినోటికి దొరక్కుండా వున్నట్లయితే అది తప్పకుండా మనమీద •దాడిచేసి వుండేది" భారత్ అన్నాడు.

"గూడెంలో అంతా మనకోసం ఎదురుచూస్తూ ఉంటారు. మిగిలిన పనిని రేపు వచ్చి పూర్తిచేసుకుందాం. ఇక బయల్దేరుదాం" అన్నది స్టెల్లా.

అప్పటివరకూ నరికిన కొమ్మలను కట్టిన తెప్పలను పొదల మధ్య గుర్తుగా ఒక ప్రదేశంలో యెవ్వరికీ కనపడకుండా దాచి వాటిమీద ఆకులను కప్పేసి బల్లెంలో వంకీ కత్తులతో గూడెంకేసి బయల్దేరారు.

ఇప్పుడు వాళ్ళంతా ఉత్సాహంగా నడుస్తున్నారు. సముద్రం హోరు క్రమంగా మారమవుతోంది.

* * *

ఆ రోజు ఉదయంకూడా వాళ్ళందరికీ మామూలుగానే తెల్లవారింది.

సూర్యుడు ఉదయించాడు. తన వెచ్చని బంగారు కిరణాలతో అందరినీ పలకరించాడు. ఆ రోజు వాళ్ళంతా ఓ, నూతన ఉత్సాహంతో ఉన్నారు.

ఎందుకంటే ఆ ప్రమాదాల బందిఖానాలాంటి దీవి నించి, అనాగరికంగా జీవిస్తున్న ఆ మొరటు మనుషుల నించీ, వెగటు వాసననించీ బయటపడటానికి ఓ మార్గం దొరికినందుకు—

మామూలుగానే వచ్చి నాయకుడికి అంతా అభివాదాలు చేశారు. నాయకుడు సంతోషపడిపోయాడు.

కొంచెం సేపటికి ఆంద్రూస్ వచ్చాడు. అందరినీ ఆప్యాయంగా పలకరించాడు. ఐతే తమ మొహంలో వున్న ఉత్సాహాన్నీ, సంతోషాన్నీ వాళ్ళెవరి ఎదుటా కనపరచకూడదని ముందుగానే నిర్ణయం చేసుకున్నందున క్రితం రోజు లాగే కనిపించారు.

ఆంద్రూస్ అప్పుడే టకారాల ఆతిథ్యం గురించి ఒక మాట చెప్పాడు. వాళ్ళు ఏడు రోజులు మాత్రమే ఆతిథ్యం ఇస్తారుట. ఎనిమిదవ రోజునించీ ఆ దీవికి వచ్చిన అతిథి ఎవరైనా తన ఆహారం తనే సంపాదించుకోవాలి. తన ఇల్లు తనే నిర్మించుకోవాలి.

లెక్కలు వేసుకున్నారు భారత్ వాళ్ళు.

అప్పటికి తాము టకారాల ఆతిథ్యం స్వీకరించి మూడు రోజులు అయ్యింది. అంటే ఇంకో నాలుగు రోజులవరకే తమకు టకారాల ఆతిథ్యం వుంటుంది. అంటే ఆ తర్వాత ఆ దీవిలోనే వుంటే తాము కూడా నల్లమృగాలను వేటాడక తప్పదు.

ఆంద్రూస్ ఇంకా ఆ దీవి వాసులకు వున్న రకరకాల ఆచారాల గురించి చెబుతున్నాడు. అంతా ఆసక్తిగా వింటున్నారు. అతను తన మాటలను ముగించగానే త్వరగా సముద్రం దగ్గరకు వెళ్ళి చెట్లను నరికి తెప్పలను కట్టుకుందాం అనే ఆలోచనలో వున్నారు.

సరిగ్గా ఇలాంటి సమయంలోనే ఓ ఐనుగురు టకార జాతి మనుషులు చేతిలో బల్లేలు పట్టుకుని వగరుస్తూ పరిగెత్తుకుని వచ్చారు. వాళ్ళ పక్కనే రెండు మెడలు పొడుగ్గా వున్న జంతువులు ఉన్నాయి. అవి నక్కల్లా వున్నాయి కాని నక్కలు కాదు. వాటి తోకలు బాగా పొడుగ్గా భూమిని తాకుతున్నట్టున్నాయి. కళ్ళు పిల్లి కళ్ళలా వున్నాయి. అవికూడా నాలుకలను బయటకు వుంచి చొంగ కారుస్తూ వాళ్ళ పక్కనే పరిగెడుతూ వచ్చాయి.

వాళ్ళంతా అదే మొదటిసారిగా ఆ జంతువులను చూడటం. అవి వేటకుక్కల్లాంటి జంతువులు అయి వుంటాయనుకున్నారు.

కాని-ఆ జంతువులు ఒక విలక్షణమైన గుణం కలిగినవి. చచ్చిపోయిన మనుషుల జాడను యెక్కడ వున్నా పసి గట్టగలవు. ఆ క్రితంరోజు మధ్యాహ్నం నల్లమృగాల వేటకు వెళ్ళి తిరిగిరాని టాకారజాతి మనిషి ఆచూకీకోసం వాటిని తీసుకుని వెళ్ళారు. కాని అవి ఆ మనిషి గురించి తెలియజెయ్యకపోయినా మరో మనిషి గురించి తెలియ జేశాయి.

వాళ్ళ మొహంలో కనపడుతున్న ఆతృతను చూడ గానే ఆంద్రూస్, నాయకుడితోపాటు మిగిలినవాళ్ళు కూడా యేదో జరిగివుంటుందనీ, ఏదో ఒక విషయం వాళ్ళను కలవరపరిచి వుంటుందనీ గ్రహించారు.

కిచకిచల భాషలో నాయకుడితో రెండు క్షణాల్లో విషయాన్నంతా చెప్పేశారు.

ఆ వార్త వింటూనే నాయకుడు ఉగ్రుడై పోయాడు. పళ్ళు కొరుకుతూ ఒక్కసారిగా సింహాసనం మీదనించి

లేచి నిలబడ్డాడు పెద్దగా కేకలు పెడుతూ—

వాళ్ళు చెబుతున్నప్పుడే ఆంద్రూస్‌కు ఆ వార్త యేమిటో అర్థమైపోయింది. మనసులో ఏమనుకున్నాడో యేమోగాని పైకి మాత్రం గంభీరంగా మొహాన్ని సీరియస్‌గా వుంచుకున్నాడు.

నాయకుడు నిలుచోగానే మిగిలినవాళ్ళుకూడా అంతా లేచి నిలబడ్డారు.

అందరికీ నాయకుడి మొహం చూడగానే భయంతో ఒళ్ళు జలదరించింది. అప్పటివరకు ఎంతో ప్రశాంతంగా ఉన్న నాయకుడి మొహం ఒక్కసారిగా అలా వికృతంగా—కర్కశంగా—ప్రళయంగా కనపడేసరికి వణుకు పుట్టింది.

భారత్‌కీ సెల్లాకీ నాయకుడి ఆగ్రహానికి కారణం ఏమిటో ఆ భాష అర్థం అవకపోయినా అక్కడి పరిస్థితినిబట్టి నాయకుడి ప్రళయరూపం చూసి అర్థమయిపోయింది.

అదే—ఆ రెండు నక్కల్లాంటి జంతువులు షాంకీల్ శవాన్ని పసిగట్టాయి. అక్కడ తవ్వి చూసిన టకారి జాతి మనుషులు ఆ శవాన్ని చూసి నాగరికుల శవంగా గుర్తుపట్టి ఆ శవం రెండు రోజులక్రితమే పూడ్చిపెట్టబడిందని తెలుసుకున్నారు.

నాగరికులను చూస్తూ నాయకుడు కిచకిచల భాషలో ఘోరంగా అరుస్తున్నాడు.

సెల్లాకీ—భారత్‌కీ శరీరమంతా తెలియని భయం యేదో ఆవహించుకున్నది.

తామంతా ఏదైతే జరగకూడదని భయపడ్డారో అదే జరిగింది. షాంకీల్ శవం బైటపడింది. ఓ శవాన్ని

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అవన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

భూమిలో పాతిపెట్టటం ఆ జాతి మనుషుల ఆచారాలకు యెంత విరుద్ధమైనదో ఆంగ్రదూస్ చెప్పాడు. పైగా దాని పర్యవసానం చాలా దారుణంగా ఉంటుందనికూడా అన్నాడు.

దారుణంగా అంటే యేమిటి?

ఆంగ్రదూస్ వైపు తిరిగాడు నాయకుడు. ఆయనతో ఏదో చెప్పాడు నిప్పులు రాలుతున్న కళ్ళతో....

అప్పుడు ఆంగ్రదూస్—భారత్ తో ఇలా అన్నాడు.

"మనం భయపడిందే జరిగింది. ఐతే నిన్న మధ్యాహ్నం నల్లమృగాలకోసమని వెళ్ళిన ఈ గూడెం మనిషి ఒకడు అదృశ్యమైపోయాడు. వాడు యేదైనా క్రూరజంతువువాత పడ్డాడేమో తెలుసుకోటానికి పొడుగాటి మెడలు వున్న జంతువులతో వెళ్ళారు. ఈ జంతువులు ఆ విష పండు తిని మరణించిన మీ మనిషి శవాన్ని వాసనపట్టి వీళ్ళకు చూపించాయి. వాళ్ళు గొయ్యి తవ్వి శవాన్ని చూశారు. ఆ శవం మీకు సంబంధించిన మనిషి దేననీ, ఆ శవాన్ని మీరే పాతిపెట్టారని తెలుసుకుని వచ్చి ఇప్పుడు నాయకుడితో చెప్పారు.

నేను మీకు ముందే చెప్పానుకదా! మరణించిన మనిషిని ఈ దీవిలో ఏం చేస్తారో? అలా కాకుండా పాతిపెడితే ఇక్కడ యెంత అపచారమో కూడా చెప్పాను. ఇప్పుడు నాయకుడు మీమీద కోపంతో మండిపడుతున్నాడు. మీకంతా ఆతిధ్యం ఇచ్చిన మనిషికి నమ్మకద్రోహం చేశారని అంటున్నాడు. ఇలా ఎందుకు చేశారో మిమ్మల్ని అడగమంటున్నాడు?"

ఆగి నాయకుడి మొహంలోకి చూశాడు ఆంగ్రదూస్.

సరిగ్గా అప్పుడే డప్పుల మోత వినిపించింది.

"జరిగిందంతా మీకు ఇంతకుముందే చెప్పాను. షాంకీల్ విష పండు తిని మరణించాడు. మా ఆచారం ప్రకారం అతడి శవాన్ని జంతువులు పీక్కు తినకుండా వుండేందుకు గొయ్యితీసి పాతిపెట్టాము. అప్పటికి ఈ దీవిలో మీరంతా ఉన్నారని కూడా మాకు తెలీదు. అందువల్లనే ఆ మనిషిని పాతిపెట్టడం జరిగింది. ఇందులో మా తప్పు ఏమిటో మాకు తెలీదు. తెలియక చేసిన అపచారమే ఐనా మమ్మల్ని క్షమించ వలసిందిగా నాయకుడిని కోరుతున్నట్టుగా చెప్పండి" అన్నాడు భారత్.

"నాయకుడు ఇందుకు ఒప్పుకుంటాడని నాకు నమ్మకం లేదు. ఎందుకంటే ఆచారాలు, నమ్మకాల విషయంలో ఎంత గట్టి పట్టుదల ఉన్న మనుషులో మీకు తెలీదు. ఐనా నువ్వు నాయకుడికి చెప్పమంటున్నావు కాబట్టి చెబుతాను" అంటూ భారత్ చెప్పినదంతా నాయకుడికి చెప్పాడు.

డప్పుల మోత ఆగిపోగానే గూడెంలో ఉన్న టకార జాతి మనుషులంతా అక్కడకు గబగబా వచ్చేశారు. స్త్రీలంతా పిల్లల్నికూడా తీసుకువచ్చారు. వాళ్ళందరినీ గమనించాడు భారత్. వెంటనే అతనికి ఒక విషయం మాత్రం చాలా క్లియర్‌గా తెలిసిపోయింది.

శవాన్ని పాతిపెట్టిన విషయం వాళ్ళందరిలోనూ, ఎంతో గొప్ప సంచలనాన్ని. భయాన్ని లేవదీసిందనీ గ్రహించాడు.

అంటే ఆ విషయానికి వాళ్ళెంత ప్రాముఖ్యత ఇస్తున్నారో అర్థమయిపోయింది. (సశేషం)

